# హెచ్చరిక

## శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి

చిన్నకథలూ,
నవలలూ,
నాటకాలూ,
రూపికలూ,
చరిత్రలూ,
మీగడతరకలూ,
ఖండకావ్యాలూ,
వర్ణచిత్రాలూ,
మెరుపుదెబ్బలూ,
వ్యాఖ్యానాలూ,
వ్యాసాలూ
మొదలయినవి

**లిఖితరూపంగా, వారి, అనుమతి పొందకుండా**

**భాషాంతరీకరణం, ప్రదర్శనం, బ్రాడ్ కాస్టింగు,**
**రికార్డింగు, స్క్రీనింగు, అనుసరణం,**
**ముద్రణం, ప్రకటనం**
**వగైరా ఏ విధంగానూ ఎవరూ**
**వుపయోగించుకో గూడదు**

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి నాటకాలు

# నిగళబంధనం

పబ్లిషర్సు,
కళాభివర్ధనీ పరిషత్తు
రాజమహేంద్రవరం

మొదటికూర్పు 1951 ఏప్రిల్ ప్రతులు 1000



రాజమహేంద్రవరం
అద్దేపల్లి నాగేశ్వరరావుగారిచే
సరస్వతీ పవర్ ప్రెస్సున ముద్రించబడ్డది

# ప్రధానపోషకులు

శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారు
ప్రొప్రయిటరు, సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి

కీ. శే. దురిశేటి శేషగిరిరావు పంతులుగారు, కాకినాడ

# మహారాజపోషకులు

కీర్తిశేషులు

కళాప్రపూర్ణ, సాహిత్యసమ్రాట్టు

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు డి.లిట్.

జయపురం

# పోషకులు

శ్రీ తూములూరి శివరామయ్య పంతులుగారు
బి. ఏ., బి. ఎల్. అడ్వకేటు. నెల్లూరు

శ్రీ వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రిగారు
ప్రొప్రయిటరు: వి. రామస్వామిశాస్త్రులు & సన్సు. మద్రాసు

శ్రీ పడిద వేంకటరావు పంతులుగారు
భూస్వాములు. మహేంద్రవాడ

శ్రీ ద్వారంపూడి వేంకటరెడ్డిగారు
భూస్వాములు. అనపర్తి

శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు
బి. ఏ., సి. బి. ఇ. భూస్వాములు. బుచ్చిరెడ్డిపాళెం

శ్రీ కుప్పల శ్రీరామమూర్తిగారు
మిల్లు ఓనరు. అనకాపల్లి

శ్రీ ఎం. వి. ఆర్. అణహరాచార్యులుగారు
అగ్రహారందారు. మద్రాసు

శ్రీ వి. నాగయ్యగారు
రేణుకా ఫిలిమ్సుడైరక్టరు. మద్రాసు

కీ. శే. నబ్బెళ్ళ వద్దయ్యగారు కొంకుదురు
„ కర్రి చినవేంకటరెడ్డిగారు మూరుమూరు
„ చిట్టి నారాయణమూర్తిగారు తణుకు
„ ద్విభాష్యం వేంకటేశ్వర్లుగారు చింతలూరు
„ ద్వారంపూడి రామారెడ్డిగారు అనపర్తి

# సమర్పణం

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి,
వారి, షష్టిపూర్తిమహోత్సవ సందర్భాన,
సమ్మాన సంఘంవారు,

## అనకాపల్లి వైశ్యప్రముఖుల

భూరి విరాళాలతో
అచ్చు వేయించి సమర్పించిన పుస్తకం

# పాత్రల వివరాలు

...o0o...

## పురుషులు

1 తిమ్మరుసయ్య—మహామంత్రి
2 అచ్యుతదేవరాయడు—కృష్ణదేవరాయని సవతి తమ్ముడు
3 వియ్యన్న—నాగమ్మ సర్వసేనాధిపతి
4 విరూపాక్షరాయడు—తిప్పమ్మ చెల్లెలి కొడుకు
5 తిమ్మరాజు—తిప్పమ్మ మనుమడు

## స్త్రీలు

1 నాగమ్మ—కృష్ణదేవరాయని తల్లి
2 తిప్పమ్మ—కృష్ణదేవరాయని సవతి తల్లి
3 లక్ష్మమ్మ—తిమ్మరుసయ్య భార్య
4 నీలమ్మ—కృష్ణదేవరాయణ్ణి ప్రేమించిన యువతి
5 రుక్కమ్మ—తిప్పమ్మ కోడలు

మరికొందరు పరిచారికలు దాసీలు, భృత్యులు వస్తారు

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి నాటకాలు

# నిగళబంధనం

## మొదటి రంగం

•••••○•••••

మహామంత్రి తిమ్మరుసయ్య భవంతి. లోపలివసారాలో, తిమ్మరుసయ్య ఒక కుర్చీమీద కూచునివుంటాడు. ఎదట, అతనిభార్య లక్ష్మమ్మ నుంచుని వుంటుంది.

తిమ్మరుసయ్య—ఇంకేమి లాభం లక్ష్మీ? అంతా అయిపోయింది. అదొక స్వప్నం లాగ జరిగిపోయింది. అదొక కట్టుకథ అనుకుని వూరడిల్లు ఇక.

లక్ష్మమ్మ—మీకేం చెబుతారు. మనస్సులో నాటుకోడమే వస్తే ఆడది యిక మరిచిపోలేదు. కృష్ణ ఎదురుపడితే మీ కెలా వుండేదో కాని, ప్రాజ్ఞత వచ్చిన కొడుకుని చూస్తే ఎలా వుంటుందో అలా వుండేది నాకు. అతను, దగ్గిరికి వచ్చి "అమ్మగారూ" అనేటప్పటికి నాకు వొళ్ళు గరిపొడిచేది. "ఇతగాణ్ణి నాకడుపున యెందుకు పుట్టించావు కాదు?" అని ఈశ్వరునిమీద నాకదోలా వుండేది.

తిమ్మరుసయ్య—వెర్రిదానా, కృష్ణుణ్ణి అంతవాణ్ణి చేసింది నేనూ, తెలియదూ? నిజంగా, నాకుడిభుజం, పడిపోలేదూ యివ్వాడూ?

లక్ష్మమ్మ—మీచెయ్యి మీరే నరుక్కున్నారు, తెలుసా?

తిమ్మరుసయ్య—సందేహ మేమిటి? అయితే, ఏమి చెయ్యగలనూ? రాజాజ్ఞ అలా వుంది మరి. ఈశ్వరాజ్ఞనైనా తిరస్కరించవచ్చు గాని రాజాజ్ఞ జవదాటగలమా? రాజసేవ పాములతో చెలగాటమూ, కత్తులమీది సామూను. ఏమాత్రం హెచ్చూ తక్కువా వచ్చినా బుర్ర లెగిరిపోతాయి గాని తరవాయి వుంటుందా?

లక్ష్మమ్మ—దౌర్జన్యాని కిదొక మెరుగువూతా, లౌక్యాని కిదొక కవచమూను. అయితే, కృష్ణుణ్ణి కడ తేర్చమనడంలో—

తిమ్మరుసయ్య—కడతేర్చ మని కాదు రాజాజ్ఞ, కళ్ళు పీకించమని మాత్రమే.

లక్ష్మమ్మ—కృష్ణుడు జీవచ్ఛవం అయిపోవా లనీ. కదూ? అయితే రాజాజ్ఞ కంటే యెక్కువ పనే చేశారు మీరు.

తిమ్మరుసయ్య—అది కృష్ణుని కోరిక.

లక్ష్మమ్మ—పోనీ, ఆవివరా లయినా చెబుతారా?

తిమ్మరుసయ్య—చెప్పడాని కేమి వుంది? రాజాజ్ఞ అనే టప్పటికి మీదపడి తలారి గుడ్లు పీకేశాడు. తర వాత ఆబాధ సహించలేకా, యిక బతికిమాత్రం లాభం యేమి టనీ, బతికివుండినంత కాలమూ తల్లి నేడ్పించడం మంచిది కాదనీ—

లక్ష్మమ్మ—ఇది సంతోషం పెట్టడం, కాబోలుటండీ?

తిమ్మరుసయ్య—ఒకవిధంగా అంతే. కుంటి అయినా, గుడ్డి అయినా కొడుకు—అందులోనూ ఏకపుత్రుడు బతికి వుండడమే తల్లికి సంబరం. అయితే, యిది సామాన్య సంసారుల సంగతి.

లక్ష్మమ్మ—నాగమ్మగారి బతుకు అంతకంటే మీరు అధ్వాన్నం చేశారు.

తిమ్మరుసయ్య—ఎంత చెట్టు కంతగాలి. పదవి పెద్దది కావాలి, బాధ్యత మాత్రం యెక్కువ వుండకూడ దంటే సాగదు మరి.

లక్ష్మమ్మ—ఊహూ.

తిమ్మరుసయ్య—నేలమీద కూచున్నవాడు పడితే దెబ్బ తగలదు, స్థితీ మారదు. కొండమీద వున్నవాడు పడితే మాత్రం పిండిపిండి—

లక్ష్మమ్మ—మనకి ధర్మసూత్రాలకు లోటేమింటి?

తిమ్మరుసయ్య—మరి కదపకు.

లక్ష్మమ్మ—తరవాత యేమి జరిగిందో చెప్పండి.

తిమ్మరుసయ్య—నువ్వు వినడం శ్రేయస్కరం కాదు.

లక్ష్మమ్మ—ఎంచేతో?

తిమ్మరుసయ్య—నీగుండె బేజా రయిపోతుంది.

లక్ష్మమ్మ—మీరు గుండె రాయి చేసుకుని ఆపని చేశారు. మీరు చేసింది వింటే నాగుండె వజ్రమే అయిపోతుంది, యిబ్బంది లేదు, చెప్పండి.

తిమ్మరుసయ్య—అవునవును "వజ్రా దపి కఠోరాణి" కదూ? కనుక విను. బతికివుండినంతకాలమూ తల్లి నేడిపించడం మంచిది కాదని "అది రాజాజ్ఞ అయితే యిది నాప్రార్థన. తల కొట్టించి వెయ్యండి" అన్నాడు కృష్ణుడు.

లక్ష్మమ్మ—మాట ముగియడం తరవాయిగా ఆ ప్రార్థన మన్నించేశారు మీరు. అవునా?

తిమ్మరుసయ్య—"కర్తా కారయితా—" కదూ?

లక్ష్మమ్మ—అయితే, రాజాజ్ఞ నిర్వహించడాని కడవికి వెళ్ళేముందు మీ రొక్కమాటు ఇంటికి వచ్చివుండవలసింది.

తిమ్మరుసయ్య—ఎందుకూ?

లక్ష్మమ్మ—కృష్ణుడు నాగమ్మగారి కొడుకు కాదు, నాకొడుకు.

తిమ్మరుసయ్య—కనక?

లక్ష్మమ్మ—కర్తైడయితే ముందు నన్ను నరికేసి—

తిమ్మరుసయ్య—పిచ్చి దానా, మరి నన్ను నే నేం చేసుకున్నానో యెరుగుదువా?

లక్ష్మమ్మ—నిర్దోషినీ, అమాయకుణ్ణీ సంహారించడంలో మీరు చాలా రాజభక్తి కనపరచుకున్నారండీ!

తిమ్మరుసయ్య—ఇంతకీ, లక్ష్మీ!

లక్ష్మమ్మ—(దుఃఖాతిరేకంతో గుక్కిళ్ళుమింగుతుంది)

తిమ్మరుసయ్య—లక్ష్మీ!

లక్ష్మమ్మ—ఇంకా యేమయినా మిగిలివుందా చెప్పవలసింది?

తిమ్మరుసయ్య—ఒక్క అక్షర మైనా లేదు; కాని, చూడూ, ఆవేశం తెచ్చుకోకు. శివుని ఆజ్ఞ లేనిదే చీమ అయినా కుట్టదు.

లక్ష్మమ్మ—ఒక్కొక్కప్పుడు పరమశివు డున్నాడా అనిపిస్తూ వుంటుంది. కాకపోయినా, కృష్ణుడు లేడు, నాగమ్మగారి కింకేమీ లేదు. అంతా శూన్యమూ, అంతా అంధకారమూను. విజయనగరంలో అలాంటి మనిషి లేడు. దేవుడి కళ్ళు అతనిమీదే వడ్డాయి.

తిమ్మరుసయ్య—కృష్ణు డలాంటి వాడు కాకపోతే, రాజాజ్ఞ అలా పుట్టకపోయేవుండును.

లక్ష్మమ్మ—పుట్టినా నాకు దుఃఖం లేకపోయి వుం

దును. (నిట్టూర్పు విడిచి) విడుస్తూవిడుస్తూ వున్న తామరమొగ్గ చిదిమేశారు మీరు.

తిమ్మరుసయ్య—చెప్పాను కాదూ? మనుష్యుని వల్ల యేమవుతుందీ? అయినా కృష్ణ దీక్షుద్రమానవ లోకంలో వుండ తగ్గవాడు కాడు.

లక్ష్మమ్మ—అత నుంటే మానవలోకంలో క్షుద్ర భావాలయినా వుండనియ్యకపోనుగా?

తిమ్మరుసయ్య—అదీ నిజం లాగే వుంది.

లక్ష్మమ్మ—అధర్మం జయించింది, నిజమే; కాని యిదే స్థిరమయి పోతుందా?

తిమ్మరుసయ్య—అసలు, స్థిరమైన పదార్థం యేమి వుందీ లక్ష్మీ!

లక్ష్మమ్మ—చివరికి వేదాంతం. మీ రాజ్ఞాపించిన రాజుండిపోయాడా, ఆరాజు కొడుకు మాత్రం రాజయి వుట్టికట్టుకుని వూరేగు తాడా? కృతకత్యు లైనవారు మాత్రం యెన్నయినా చెబుతారు శ్రీరంగ నీతులు.

(అప్పు డొక్క దూకున నీలమ్మ లోపలికి వస్తుంది. తిమ్మరుసయ్య వులిక్కిపడి చూస్తాడు. నీలమ్మ కైజారు దూసి తిమ్మరుసయ్యని పొడవబోతుంది. లక్ష్మమ్మ నీలమ్మ చెయ్యి పట్టుకుంటుంది, నిప్పులు కక్కుతూ మాస్తూ)

తిమ్మరుసయ్య—(ఉరిమినట్టు) నిలు. (సరిగా కూచుని)

నువ్వా? పోదు. విడిచి పెట్టు లక్ష్మీ!

నీలమ్మ—(స్తబ్ధ అయి, కైజారు జారవిడిచి, దుః ఖంతో కూలబడి) పాపాత్ముడా! నాకృష్ణుణ్ణి చూస్తే నీకు కళ్ళు కుట్టాయా?

లక్ష్మమ్మ—(నీలమ్మ చెయ్యి విడిచి నీలమ్మ కేసీ తిమ్మరుసయ్య కేసీ చూస్తూ వుంటుంది)

తిమ్మరుసయ్య—(మందహాసం చేస్తూ తల వంకించు కుంటాడు)

నీలమ్మ—నాకృష్ణుడు—నా దేవుడు— నా రాయుడు నిన్నేం చేశాడూ? ఎవళ్ళని మాత్రం యేమి చేశాడూ? దేవాలయంనుంచే తీసుకుపోయావుట, వొక్కమాటు మా కళ్ళబడనిస్తే నీవుట్టి మునిగి పోవునా?... దుర్మార్గుడా! ఈపాపం నిన్ను కట్టి కుడపదూ?

లక్ష్మమ్మ—ఎవరండీ యీఅమ్మాయీ?

తిమ్మరుసయ్య—మన దళవాయి పాపారాయుడుగారి కూతురు, నాగమ్మగారికి మేనగోడలివరస. తక్కిన సంగతి బోధపడిందా? (నీలమ్మతో) లే, చతికిలబడే వున్నావేం? కైజారు పుచ్చుకో.

నీలమ్మ—ఎందుకూ? క్షణం దాటిపోయింది. సమ యాని కీవిడ దగ్గరే వుండి పోయింద మరి.

తిమ్మరుసయ్య—ఉంటే యేమిా? ఈమాటు అడ్డు

కోదులే.

లక్ష్మమ్మ—ఎంతవని చేశారండీ మీరు?

నీలమ్మ—(ఒకమాటు లక్ష్మమ్మని చూసి, తరవాత తిమ్మరుసయ్యకేసి తీక్ష్ణంగా చూస్తూ) కళ్ళు మూసుకు పోయి వున్నాడు. మంచీచెడ్డా యేమయినా తెలుస్తోందా? బ్రాహ్మణుట, ఛండాలుడు, రాక్షసుడు. (లక్ష్మమ్మకేసి తిరిగి) నీ కపకారం చెయ్యక తప్పదు. అటురాజు చావడం వల్లా యిటు కాదనే వాడు లేకపోవడంవల్లా నీ మొగుడికి స్వాతంత్ర్యం వచ్చిం దని పొంగి పోతున్నావు కాదూ నువ్వు? ఇం కెంతలే? కాకపోయినా, నీకళ్ళకూడా బాధ కలిగించడం యెందుకూ? (తిమ్మరుసయ్యకేసి తిరిగి) రాజకార్యధురంధరా! జాగ్రత్త. (కైజా రందుకుని, చివా లున లేచి వెళ్ళిపోతుంది)

తెరలో

1. గోవిందయ్యా, ప్రాణాలమీద తీపివుంటే తప్పుకో.

2. ఆ, నుంచో, కదిలావంటే—

తిమ్మరుసయ్య—(లోపలికి చూస్తూ) తమ్ముడూ, వెళ్ళిపోనియ్యి, స్వేచ్ఛగా.

లక్ష్మమ్మ—ఇదంతా యేమిటండీ?

తిమ్మరుసయ్య— (లేస్తూ) తరవాత చెబుతా. అక్కడ నాగమ్మగారి ఆత్మీయులు వురెక్కి వుంటారు.

దాసీలుకూడా కత్తులు దూసి వుంటారు, నుంచోడానికి వీలులేదు.

లక్ష్మమ్మ—ఇక తరవాయి యేమిటండీ?

తిమ్మరుసయ్య—చూస్తూ, వింటూ వుండు.

లక్ష్మమ్మ—ఇప్పటి కయినా మీరు శాంతిమాట తలపెట్ట రన్నమాట.

తిమ్మరుసయ్య—శాంతా? ... .. వొకటే శాంతి. అగ్నిహోత్రం నగరం అంతటా పాకిపోయివుంటుం దప్పుడే. ఉరకలువేసేస్తూ వుంటుంది. జగన్నాధరథం కదిలింది, యిక నిలవదు. లయం కావాలి. జనక్షయం కావాలి. రక్తం ప్రవహించాలి. పాలోపాలి అయిపోతుంది నగరం అంతా. ఆడవాళ్ళూ మొగవాళ్ళూ అని భేదం లేదిక అంతా కలపటమే. మారణం యెన్నివిధాల జరగాలో అన్నివిధాలా జరుగుతుంది. లక్ష్మీ, బోధపడిందా? సుడిగాలి ప్రారంభం అయింది. అనూర్యంపశ్యలున్నూ వీధికి వచ్చి పరవళ్ళు తొక్కుతారు. ఈతుపాను నీ మీదికీ మొగ్గివుంది సుమా.

లక్ష్మమ్మ—కనపడుతూనే వుంది.

తిమ్మరుసయ్య—ఈకల్లోలం అణగిపోయే దాకా నాకు తెరపివుండదు. నువ్వొక్కడో, నే నెక్కడో, తెలిసిందా?

లక్ష్మమ్మ—నాకోసం మీకు బెంగవద్దు.

తిమ్మరుసయ్య—ఎప్పటి కేమిటో ! జాగ్రత్త.

లక్ష్మమ్మ—తేనెపట్టు కదిపారు మీరు. స్త్రీల చాతుర్యం చూస్తారు పురుషు లిప్పుడు. (ఇలా అని తిమ్మరుసయ్య నడికట్టున వున్న కటారి వుళాకుల్కుంటుంది, గంభీరంగా చూస్తూ)

తిమ్మరుసయ్య—(తానూ గంభీరంగా చూస్తూ తల పంకించుకుని) అలా వచ్చావా ?

లక్ష్మమ్మ—రాక ?

తిమ్మరుసయ్య—ఊహూ.

లక్ష్మమ్మ—అక్కడ మీ రేం చేస్తే యిక్కడ నేనది అనుకోండి. ముందు ఆడదాన్నీ, తరవాత రెక్కలు లేనిదాన్నీ చేసి, చివరికి నాగమ్మగారికి సర్వనాశం కలిగించారు కారూ మీరూ? అదేమిటో చూస్తాను. దిక్కులేనివాళ్ళకి దేవుడే దిక్కు, తొందరపడకండి. జగన్నాథ రథం కదిలిం దన్నారు మీరు, నిజమే కదిలింది. అడ్డమైనవాళ్ళ నందరినీ పచ్చడిచేసుకుంటూ కదలిపోతుందది. నాలుగు తలుపులూ బిగించి పట్టుకుందా మనుకుంటే పిల్లి మీదపడి గుడ్లు పీకేస్తుంది తెలుసా మీకు ? సముద్రంలో యెంత చల్లదనం వుందో అంత బడబానలం వుందనీ, రాక రాక అది పైకే వస్తే యిక పట్ట

వగ్గా లుండ వనీ యెరుగుదురా మీరు? వెళ్ళండి, చూస్తాను.

తిమ్మరుసయ్య—(శిరస్సునచెయ్యి ఉంచి దీవిస్తూ) సెబాస్. స్వస్వరూపజ్ఞానం కలిగింది, లక్ష్మీ! జయం తథ్యం, వెళ్ళిపో.

(లక్ష్మమ్మ వంగి, కైజారు కింద వుంచి, తిమ్మరుసయ్య పాదాలు కళ్ళ కద్దుకుని వెళ్ళిపోతుంది)

తిమ్మరుసయ్య—కొడుకు చేతిలో తండ్రీ, భార్య చేతిలో భర్తా వోడిపోడం కంటే అందం యేమిటీ! నంగ్ర మించిన అధికారం అన్యాక్రాంతం కాకుండా వుండడాని కామె వుచ్చులు పన్నితే, అధికారం చేజిక్కించుకోడాని కీమె గుండెలు తీస్తారు. ఇందులో యెవరు తీసిపోతారూ! అక్కడ భర్త మంత్రీ, యిక్కడ భార్య మంత్రిణీ. చాలా చక్కని సన్నివేశం యిది.

తెరలో

1 నూరప్పా!

2 రథం సిద్ధంగా వుంది అమ్మగారూ!

1 సరే, వస్తున్నాను.

తిమ్మరుసయ్య—విడ్డూరాలు పుట్టాయంటే పుట్టవూ? మహారాజు, పోతూ పోతూ సుఖాన వున్న ప్రాణాలు దుఃఖాన పడవేసి పోయారు. ఎరగనివాళ్ళకి రాజ్యాధి

పుట్టించారు. లక్ష్మిమ్మ మంత్రాంగంలో తిమ్మరాజు హత్య కోసం ప్రయత్నాలు సాగుతాయి. నీలమ్మ, నాదిరాదిక సి అలా మళ్ళిస్తుంది. దీని కంతటికీ మొదటి వచ్చి వోర్చలేని తిప్పమ్మగారే కారణం. కృష్ణరాయడు లేక పోవా లనుకుంటే, ఆవిడ మనమడే లేకుండా పోయే యోగం వచ్చేటట్టుంది.....(తల పంకించుకుంటూ) వాలు, వాలు, వీరభోజ్య మైన రాజ్యం సక్కజిత్తులకా నిలుస్తుంది? ఈఅంతఃకలహాలు కారణంగా సామంతులలోనూ, మండలేశ్వరులలోనూ, సరదార్లలోనూ స్వేచ్ఛావాంఛ ప్రబల వచ్చు. శత్రువులున్నా భేరీలు మోగించవచ్చు. జాగ్రత్తగా వుండాలి. (ఆలోచించి, తల పంకించుకుని) తిప్పమ్మ గారి నగరికి వెడదాం.

## రెండో రంగం

•••o○o•••

(నాగమ్మ నగరు. ఒక వసారాలో, నాగమ్మ, పీట మీద కూచుని వుంటుంది. కైజారు ఎదట వుంచుకొని, ఆమె కొకపక్కగా నీలమ్మ కూచుని వుంటుంది. ఆపని మీదా యీపనిమీదా దాసీలు అటూ యిటూ తిరుగుతూ వుంటారు)

నాగమ్మ—నేనా వయసు మళ్ళినదాన్ని. నువ్వా పసికూనవు. పైగా, యిద్దరికీ దుఃఖం తలమున్కలుగా వుంది. మనం పగతీర్చుకోగలమా తల్లీ?

నీలమ్మ—ఎందుకు తీర్చుకోలే మత్తయ్యా? యథా శక్తి. ఎవరు చేసినా అంతేగా? పుట్టింది రాచకులం గదా, తీరని అపకారమూ, పరాభవమూ జరిగాక కుక్కిన పేలమయి పడివుండమా? శరీరం దహించుకుపోతోంది నాకు. ఇక యీ జన్మకి సుఖ మెలాగా లేదు, బతుకూ సందేహామే. వీలయినంతవర కయినా పగతీర్చుకోకపోతే యింకెందుకూ యీ శరీరాలు?

నాగమ్మ—నాకూ నీకూ భేదం వుందమ్మా!

నీలమ్మ—పాతా కొత్తాను. అంతకంటే యేమీ లేదు. తిమ్మరుసయ్య చేసిన గాయంమీద మీరు కారం చల్లవద్దండీ అత్తయ్యా!

నాగమ్మ—కొంచెం వెనకా ముందూ —

నీలమ్మ—వెనక నయ్యా, ముందు గొయ్యాని. అడియాసలు వద్దండీ అత్తయ్యా! బదులు తీర్చుకోడమూ, ఆలోకానికి వెళ్ళిపోడమూ —

నాగమ్మ—నీది వ్యగ్రోత్సాహం తల్లీ!

నీలమ్మ—కనకనే పగతీర్చుకోవాలని దీక్ష. తిమ్మరుసయ్యని విడిచిపెట్టినా యిబ్బంది లేదు, ఆనిర్భాగ్యుణ్ణి పొడిచెయ్యాలి, అంతే.

నాగమ్మ—ఏనిర్భాగ్యుణ్ణి?

నీలమ్మ—వాణ్ణే...... తెలియలేదూ? ఎవడికి రాజ్యం

తక్కదని వచ్చిన రాజు ఇంతపని చేయించాడో—

నాగమ్మ—తిమ్మరాజునా?

నీలమ్మ—పేరు చెబితే పాపం చుట్టబెట్టుకుంటుంది అత్తయ్యా, వాణ్ణే.

నాగమ్మ—(ఆనందావేశంతో) ఏమన్నావు కోడలా?

నీలమ్మ—(ఉద్రేకంతో) ఎవని మూలంగా నాకు బావయ్యగారు లేకపోయారో ఆయేల్నాటికి వాణ్ణి హతం చేసి, మీ పెద్ద సవతి కడుపున చిచ్చుపెట్టి—

నాగమ్మ—ఎంత చల్లనిమాట అన్నావు తల్లీ! ఏదీ, వొక్కమాటు—

(నాగమ్మ ముంగాళ్ళమీద లేచి చేతులు చాపుతుంది. నీలమ్మకూడా ముంగాళ్ళమీద లేచి నాగమ్మ చేతుల్లోకి వాలుతుంది. నాగమ్మ నీలమ్మని గట్టిగా కౌగలించుకుని మూర్ధాఘ్రాణం చేస్తుంది)

నాగమ్మ—నాకూనా, యిక, నీకు అడ్డు చెప్పను. ఎలా చేస్తావో ఆకాస్త పనీ చేసేస్తివా, తరవాత నువ్వూ నేనూ కూడా సంతోషంగా బావయ్య దగ్గిరికి వెళ్ళిపోవచ్చు.

నీలమ్మ—ఇంతవరకూ నాకు కనేగాని, మీప్రోత్సాహం లేకపోయింది. ఇక చూసుకోండి, ఆనడవీనుగు నట్టింట ఏడుపులూ పెడబొబ్బలూను.

(అప్పుడొక దాసి వస్తుంది)

దాసి—లక్ష్మమ్మగారు దయచేశారుట అమ్మగారూ!

నాగమ్మ—ఏలక్ష్మమ్మగారే?

దాసి—మహామంత్రి—

నీలమ్మ—తిమ్మరుసయ్య పెళ్ళామా? వచ్చిందంటే పొడిచేస్తాను, ఏమండీ అత్తయ్యా?

నాగమ్మ—నవ్వొండు తల్లీ! మొగుడు మింగెయ్యడమూ, పెళ్ళాం పరామర్శ చెయ్యడమూనా?

నీలమ్మ—ఏమండీ అత్తయ్యా?

నాగమ్మ—తొందరపడకు తల్లీ!

నీలమ్మ—నే నాగలే నండీ!

నాగమ్మ—వచ్చిన పనేమిటో తెలుసుకోకుండా తొందర పడవచ్చునా అమ్మా?

దాసి—ఏమి సెలవు అమ్మగారూ?

నాగమ్మ—తల్లీ, తీసుకురమ్మంటున్నాను.

నీలమ్మ—చిత్తం అత్తయ్యా!

నాగమ్మ—వెంట యెవరైనా వున్నారా, వొక్కరే దయచేశారే?

దాసి—ఆవిడ తమ్ముడు, మాచిరాజు వియ్యన్న గారున్నూ దయచేశారుట అమ్మా!

నాగమ్మ—సరే, తీసుకురా.

(దాసి వెళ్ళిపోతుంది)

నాగమ్మ—(సాలోచనగా) ఎందు కయి వుంటుందీ ?

(అప్పుడు దానివెంట లక్ష్మమ్మా, మాచిరాజు వియ్యన్నా వస్తారు. దాని పక్కకి తప్పుకుంటుంది. నాగమ్మ చూసి, మొగం వంచుకుంటుంది)

నీలమ్మ—(ఆవేశంతో లేచి) అక్కడే నుంచో. అడుగు ముందుకి వేశా వంటే బాగా జరగదు.

లక్ష్మమ్మ—బాగా జరగ దంటే ?

నీలమ్మ—పొడిచేస్తాను.

లక్ష్మమ్మ—చాలా మంచిమాట. దాని అగత్యం వస్తుంది, దీక్ష నీళ్ళు కారిపోనివ్వకు.

నీలమ్మ—(తెల్లపోతుంది)

లక్ష్మమ్మ—నాగమ్మగారూ, తమకు గొప్ప ఆపద వచ్చింది. అయినా, నేనిప్పుడు పరామర్శ చెయ్యడానికి రాలేదు.

నాగమ్మ—భర్త చేసినదానికి తరవాయి తీర్చడానికి వచ్చారా మరి ?

లక్ష్మమ్మ—అక్షరాలా అంతే. తమరు సరిగా గుర్తించారు.

నాగమ్మ—అది రాజుగారి ఆజ్ఞ అయితే, యిది రాణీగారి ఆజ్ఞ కాబోలు.

లక్ష్మమ్మ—రాజు చచ్చిపోయాడు. రాజే లేనప్పుడిక రాణీ అంటే యేమిటీ ?

నాగమ్మ—అంటే ?

లక్ష్మమ్మ—విజయనగరసింహాసనం యిప్పుడు ఖాళీగా వుంది. అధిష్ఠాత యెవరూ అని రాజ్యం యెదురు చూస్తోంది నాగమ్మగారూ !

నాగమ్మ—మీ మాటలు విచిత్రంగా వున్నాయి. దాపరికం యెందుకూ, మీరు నేననుకున్న పనికోసం వచ్చివుండక పోతే, సంగతి యేమిటో స్పష్టంగా చెప్పండి.

లక్ష్మమ్మ—చెప్పవలసిందిచాలానూ వుంది, చెబుదామని ఉత్కంఠా వుంది. అయితే, చెప్పింది పూర్తిగా స్ఫురించాలంటే, ముందు, తమరు నా కోరికటి దయ చెయ్యాలి.

నాగమ్మ—ఏమి టదీ ?

లక్ష్మమ్మ—మంత్రి పదవి.

సీలమ్మ—(ఉద్రేకంతో) వల్లకాదు. నువ్వు మాకక్కరలేదు, వెళ్ళిపో.

నాగమ్మ—(సీలమ్మతో) ఒక్క క్షణం వూరుకో తల్లీ ! (లక్ష్మమ్మతో) మంత్రిపదవా లక్ష్మమ్మగారూ ?

లక్ష్మమ్మ—అవును. ప్రధానమంత్రిపదవి దయ చెయ్యాలి.

నాగమ్మ—నేనా ? మీకా ?

లక్ష్మమ్మ—తమరే, నాకే.

నాగమ్మ— నాకేమి వుందని—

లక్ష్మమ్మ— నరసరాయలవారి దేవేరికి లేని దేమి వుంటుందీ జగత్తులో?

నాగమ్మ—ఆ ప్రభువుకి నే నొక్కర్తినే దేవేరిని కాదుగా?

లక్ష్మమ్మ—ఎందరుండినా యీవాళ అందరి అంతస్థూ వొక్కటేగా?

నీలమ్మ—(చకిత అయి నాగమ్మతో) అత్తయ్యా!—

నాగమ్మ—నువ్వేందు తల్లీ? ఏమంటారు లక్ష్మమ్మగారూ?

లక్ష్మమ్మ—రాజంటూ యివ్వా డెవరూ లేదు నాగమ్మగారూ! అదిగాక వీడి తరవాత రాజు కావలసినవాడు ఫలానా అని యిద్దరి మొగాలమీదా రాసివుంటుందా? రాజయోగం వున్నవాడు ఒక రాజు కొడుకే అయి వుండనక్కరలేదు. ఒకరి రాజ్యం ఆక్రమించుకోవచ్చు. ఒక రాజ్యం కల్పించుకోవచ్చు. ఇంతకీ—రాజుల కొడుకు లెందరో వొట్టి సన్యాసులయిపోయారు. సామాన్యు లెందరో రాజులూ, చక్రవర్తులూ కూడా అయిపోయారు.

నాగమ్మ—అది నిజమే కాని, మీరిప్పుడు నాకు చెబుతూ వున్నది తుద కమృతం అవుతుందో, విషం—

నీలమ్మ—విషం విషం. ఈవిడమాటలు నమ్మ

వద్దు అత్తయ్యా!

నాగమ్మ—వినిపించుకోవ్వూ నాకూనా; మీరేమం టారు లక్ష్మమ్మగారూ?

లక్ష్మమ్మ—గ్రహించుకో గలిగితే యీ చెప్పింది చాలు, గ్రహించుకోలేకపోతే యింకెంత చెప్పినా వొట్టిదే కనక, నే నిక వొక్క అక్షర మయినా చెప్పను.

నాగమ్మ—ఛల్లూకప్పట్టు పట్టారే? ఇదమిత్థం అని నిరూపించుకోలేకుండా వున్నాను గాని, యేదో కొత్త కల్పన కనపడుతోంది మీమాటల్లో. మీరాక పరామర్శకీ కాక, నే ననుకున్నది చెయ్యడానికీ కాక – నావల్ల మంత్రి పదవి పొందడాని కయితే—మీవుద్దేశం యేమయినా నా కిదివరకి జరిగినదానికంటే గొప్పవిపత్తు తటస్థించదు. కనక (లేచి లక్ష్మమ్మను సమీపించి) ఇదిగో, నాభవిష్య ద్రాజ్యాధిపత్యానికి మిమ్మల్ని నామంత్రిగా నియమించు కుంటున్నాను. (చేతిలో చెయ్యి వేస్తుంది)

లక్ష్మమ్మ—సంతోషం! తమకు నాయెడల పరమ విశ్వాసం కలిగింది కనక, ఇది నా అదృష్టానికి గొప్ప గురుతు కనక, నేను తమకు రాజ్యాధిపత్యం సంక్రమించాక నా సకల శక్తులూ ధారపోసి అభ్యుదయ పరంపరా వాప్తిగా—

నాగమ్మ—అదేమిటి లక్ష్మమ్మగారూ?

లక్ష్మమ్మ—తమరు చేసింది మాత్రం యేమిటి నాగమ్మగారూ?

(ఇద్దరూ ఒక్క క్షణం గంభీరంగా చూసుకుంటారు)

నాగమ్మ—(లక్ష్మమ్మ చెయ్యి గట్టిగాపట్టుకుని) మీరు ఈక్షణం మొదలుకునే నాకు మహామంత్రులు, సరా?

లక్ష్మమ్మ—అదీమాట. నాగమ్మగారూ, బాగా ఆలోచించుకోండి. తమ రిప్పుడు తమ ఆపద లన్నీ నా మీద మోపారు. ఇదీ తమరిప్పుడు చేసిన పనికి అర్థం. నేను మనస్ఫూర్తిగా మీకష్టాలు నానెత్తిమీద వేసుకున్నాను.

నాగమ్మ—పరమసంతోషం.

లక్ష్మమ్మ—ఇక చిత్తగించండి. రాజ్యాలు మంత్రాధీనాలు. మంత్రాలకు భౌతికరూపాలే మంత్రులు. కనక, ప్రభువులు, మంత్రులమాటలు పాలిస్తూ వుండాలి.

నాగమ్మ—సరే.

లక్ష్మమ్మ—అక్కడ భర్త మంత్రీ, ఇక్కడ భార్య మంత్రిని. ఇక ప్రయోజనమా పరస్పరవ్యతిరేకం. చిత్తగించారా?

నాగమ్మ—చిత్తం.

లక్ష్మమ్మ—చిత్తం అంటే చాలదు. పరస్పరం అంటే యెవ రెవరికీ?

నాగమ్మ—నాకూ నాసవతికీని.

లక్ష్మమ్మ—అవునుగదా? కాని సామాన్యదృష్టి కిది అందదు. మీరు సరిగా గుర్తించడం నా అదృష్టం.

నాగమ్మ—ఇంగితజ్ఞానం లేనిచోట ప్రాజాపత్యం వహించడం అపాయకరం కదా లక్ష్మమ్మగారూ!

లక్ష్మమ్మ—వొట్టి అపాయకరం కాదు, మహా—అపాయకరం. పోతే, తమకు తీరని అపకారం సంభవించింది. ఈ అపకారం యెవరు చేశారని కాదు మనం ఆలోచించుకోవలసింది, ఎవరికోసం అనీ, ఎవరు చేయించారనీ—

నాగమ్మ—స్పష్టంగా నాసవతి కొడుకు చేయించాడు, ఆలోచన యెందుకూ!

లక్ష్మమ్మ—అంతే కాదు.

నాగమ్మ—అవునవును, దానికాకారణం నాసవతి ప్రోత్సాహం, తెలుసునమ్మా! నాకొడుక్కి విషప్రయోగం చేయించడానికి మూడుమాట్లు ప్రయత్నించిం దావిడ, మరిచిపోయానా లక్ష్మమ్మగారూ?

లక్ష్మమ్మ—అవునుగదా?

నాగమ్మ—విగ్రహమో వక్రించింది, యిప్పు డిలా చేశారు గాని; అప్పుడు మీభర్తగారే కాదూ నా తండ్రిని నాకు తక్కించినవారూ!

లక్ష్మమ్మ—అంటే, తమకు శత్రువు లెవరో, సాధించ వలసినవా రెవరో—

నాగమ్మ—తెలుసును తల్లీ, తెలుసును.

లక్ష్మమ్మ—కనక, మావారి విషయమై యిప్పుడు తమ అభిప్రాయం యేమిటో—

నీలమ్మ—(ఉద్రేకంతో) ఓహో, అదా అమ్మా యెత్తు? అత్తయ్యా—

నాగమ్మ—(నీలమ్మతో) ఇంకొక్క క్షణం వూరుకో తల్లీ! సెలవివ్వండి లక్ష్మమ్మగారూ!

లక్ష్మమ్మ—చేయించేవా డొకడూ, చేసేవాడు మరొకడూ అయినప్పుడు—చేయించేవాణ్ణి లేకుండా చేసుకుంటే యిక చేసేవా డెవడూ?

నాగమ్మ—విడమర్చి చెప్పండి లక్ష్మమ్మగారూ!

లక్ష్మమ్మ—కృష్ణుడు ప్రయోజకుడు కనక, తమ అనంతరం తమ కొడుక్కి రాజ్యం తక్కనివ్వ డేమో నని యేలినవారి సవతికొడుకు చేయించా రీపని. మనం యిప్పుడు ఏలినవారి సవతికొడుకు స్థానీయులను లేకుండా చేసుకోవాలి, ఇందుకు మన కెవరు అడ్డూ?

నాగమ్మ—బాగా సెలవిప్పించండి.

లక్ష్మమ్మ—ఏ రాజ్యంకోసం వారు మన కృష్ణుణ్ణి లేకుండా చేశారో, ఆ రాజ్యంకోసం, మనమున్నా

ఆ కుట్రకుంకని లేకుండా చేద్దాం.

నాగమ్మా, నీలమ్మా చకితులై చూసుకుంటారు.

లక్ష్మమ్మ—దాంతో మనమూ వారూ సమానమవుతాం. ఇక నరసరాయలవారు పెంచి పెద్దచేసిన రాజ్యం—

నాగమ్మ—ఆమహారాజు కొడుకు అచ్యుతం వుండనే వున్నాడు, ఆవిషయమై మనకి బెంగ అక్కరలేదు.

లక్ష్మమ్మ—తమ దెంత వెర్రి నాగమ్మగారూ, మన కృష్ణుని కంటే యెక్కువటండీ అచ్యుతరాయలవారు, తిప్పమ్మతల్లికీ ?

నాగమ్మ—అవును సుమండీ, వంశం అయినా నిలవనిస్తుందో లేదో ఆరాక్షసి.

లక్ష్మమ్మ—అలాకాక:—ఏదయినా మొరపెట్టి అచ్యుతరాయలవారిని చేరతీస్తారేమో తిప్పమ్మగారు ?

నాగమ్మ—అప్పుడు మనం యేమవుతామూ ? నిజమే, ఇదీ చూసుకోవలసిందే.

లక్ష్మమ్మ—అప్పుడే అయిందా, యింకా వుంది నాగమ్మగారూ, చూసుకోవలసింది.

నాగమ్మ—అదేమిటీ ?

లక్ష్మమ్మ—ఏలినవారినీ కన్నెత్తిచూడక, తిప్పమ్మగారితోనూ కలియక, అచ్యుతరాయలవారు—

నీలమ్మ—అవునవును, ఓబమ్మత్తగారికి మాత్రం రాజ్యకాంక్ష కలక్కుండా వుంటుందా అత్తయ్యా?

నాగమ్మ—అవును సుమా, ఆ మహారాజుదగ్గిరనుంచి చూసుకుంటే అచ్యుతాని కున్న అధికారం తిమ్మన్నకి లేదు, నిజమే లక్ష్మమ్మగారూ!

లక్ష్మమ్మ—కనక, సింహాసనం కోసముఃన్నా మనం మొగబడాలి.

నాగమ్మ—చాలా గొప్ప ఆలోచన మీది. అయితే, సాధ్యమా మనకి?

లక్ష్మమ్మ—సింహాసనమే ఏలినవారి ప్రాప్యం. నిష్కంటకం అయిన సింహాసనం కోసమే తమరు ఎదురు చూస్తూ వుండాలి. ఏమంటే? పగతీర్చుకోడమే మన ప్రాప్యంఅయితే, అది తీర్చుకున్నా మనుకోండి. సింహాసనం నిష్కంటకం చేసి అది వీధే పోయేవాడు ఎగరవేసుకు పోయేటట్టు చెయ్యమా?

నాగమ్మ—బాగుంది మీరు చెప్పింది.

లక్ష్మమ్మ—నరసరాయలవారి దగ్గిరనుంచి చూస్తే అచ్యుతరాయలవారికంటేనూ ఏలినవారే దగ్గిరవారు నాగమ్మగారూ!

నీలమ్మ—అవునండీ అత్తయ్యా! వ్యవహారం అంతా తక్కబెట్టడానికి మేమున్నాం—

లక్ష్మమ్మ—అదీ మాట. ఏలినవారికి సింహాసనం స్వాధీనపరచడం మా ప్రాప్యం. అందుకు కావలసిన పన్నాగం, పని—ఆగొడవ అంతా మాది.

నాగమ్మ—సరే, యేటి కడ్డుపడదాం. అయితే, డబ్బే మాత్రం కావా లంటారు?

లక్ష్మమ్మ—ఉంటే కోట్లు చాలవు. లేకపోతే దమ్మిడీ అయినా అక్కరలేదు, (పక్కకి చూచి) ఇలా రా తమ్ముడూ!

(అప్పుడు వియ్యన్న వస్తాడు)

వియ్యన్న—(చేతులు కట్టుకుని నాగమ్మ యెదట వంగి) తమ ఆజ్ఞ నిరీక్షిస్తున్నాను.

లక్ష్మమ్మ—ఇతను మాతమ్ముడు. అంటే పినతల్లి కొడుకు. పేరు మాచిరాజు వియ్యన్న. బావగారికి తీసిపోడు. ఏలినవారికి నమ్మిన బంటుగా వుంటాడు.

నాగమ్మ — అలాగా?

లక్ష్మమ్మ—తగినంత అగత్యం వచ్చేదాకా లోప ల్లోపలే వుందాం మనం. ప్రత్యక్షంలో, మంత్రి అయినా, సేనాధిపతి అయినా, భృత్యు డయినా సర్వమూ మా తమ్ముడే.

నాగమ్మ—(చేతులు జోడించుకుని వియ్యన్నతో) నన్ను వొడ్డెక్కించాలి మీరు. 

వియ్యన్న—వలినవారికి  నా జీవితం  మీదుకట్టి వుంచాను. తమరు నిశ్చింతగా వుండవచ్చు.

నాగమ్మ—మంచిది నాయనా! అయితే, నాగమ్మ గారూ, ఇంకెవరెవ రున్నారూ మనకి!

లక్ష్మమ్మ—మామరిది గోవిందరాజూ, నాఅల్లుడు అప్పన్నా  చివరి కిలే తిరుగుతారు, సందేహం లేదు. ఏమంటావు తమ్ముడూ?

వియ్యన్న—సందేహ మేమిా? వారినిబట్టేన్నీ అనేక మంది ఇలే వుంటారు.

లక్ష్మమ్మ—ఇక్కడి సంగతి సెలవిప్పించండి.

నాగమ్మ—నీలమ్మని చూస్తూనే—

నీలమ్మ—ఆపురుగుని నేనే నలిపివేస్తాను.

లక్ష్మమ్మ—ఒక్క సంగతి ముందు తమతో మనవి చేసుకుంటున్నాను. ఒకరిమాటలు విని తమరు నన్ను మానించగూడదు. నేనేమి చెప్పినా విని నమ్మి ఆచరిస్తూ వుండాలి.

నాగమ్మ—అలాగే జరిగిస్తాను. నేను మనస్ఫూర్తిగా మిమ్మల్ని నమ్మాను. అయితే, మానీలం అలా యెందుకు చేసిందో—

లక్ష్మమ్మ—ఎరుగుదును.

నాగమ్మ—నాకోడలి పక్షాన ముందు నేను క్షమించ

కోరుకుంటున్నాను. (నీలమ్మతో) లక్ష్మమ్మగారి పాదాలు పట్టుకో తల్లీ!

నీలమ్మ—(లక్ష్మమ్మ పాదాలుపట్టుకుని) క్షమించండి.

లక్ష్మమ్మ—(నీలమ్మని లేవనెత్తుతూ) దీక్ష మరిచి పోవద్దు; కాని స్థలం మార్చు. ఎప్పటి కయినా నువ్వే ఆపని చెయ్యాలి.

నీలమ్మ—చిత్తం, ఇక చూస్తురు గాని.

లక్ష్మమ్మ—నాగమ్మగారూ, మా కిప్పటికి సెలవు దయచేయించండి. ఎప్పు డగత్యం అయితే, అప్పు డిక్కడ రెక్కలు కట్టుకువచ్చి వాల్తాము.

నాగమ్మ—చిత్తం, మీరు కావా లంటే యాభయి లక్షలు గుమ్మరిస్తాను సుమండీ లక్ష్మమ్మగారూ!

లక్ష్మమ్మ—ఉండనివ్వండి. ఇప్పు డెందుకూ తమ్ముడూ?

పియ్యన్న—ఇప్పుడెందుకూ? కాకపోయినా మూల ధనం కదపవలసిన అగత్యం యెప్పుడూ రానివ్వను. మన విరోధుల మండలాలు నిత్యసంపన్నా లయి వున్నాయి. కన్ను గీటానంటే యేనుగులమీద వేసుకువస్తారు మన వాళ్లు. కాకపోయినా, ఇక్కడి ఖజానా మీద కూడా మన మాటకి చెలామణీ వుంది. తమరు ఆజ్ఞమాత్రమే దయచేస్తూ వుండాలి.

లక్ష్మమ్మ—మరి సెల విప్పించండి.

నాగమ్మ—సెలవు.

వియ్యన్న—మహారాణీ, సెలవు దయచెయ్యండి.

నాగమ్మ—మంచిది నాయనా!

నీలమ్మ—చిన్నత్తయ్యా, సెలవు.

లక్ష్మమ్మ—మంచిదమ్మా!

(లక్ష్మమ్మా వియ్యన్నా వెళ్ళిపోతారు. నాగమ్మా, నీలమ్మా వారిని సాగనంపి వెనక్కి మళ్ళుతారు.)

నాగమ్మ—ఇదంతా యేమి టంటావు తల్లీ?

నీలమ్మ—అస లేమి టయినా, చివరి కేమయినా ఆలోచన మాత్రం బాగుంది. బావయ్యగారిని కన్నందుకు తమరూ, కొలిచినందుకు నేనూ యింతకంటే చెయ్యవలసింది లేదు.

నాగమ్మ—పీలుతప్పితే చంపి చచ్చిపోదాం.

నీలమ్మ—ఎందు కయినా లక్ష్మమ్మగారి సెలవు కావాలి. మనకి వేరే ఆలోచనే అక్కరలేదు.

నాగమ్మ—మొగుడికి తగ్గ పెళ్ళాం ఆవిడ. ఇది తిమ్మరుసయ్యగారికి గుక్కతిప్పుకోనివ్వని పన్నాగం అవుతుంది తప్పదు. చూతాం.

నీలమ్మ—మా బాబయ్యగారితో కూడా యీసంగతి ఆలోచించడం మంచిదండీ!

నాగమ్మ—అవును తల్లీ, వర్తమానం చేద్దాం. ఇంతలో మనం శాస్త్ర ధారకం చేతాం రా తల్లీ!

నీలమ్మ—దయచెయ్యండి.

---

## మూడో రంగం

(తిప్పమ్మ నగరు. ఒక పీటమీద తిప్పమ్మా, మరో పీటమీద తిమ్మరుసయ్యా కూచుని వుంటారు.)

తిప్పమ్మ—దినాలు వెళ్ళిపోయిన వెంటనే అబ్బాయికి పట్టాభిషేకం అయిపోవాలి. ఆలస్యం కావడానికి వల్లకాదు.

తిమ్మరుసయ్య—ఆలస్యం యెందుకూ? పొద్దున్నే వర్తమానించి కనుక్కున్నాను, పదమూడో నాడే బహు మంచి ముహూర్తం స్థిరపరిచారు సిద్ధాంతిగారు.

తిప్పమ్మ—బాగుంది. ఈలోపున సన్నాహా లన్నీ పూర్తిచేయించండి తమరు.

తిమ్మరుసయ్య—తమరు పైపెత్తనాని కెవరిని నియమించారో సెలవిప్పిస్తే—

తిప్పమ్మ—తమ రుండగా మళ్ళీ యెవరో యెందుకూ పంతులుగారూ? కాకపోయినా, దాయాదులనునమ్మి చేర తియ్యడానికి వీలులేదు. నా ఆత్మీయులలో సొంతపనులు విడిచిపెట్టుకుని వచ్చేవా రెవరూ లేరు. పోనీ, కోడలి

వైపువారిని చేరదీస్తామా అంటే, అది ముందుముందు విషమిస్తుంది. అబ్బాయిని తలుచుకుని కంటికీ మంటికీ యేకధారగా దుఃఖిస్తోంది కోడలు, లేకపోతే, సర్వమూ ఆమే చక్కబెట్టుకోగలదు.

తిమ్మరుసయ్య— అవునవును, మహారాజు కూడా ఈసంగతి చాలామాట్లు సెలవిస్తూవచ్చారు; కాని, పాపం, వారి కింకా వచ్చే కాలమే. కొనసాగుతూ కొన సాగుతూవున్న లతను చిదిమేసిన ట్టయిపోయింది వారిస్థితి.

తిప్పమ్మ—అందుచేత, కడుపుచిచ్చు సంభవించినా నా కీ తిప్పలు తప్పేవి కావు. ఏమి చెయ్యనూ? దుఃఖం మరిచిపోవాలి. దిగమింగేసుకోవాలి.

తిమ్మరుసయ్య—ఇంతకంటే మంచి వుపాయం మరి లేదు. అయినా, బంధువులు అన్యథా భావించకుండా—

తిప్పమ్మ—అదంతా నేను చూసుకుంటాను లెండి. (లాలన నటిస్తూ) అక్కడి సంగతు లేమయినా తెలిశాయా పంతులుగారూ?

తిమ్మరుసయ్య— తెలియడానికీ తెలియకపోడానికీ యేమి వుందీ? కుమారుణ్ణి తలుచుకుని చాలా దుఃఖిస్తు న్నారు వారు. "పుత్రోత్పత్తివిపత్తిభ్యాం—"ఇది తమ రెరగనిదా, అనుభవిస్తూనూ వుండనిదా?

తిప్పమ్మ—శివశివా, తలుచుకున్నా, తలంపువచ్చినా

పేగులు తరుక్కుపోతాయి పంతులుగారూ! పగవాళ్ళ
కయినా యిలాంటిది వద్దు మహాప్రభో! కత్తికోత
కంటేనూ అన్యాయం యిది. అయితే, పంతులుగారూ,
అక్కడ సంగతులే లేవంటారా?

తిమ్మరుసయ్య—ఉంటే తమతో మనవిచేసుకోనూ?
కాకపోయినా, చిత్తగించండీ అమ్మా, మనోవర్తిదారు
రాలు, ఆవిడవల్ల యేదో అవుతుం దని ఆందోళన
యెందుకూ తమకూ?

తిప్పమ్మ—నిజానికి, అయినా కాకపోయినా యెత్తులు
వెయ్యొచ్చు కాదూ? ఆలోచన అయినా సాగవచ్చు
కాదూ? పైగా, అసలువాళ్లూరుకునే వుండినా మధ్య
వాళ్ళూరుకోనివ్వరు కాదూ?

తిమ్మరుసయ్య—కాదనను; కాని యింతవరకూ
దుఃఖించడంలోనే వున్నారు, అక్కడివా రంతా.

తిప్పమ్మ—తమరు బాగా పరిశీలిస్తూ వుండాలి.
ఏవుట్టలో ఏపాముందో—

తిమ్మరుసయ్య—తమ రింతగా సెలవిప్పించాలా
అమ్మా? ఈతనువు, విజయనగరంప్రభువుల సేవలోనే
చివికి మన్నయిపోతుంది, సరా?

తిప్పమ్మ—తమ కలాంటి అనుగ్రహాం వుంటే చాలు,
చాలా సంతోషం. ఎలాగో పదివన్నెం డేళ్లు మనం

కష్టపడితిమా. తరవాత అంతా అబ్బాయే చూసుకో గలడు.

తిమ్మరుసయ్యా—పదేళ్ళు కూడా అక్కరలేదు. అబ్బాయిగారి ప్రతిభ నే నెరగనిదా? పదహారేళ్లు వెళ్లా యంటే—

తిప్పమ్మ—తమరు దిద్దాలి.

తిమ్మరుసయ్యా—తమరు నాదాకా అట్టేపెడితే కదా?

తిప్పమ్మ—అట్టేపెట్టకపోడానికి నే నెంతటిదాన్ని పంతులుగారూ! ఆమహారాజూ లేక, వొక్కగా నొక్క కొడుకు చిట్టితండ్రీ లేక—ఏదో, విధిలేక బతికి వున్నాను నేను. అయినా, పుట్టింది రాచపుట్టుక కనక, వయస్సు మళ్ళినా, రామా కృష్ణా అనుకుంటూ కూచోకుండా భగవంతుడు నామీద యిలాంటి భారం మోపాడు కనక, ప్రవృత్తిమార్గాన దేవుళ్లాడక తప్పదు. ప్రజా పాలనం అన్నప్పుడు మంచీ చెడ్డా కూడా వుంటాయి. లోకులు కాకులు. పైగా, ఆపక్షంవారు నామీద దుర్వాదంతులు వ్యాపింపచేస్తారు, కనుగలిగి వుండాలి సుమండీ!

తిమ్మరుసయ్యా—చిత్తం, వెయ్యికళ్లతో కనిపెడుతూ వుంటాను.

తిప్పమ్మ—ఈ దుఃఖసమయములో తమరే మాకు

దిక్కు. తమకు పదిమాట్లు చెప్పనక్కరలేదు. కర్ణాటక సామ్రాజ్యంలో యెందునా తమచేతి కడ్డు లేదు. తమ రనుభవించగా మిగిలిందే మాకు చాలు.

తిమ్మరుసయ్య — ఎంతమాట సెలవిప్పించారూ అమ్మా? డబ్బా నాకు ప్రధాన మైనది? కైలాసవాసి నరసరాయలవారు నన్ను చేరదీసి వాళ యింటివాణ్ణి చేశారు. వారి కుటుంబం యిప్పుడు కొంచెం చిక్కుల్లో పడివుంది. ఇప్పు డుపకరించకపోతే నేనుండి యేమి ప్రయోజనమూ? విశ్వాసం చూపించడాని కింతకంటే నాకు మంచి తరుణం మరేమి వుంటుంది? తమ భర్తగారూ, తమ కుమారుడు గారూ నాయెడల కన బరిచిన అనుగ్రహానికి నే నేమి చేసి రుణం మళ్ళించుకో గలనూ? అమ్మా, తమ రెప్పుడూ డబ్బుమాట యెత్త వద్దు. ఇదివర కెప్పుడూ మా కిక్కడ లోటు రాలేదు, ఇక ముందూ రాదు. నా కా సందేహం యెప్పుడూ లేదు.

తిప్పమ్మ—నేనూ మరొకందు కనలేదు సుమండీ పంతులుగారూ! ఎలాంటి వేత్తలూ కూడా యీ సంసార ఝంజాటంలో వొడ్డుచేరుకోవా లంటే డబ్బే కాదూ ఆధారం? నాభర్తగారూ నాకొడుకూ గూడా తమర్ని బాగానే చూశారు, నాకు తెలును. అయితే, నాసంగతి

తమకు కొత్త కాబట్టినీ, వారి హయాములో లాగే యిప్పుడున్నూ తమరు స్వేచ్ఛగా వుండవచ్చు నని తమకు విశదం కావలసివుంది కాబట్టినీ చెప్పాను గానీ; డబ్బుకోసమే తమరు పనిచేస్తున్నారనా?

తిమ్మరుసయ్య—అయితే, సంతోషం.

తిప్పమ్మ—ఇంతకీ:—పేరుమట్టుకే మాది. ఖజానా అంతా తమ ఆధీనంలో వుండవలసిందే. ఎప్పు డయినా సరే, యెందు కయినా సరే, యెంతయినా సరే, యే విధంగా అయినా సరే, తమ యిష్టం. అబ్బాయి పెద్ద పెరిగే దాకా సామ్రాజ్యం కాపాడి, తరవాత, అతను సొంతంగా వ్యవహారాలు చక్కబెట్టుకుంటూ వుంటే చూసి ఆనందించడమే మన పని.

తిమ్మరుసయ్య—అంతే, అంతే.

తిప్పమ్మ—నేను పాపమే చేసుకున్నాను. లేకపోతే నాకీ పాట్లెందుకు వస్తాయి? ఆమహారాజు లేకపోయినా కడుపున పుట్టిన కొడుకయినా పదికాలాల పాటు బతికి వుండకూడదూ పంతులుగారూ? (దుఃఖం సమాళించు కున్నట్లభినయించి) ఒక్కొక్కప్పుడు "ఛీ, యెందు కీ బతుకు" అనిపిస్తూ వుంటుంది; కాని పసివాడికోసం అంతా దిగమింగుకుంటున్నాను. తమరు వెయ్యికళ్ళతో కనిపెడుతూ వుండాలి.

తిమ్మరుసయ్య—తప్పకున్న కొద్దీ దుఃఖమే. "జీర్ణం జీర్ణం, వాతాపిజీర్ణం" మరిచిపోవాలి తమరు. తమరు దుఃఖిస్తే కోడలుగారు మరింత బెంబేలుపడిపోతారు. తమ రిద్దరూ కూడా అలా అయితే, యిక అబ్బాయిగారిని పట్టడం కష్టం. సంసారంలో, పెద్దవాళ్లుండగా చిన్నవాళ్లు పోతే యిదే చిక్కు. ఎంతెంతలేసి ఆపదలు వచ్చినా కుక్కిన పేలయి పడివుండవలసిందే గాని, నోరారా యేడ్చి ఆభారం తగ్గించుకోడానికి వీలులేదు.

తిప్పమ్మ—ఇప్పుడు నాస్థితి అదేగా?

తిమ్మరుసయ్య—తమ విషయం వేరు. భర్తగారు లేకపోవడమూ, నల్లరాయి వంటి కుమారుడు అకాల మృత్యువు వాతపడడమూ—ఇంతమాత్రమే అయితే లోకంతో పాటే. కాని మరి సామ్రాజ్యమో? కోటాను కోట్ల జనులు తమ చల్లని నీడకోసం కనిపెట్టుకుని వున్నారు. వారిని సర్దుబాటు చెయ్యడం మాటలతో అవుతుందా? ఈస్థితిలో దుఃఖిస్తూ కూచోడానికి తమకు వీలా అమ్మా?

తిప్పమ్మ—అదీ మాట.

తిమ్మరుసయ్య—ఎవరైనా ఏమయినా అనుకుంటున్నారేమో అని మన కేమీ అక్కరలేదు. ఘం[illegible] చెడ్డోవాకమార్గం వేసుకోడమూ, తూ[illegible] తప్పకుండా

అలానడిచిపోడమూ ఇంతే మనం చూసుకోవలసింది.

తిప్పమ్మ—అంతేనండీ.

తిమ్మరుసయ్య—తమర్ని యెదిరించగలవాడు పృథివి మీద పుట్టలేదు. ఇక పుట్టడు. తమదృష్టి వొక్క—సామ్రాజ్యంమీదే వుండాలి.

తిప్పమ్మ—నేనూ అలాగే నిశ్చయించేసుకున్నానండీ.

తిమ్మరుసయ్య—మరి నేను తక్కిన సంగతులు చూడాలి, సెలవిప్పించండి.

తిప్పమ్మ—వెళ్ళిరండి నాయనా! అయితే, కోడల్ని కూడా వోదారుస్తూ వుండాలి తమరు. మంచి అనుభవ కాలంలో భర్తృవియోగం. పైగా ఆమె అమాయకు రాలు. భర్త అంటే నిద్రాహారాలు మరిచిపోయేది. స్వయంగా సేవించుకునేది.

తిమ్మరుసయ్య—మంచివాళ్లకే యెప్పుడూ ఆపదలు వస్తాయి. వారిదర్శనమున్నూ, చేసుకుంటూనే వుంటాను.

తిప్పమ్మ—నా వార్ధకమూ, అబ్బాయి చిన్న తనమూ, రాజకార్యాల జటిలతా చూపించి ఆమెని ప్రకృతిలో ప్రవేశపెట్టాలి తమరు.

తిమ్మరుసయ్య—చిత్తం చిత్తం. సెలవు.

(ఇద్దరూ లేస్తారు.)

తిప్పమ్మ—సమయమో అసమయమో అని తమ

రెవ్వుడూ సందేహించనక్కరలేదు. వచ్చినవెంటనే నేనే ప్రత్యుత్థానం చేసి—

తిమ్మరుసయ్య—ఎంతమాట? నేను భృత్యుణ్ణి కానా అమ్మా? తమ సెలవుప్రకారమే ప్రవర్తిస్తాను.

తిప్పమ్మ—మరి దయచెయ్యండి.

(తిమ్మరుసు వెళ్ళిపోతాడు.)

తిప్పమ్మ—ద్రోహచింతలేదు బ్రాహ్మడికి. చిక్కురోజులు వచ్చాయి, డబ్బు కాస్తవిజ్జిమ్ముతూ వుంటే కాని వీల్లేదు. మారప్పారుక్కయ్యా నమ్మినబంట్లే. సాంబశివరాయుడూ, త్రిలోచనరాయుడూ యెప్పుడూ చేతినుంచి జారిపోరు. విరూపాక్షరాయుడు బాగా వుపకరిస్తాడు. అంతా సవ్యంగానే వెడుతుంది. కోడలు పుట్టెడు దుఃఖంలో వుంది, అందులోనే వుంచెయ్యాలి. ఆమెకి అధికారవాంఛ లేనూ లేదు, పుట్టకుండానూ జాగ్రత్తపడాలి. ఇక నాగమ్మా? ప్చు, ప్చు. చెట్టంత కొడుకు బుగ్గయిపోయాక ఇంకేమి చూసుకుని తలయెత్తుకుని తిరుగుతుంది? అయినా, పైవాళ్ళు వూరుకోరు, కనక, వ్యవహారం యెదురుతిరిగిందంటే ఆవిణ్ణి కూడా కడతేర్చాలి. అచ్యుతరాయుడేమంత తెలివయినవాడు కాదు, అతని మీదా వోక కన్ను వేసే వుంచాలి. ఎవర్నీ నమ్మడానికి వీలులేదు.

## నాలుగో రంగం

(రుక్కమ్మ వగరు. ఆమే, తిమ్మరుసయ్యా సంచునా వుంటారు)

రుక్కమ్మ—అత్తయ్యగా రేమి సెలవిప్పించారు బాబయ్యగారూ?

తిమ్మరుసయ్య—సెలవిప్పించడాని కేవ రేరగని దేమి వుంది తల్లీ? వృద్ధాప్యంలో వారికి కడుపుచిచ్చు తటస్థించింది. భారం అంతా తమ మీాద వుందని—

రుక్కమ్మ—ఇక నావల్ల యే మవుతుంది తండ్రీ? ఆ మహారాజుకి సేవలుచేసుకుంటూ అత్తయ్యగారి చాటున వుండవలసినదాన్ని నేను. నా బతు కిలా అయిపోయింది. ఇక నావల్ల యేమీా కాదు. అంతకీ భారం వారిదే అని మనవిచెయ్యండి.

తిమ్మరుసయ్య—ఇద్దరూ అలాగే అంటే యెలాగ తల్లీ? ఇది గొప్ప ఆవత్తే, సందేహం లేదు; కాని అబ్బాయిని చూసుకోవద్దూ? సాటిలేని సామ్రాజ్యం చక్కబెట్టుకోవద్దూ?

రుక్కమ్మ—నాకు మరుపువచ్చే దుఃఖమే తెచ్చి పెట్టాడా యీాశ్వరుడు తండ్రీ!

తిమ్మరుసయ్య—కాని దుఃఖానికి సమయా సమయా-

లున్నాయి. స్థితిగతులు పరకాయించుకోవాలి.

రుక్కమ్మ—దేవుడు చేసింది కొంతా, మనుష్యులు చేసింది కొంతాను. పెద్దమరిదిగారు బతికివుంటే నాబిడ్డకి అన్యాయం జరుగునా బాబయ్యగారూ?

తిమ్మరుసయ్య—నిజానికి వారు సందేహించవలసిన వారు కారు; కాని యెప్పటి కేమిటో యెవరు చెప్ప గలరమ్మా? అత్తయ్యగారికి వారిమీద మొదణ్ణుంచీ అనుమానమే. మహారాజులుంగారు తల్లి ఆలోచన అంగీకరించారు.

రుక్కమ్మ—అపకారం జరుగుతుం దేమో అని అత్తయ్యగా రంత పని చేయించారు. మరి చిన్నత్తయ్య గారు కాకపోతే వారి శ్రేయస్కాము లయినా అందుకు ప్రతిక్రియ చెయ్యడానికే చూస్తా రేమో యెవ రయినా ఆలోచించారా?

తిమ్మరుసయ్య—మన కా భయం అక్కరలేదు తల్లీ!

రుక్కమ్మ—మరిదిగారు ప్రాజ్ఞత వచ్చిన వారు. వీరాధివీరులు. అనేకయుద్ధాలలో జయలక్ష్మిని చేపట్టిన వారు. అలాంటివారికే అలాంటి చిత్రవధ తటస్థించి నప్పుడు, యెనిమిదేళ్ళ నిసుగు—నాబిడ్డ సుఖాన వర్ధిల్ల గలడా తండ్రీ?

తిమ్మరుసయ్య—మేమంతా యేమయి పోతాము

తల్లీ? అబ్బాయిగారిమీద యీగ వాలనిస్తామా?

రుక్కమ్మ—ఈశ్వర సంకల్పం యెలా వుందో? అత్తయ్యగారి హృదయంలో యింకా యెలాంటి కల్పనలు పుట్టుకువస్తున్నాయో? చిన్నత్తయ్యగారిని కూడా కడతేర్చే ప్రయత్నాలు సాగకుండా చూడాలి నుమండీ తమరు. ఇప్పటి కీకుటుంబంలో బుల్లిమరిదిగా రొక్కరే పెద్దలు. వారికిన్ని అపాయం రాకుండా కనిపెడుతూ వుండాలి తమరు.

తిమ్మరుసయ్య—ఇం కేమీ భయం లేదు. అచ్యుత దేవరాయలవారు అత్తయ్యగారి కనుసన్నల్లోనే మసులుకుంటున్నారు; కనక వారి కేమీ అపాయం రాదు. చిన్నత్తయ్యగారు క్షేమంగా వుండడానికి పూచీ నాది.

రుక్కమ్మ—నాబిడ్డకి సామ్రాజ్యం తక్కినా సరే, తక్కకపోయినా సరే, వంశనాశనం కాకుండా చూడండి నాయనగారూ! మామయ్యగారి సంతానంలో వొక రకాలమరణమూ, వొకరు దారుణమరణమూ పొందారు. ఇక వొక్కరున్నారు. ఆవంశాంకురం నాబిడ్డ వున్నాడు. ఈయిద్దరివల్లనైనా మళ్ళీ యీవంశం విస్తరించేలాగ చూడండి బాబయ్యా!

తిమ్మరుసయ్య—పదిమాట్లు చెప్పడం యెందుకు తల్లీ? తమరు నిశ్చింతగా వుండవచ్చు.

రుక్కమ్మ—బాబయ్యా, పెద్దమరిదిగారు నిజంగా చచ్చేపోయారా? బతికివుంటే ఆకబోదినైనా చూసు కుంటూ కాలం గడుపుకుంటారు చిన్నత్తయ్యగారు, వీలుంటే నాబిడ్డకి వుసురు తగలకుండా చూడండి తండ్రీ!

తిమ్మరుసయ్య—కళ్ళు పీకించమని మాత్రమే మహా రాజులుంగారి ఆజ్ఞ. ఆపని అయిపోయాక—

రుక్కమ్మ—సుఖసుఖాల కళ్ళు పీకెయ్యనిచ్చారా ఆ వీరాధివీరులు.

తిమ్మరుసయ్య—వారు వీరాధివీరులు కనకనే ఆపని సాధ్యం అయింది. ఏమి చెప్పను తల్లీ?

రుక్కమ్మ—ఏమీ వారు పరాక్రమించలేదూ? ప్రతి ఘటించనైనా లేదూ?

తిమ్మరుసయ్య—లేదమ్మా లేదు. ఏమి త్యాగం తల్లీ వారిది? ఆసన్నివేశం చూశాటప్పటికి నాకు బతుకు మీద రోతపుట్టింది. అయినా, రాజాజ్ఞ జవదాటలేక—

రుక్కమ్మ—ఏమి జరిగింది బాబయ్యా?

తిమ్మరుసయ్య—చెప్పలేక చెప్పలేక నేను రాజాజ్ఞ మనవి చేసుకున్నాను. తలారి కైజారు దూసి సిద్ధంగా నుంచున్నాడు.

రుక్కమ్మ—(కళ్ళుమూసుకుని) శ్రీహరీ! శ్రీహరీ!

తిమ్మరుసయ్య—తలుచుకుంటే, వాడితో చెప్పి

నన్నే వారు కడతేర్పించగలరు. కనీసం వారు విక్రమిస్తా రనయినా అనుకుంటున్నాను; కాని—

రుక్కమ్మ—రాజాజ్ఞ విని వా రేమి సెల విచ్చారు బాబయ్యా?

తిమ్మరుసయ్య—వా రేమీ సెలవివ్వించనేలేదు తల్లీ! ఎలా వున్నవా రలాగే నుంచుని, చేతులు విరిచి కట్టుకుని, మందహాసం చేస్తూ తలారిని పిలిచి—

రుక్కమ్మ—అయ్యో, అయ్యో! మాటమట్టుకైనా—

తిమ్మరుసయ్య—వ్యతిరేకమా తల్లీ? హరీ హరీ! అనేకయుద్ధాలలో వారు శత్రుసంహారం చేస్తూ వుంటే దగ్గిర వుండి, పక్కవక్కల వుండి, నేను కళ్ళారా చూశాను. ఆదృశ్యం జ్ఞాపకం వస్తేనే నా కిప్పుడు— (జలదరింపు నటిస్తాడు)

రుక్కమ్మ—తీమ మాటలతో వారి ఆమూర్తి నాకు కళ్ళకు కట్టినట్టు కనపడుతోంది బాబయ్యా!

తిమ్మరుసయ్య—అలాంటి వీరాధివీరులు వారు, చలనంలేకుండా నుంచుని, నాకేసి తిరిగి శిరస్సు వంచి రాజాజ్ఞ అందుకుని, తలారిని చూసి "కంగారువడకు. మహారాజులుంగారికి నాకళ్ళతో పనివచ్చింది—"

రుక్కమ్మ—(చెవులు మూసుకుని) విన లేను బాబయ్యా!

తిమ్మరుసయ్య—యోగులలో నున్నా వైరాగ్యం వుండబోదు తల్లీ!

రుక్కమ్మ—అలాంటి శాంతమూర్తిని అలా చెయ్యడానికి వా డెంత రాతిగుండెవాడో—

తిమ్మరుసయ్య—మరి వాడి కాజ్ఞాపించినవాణ్ణి నేను కదా, నాగుండెమాట? కూలికి విషం తాగేవాళ్ళం, యేమి బతుకులు తల్లీ మావి? ప్రభువు లెప్పుడు గుండె రాయిచేసుకున్నారో—

రుక్కమ్మ—అది సరే తండ్రీ!

తిమ్మరుసయ్య—కృష్ణదేవరాయలవా రెదిరించివుంటే నాకీ బాధ యేమీ? ఆగ్రహం వచ్చినప్పుడు స్వయంగా ఎదటివాణ్ణి నరికెయ్యడం కష్టం కాదు తల్లీ, దయామయంగా వుంచుకోవలసిన గుండె సప్రయత్నంగా రాయి చేసుకుని, చూస్తూ మరొకనిచేత ఆపనిచేయించడం— ఇంతకంటే దౌర్భాగ్యం యేమి వుంది తల్లీ?

రుక్కమ్మ—అందులోనూ చిత్రవధకదా తండ్రీ యిది?

తిమ్మరుసయ్య—ఉన్న దల్లా అదీ, కాని యేమిటీ చెయ్యడం? ఆసన్ని వేళం చూడలేక నేను మొగం పక్కకి తిప్పుకున్నాను. ఏమయిందో అని వొక్కక్షణానికి మళ్ళీ చూస్తినిగదా, గుడ్లు పీకెయ్యడంవల్ల గుంటలు పడ్డ కళ్ళనుంచి రక్తం ప్రవహించి ముఖం, వక్షస్థలం—

శరీరం అంతా తడిసిపోయినా చలనం లేకుండా—దుఃఖం అనేది స్మరణ కయినా రానీయకుండా, తలారిని పిలిచి "చితికిపోకుండానూ, గంట్లు పడకుండానూ, జాగ్రత్తగా తీశావా—"

రుక్కమ్మ—(మొగం వంచుకునీ, చెవులు మూసుకునీ) శ్రీహరీ! రామా, రామా!

తిమ్మరుసయ్య—"అవి మహామంత్రులవారి చేతిలో పెట్టు, మహారాజులుంగారిచ్చే బహుమతీ పుచ్చుకుని పెళ్ళాంబిడ్డలతో సుఖంగా బతుకు—"

రుక్కమ్మ—చూశారా, చూశారా బాబయ్యా? ఎంత మంచిహృదయం తండ్రీ వారిదీ? వారు బతికే వుంటే నాబిడ్డని కాదని సామ్రాజ్యం ఆక్రమించుకుని వుందురా నాయనగారూ?

తిమ్మరుసయ్య—అదిగో అదే మళ్ళీ పామరత్వం. మహారాజులుంగారూ వారూ ఒక్కతండ్రి బిడ్డలే కదా? మహారాజులుంగారి కలాంటి బుద్ధి పుట్టింది కదా?

రుక్కమ్మ—వద్దు బాబయ్యా, నా మహారాజుని తమ రేమీ అనకండి బాబయ్యా, వారి కది తండ్రి వక్షాన సంక్రమించినది కాదు బాబయ్యా!

తిమ్మరుసయ్య—మరి కృష్ణదేవరాయలవారికికూడా, అలాగే తండ్రిపక్షాన కాకుండా—

రుక్కుమ్మ—శ్రీహరీ! చిన్న త్తయ్యగారు పరమ సాధ్వి నాతండ్రీ! ఆమె కడుపున పుట్టారు కనకనే చిన్న మరిదిగారు అంతటి మహానుభావు లయినారు బాబయ్యా!

తిమ్మరుసయ్య—అమ్మా, ఇవన్నీ వూహాలు. పని జరిగే దాకా ఇదమిత్థ మని యెవరు చెప్పగలరూ?

రుక్కుమ్మ—చెప్పలేకేమి బాబయ్యా! అన్నగారి యెడల వారు కనపరిచిన భయభక్తులు నే నెరగనివా? అలాంటి మహోదారులు నాపాలబుగ్గలవాడికి అపాయం తలపెట్టగలరా? ఎంత ఘోరం జరిగింది తండ్రీ మరిదిగారికీ?

తిమ్మరుసయ్య—అదంతా నాపరిముఖంగా జరగడం యీశ్వరనిర్ణయం. అది రాజాజ్ఞ మరి, యేమిచెయ్యనూ?

రుక్కుమ్మ—అంత నమ్మకమైనవారు కనకనే అత్త గారూ, మహారాజూ అది తమమీద వుంచారు. అయితే, తరవాత యేమి జరిగింది బాబయ్యా?

తిమ్మరుసయ్య—జరగడాని కేమి వుంది? ఆపని అయి పోయాక, కృష్ణరాయలవారు "ఇక నేను బతికి యేమి లాభమూ? తలకొట్టించివెయ్యండి" అని బతిమాలు కున్నారు.

రుక్కుమ్మ—(ఆత్రంగా) తమ రేమన్నారు బాబయ్యా దానిమీద?

తిమ్మరుసయ్య—తరవాత యేమిచెయ్యాలో రాజాజ్ఞ

యేమీ లేదు. ఏమిచేస్తే యేమిటో అని నేను సంశయాత్ముణ్ణయిపోయాను, కొంతసేపు.

రుక్కమ్మ—అయిపోయి?

తిమ్మరుసయ్య—నిర్ధారణ చేసుకోలేక పోయాను. "నీయిష్టం" అని తలారికి చెప్పి వచ్చేశాను.

రుక్కమ్మ—కిమరున్నా అంత కాఠిన్యం వహించారేమి బాబయ్యా? చిన్నత్తయ్యగారి కాకబోదినైనా తక్కనివ్వగూడదా?

తిమ్మరుసయ్య—తక్కనిస్తే యేమిటో, తక్కనివ్వక పోతే యేమిటో? ఆకళ్లు చిత్తగించాక ప్రభువే నిర్ధారణ చేస్తారనుకున్నాను, వారు ఉత్తరక్షణానే పరమ పదించారు. పోనీ, అత్తయ్యగారు సెల విప్పిస్తారనుకుంటే వారు దుఃఖసముద్రంలో మునిగిపోయారు.

రుక్కమ్మ—పోనీ, చివరి కేమి జరిగిందంటారూ?

తిమ్మరుసయ్య—వారు చనిపోయివుంటారు తల్లీ!

రుక్కమ్మ—తలారి యేమంటాడూ?

తిమ్మరుసయ్య—తరవాయి తీరిపోయిందని—

రుక్కమ్మ—అంటే?

తిమ్మరుసయ్య—ఇక వివరాలెందుకూ తల్లీ?

రుక్కమ్మ—అత్తయ్యగారి సలహావల్లనూ, మహారాజు ఆజ్ఞవల్లనూ చుట్టబెట్టుకునే పాపంలో నాకూ వాటా

వుంది. వధావిధానం వింటే కొత్తగా అంటుకునే దేమీ లేదు బాబయ్యా, సెలవిప్పించండి.

తిమ్మరుసయ్య—నేను ముందువచ్చేశాను. తరవాత తలారి బయలుదేరాడు. ఒక్క క్షణానికి పెద్దపులి బొబ్బలు వినిపించాయంటాడు వాడు.

రుక్కమ్మ—రామారామా! కండకండలుగా పీకేసి వుంటుంది పులి. కళ్లున్న రోజుల్లో పులులనూ సింహాలనూ పిడిగుద్దులతో కూలగొట్టినవారు మరిదిగారు.

తిమ్మరుసయ్య—అది నాకు తెలియనిదా అమ్మా?

రుక్కమ్మ—అయితే, బాబయ్యా, ఏసామ్రాజ్యం కోసం వారు చిత్రవధకు పాల్పడ్డారో ఆసామ్రాజ్యం పాలిస్తే నాబిడ్డకు జయం వుంటుందా?

తిమ్మరుసయ్య—అయ్యో తల్లీ, కౌటిల్యశాస్త్రం యేమి చెబుతోంది? రాజనీతి వేరు కాదూ?

రుక్కమ్మ—ఇందుకు ఈశ్వరుడు తృప్తిపడతాడా?

తిమ్మరుసయ్య—ఈశ్వరాజ్ఞ కాకుండా చీమ అయినా కుట్టగలదా అసలు?

రుక్కమ్మ—తమకు బదులుచెప్పలేను. బాబయ్యా! జరిగిందేదో జరిగిపోయింది, ఇక మీదట మాత్రం మరేమీ దారుణాలు జరక్కుండా చూస్తూ వుండండి.

తిమ్మరుసయ్య—వెయ్యి కళ్లతో కనిపెడుతూ

వుండనూ? ఇంకానా?

రుక్కమ్మ—మధ్యాహ్నం కూడా వొకమాటు దర్శనం యిప్పించండి నాయనగారూ!

తిమ్మరుసయ్య—తప్పకుండానూ. మరి సెలవు.

రుక్కమ్మ—సెలవు.

ఇద్దరూ వెళ్లిపోతారు

## అయిదో రంగం

(విరూపాక్షరాయని లోగిలి. మేడముందున్న తోటలో అతనూ అచ్యుతదేవరాయడూ పచారుచేస్తూ వుంటారు)

విరూపాక్షరాయడు—ప్రస్తుతానికి తిమ్మరుసయ్యగారే రాజకార్యాలు చక్కబెడుతూ వుంటారు. ఎప్పటిలాగే నగరం గోవిందరాజయ్యగారి చేతిలోనూ, సైన్యం నాదిండ్ల అప్పన్నగారి చేతికిందా వుంటాయి. అందరిమీదా మాత్రం దొడ్డమ్మగారి పర్యవేక్షణం వుంటుంది.

అచ్యుతదేవరాయడు—ఇంకా సెలవిప్పించండి.

విరూపాక్షరాయడు— ఇంకేమి వుందనీ?

అచ్యుతదేవరాయడు—మరి వదినగారి మాట?

విరూపాక్షరాయడు—వారింతలో తేరుకునే టట్టు లేరు. తేరుకున్నా వారు రాజకార్యాల దరికి పోరు. వారి

భక్తి యేమిటో, వారి పూజ లేమిటో, వారి దానధర్మా లేమిటో, అంతే.

అచ్యుతదేవరాయుడు—వారితండ్రిగారూ, అన్నలూ వున్నారు కదా? రాజ్యాలు లేని పరదార్లు కదా వారు?

విరూపాక్షరాయుడు—నిజమే; కాని దొడ్డమ్మగారికీ వారికీ అంతఃకరణశుద్ధి లేదు. ఆమె వారిని చేరనివ్వరు.

అచ్యుతదేవరాయుడు—మరి తమరు?

విరూపాక్షరాయుడు—ఈ రోజులు వెళ్ళి పోయిన వెంటనే నేను నా మండలానికి వెళ్ళిపోతాను.

అచ్యుతదేవరాయుడు—అదేమిటి కొత్తా వింతా సెలవిప్పిస్తున్నారు తమరు.

విరూపాక్షరాయుడు—ఆశ్చర్య మెందుకూ?

అచ్యుతదేవరాయుడు—కారణా లడగవచ్చునా?

విరూపాక్షరాయుడు—అన్నగా రిద్దరూ స్వర్గస్థులు కావడమే.

అచ్యుతదేవరాయుడు—అయితే?

విరూపాక్షరాయుడు—వీరనరసింహారాయ లన్నయ్య గారు నేనంటే ప్రాణా లిచ్చేవారు. కొత్త ప్రభువుల దగ్గిర నాకలాంటి చనువు దొరుకుతుందా? మొన్నటిదాకా విజయనగర సామ్రాజ్యం సొంతం అన్నట్టు చలామణీ అయినాను. ఇకముందు రాజబంధువుల్లోవొకణ్ణి-అంతేనా?

అచ్యుతదేవరాయడు—ఇక్కడ వుంటే మాత్రం తమ సొంతమండలం ఇంతవరకూ ఏమయినా వన్నె చెడిందా? కాకపోయినా, చిన్నప్పణ్ణుంచీ యీ మహా నగరంలో పెరిగినవారు—

విరూపాక్షరాయడు—అదంతా నిజమే, కాదనను. అయితే, ఎంత సొంతపనులు చూసుకుంటూ వుండినా రోజు రోకమా టయినా ప్రభుదర్శనం చేసుకుంటూ వుండాలి కదా? వర్తమానం వచ్చినప్పుడున్నా వెదుతూనే వుండాలికదా? వారేమి ఆజ్ఞాపిస్తారో, ఏమి కావాలో—

అచ్యుతదేవరాయడు—చక్రవర్తితో అంత చనువు ఉండడం మండలాధిపతికి క్షేమంకదా?

విరూపాక్షరాయడు—అది నిజమే కాగట్టండి! ఏమయినా, ప్రభువు, ఎదట మునుపు మిత్రుణ్ణాయి మసిలేవాణ్ణి. ఇక భృత్యుణ్ణాయి—

అచ్యుతదేవరాయడు—విద్యారాలు సెల విస్తున్నారు తమరు. అందరిమీదా పర్యవేక్షణం చేస్తూ దొడ్డమ్మగారుండగా—

విరూపాక్షరాయడు—నా కా దిలాసా యేమీ కన పడ్డంలేదు. పెద్దన్నయ్యగారు కాలం చేశారు. వెంటనే నాకేమిటో దిగులుపట్టుకుంది. పదవిపోయినట్టే తోచింది.

వెంటనే నాకీ సంకల్పం కలిగింది. ఈ దినా లెప్పుడు గడుస్తాయా అని చూస్తున్నాను.

అచ్యుత దేవరాయడు—చిక్కే.

విరూపాక్షరాయడు—ప్రారంభంలో అక్కడ కొత్త గానే వుండవచ్చును. అయితే, పువ్వు లమ్మిన యీ వూళ్లో కట్టె లమ్మడం కంటే పల్లెటూరూ పట్నమూ కూడా కాని అక్కడ ఆ కొత్తే నయం. ఇక్కడ వుంటే పరాధీనతా అక్కడ వుంటే స్వాధీనతాను. అంటే, విజయనగర ప్రభువులకు సామంతుణ్ణయి వుండిన్నీ అక్కడ స్వేచ్ఛ అనుభవించవచ్చు.

అచ్యుత దేవరాయడు—దొడ్డమ్మగారు తమర్ని విడిచి పెడితేనూ; అవునా ?

విరూపాక్షరాయడు—మొదట లాభంలేనట్టే కన బడింది; కాని చివరికి, తప్పనిసరి అయితే ఆలోచిద్దాం అన్నారు దొడ్డమ్మగారు. నాకు సెలవు దొరుకుతుం దనే నా నమ్మకం.

అచ్యుత దేవరాయడు—అలా కాదు, తమరు వెళ్ళ వద్దు. దొడ్డమ్మగారు నా కెలాంటి పని చెప్పినా నేను వొంటరి నయిపోతాను. తమరుంటే నే నేమయినా చెయ్యగలను.

విరూపాక్షరాయడు—అసహాయ శూరులు తమకి

వాంటరితనంఅంటే యేమిటి అన్నగారూ! తిమ్మరుసయ్య గారి వంటి మంత్రి లేకపోయినా, దొడ్డమ్మగారి వంటి సలహాదారులు లేకపోయినా, ఈ విశాల విజయనగర సామ్రాజ్యం తమరు విలాసగా పాలించగలరు. తమప్రతిభ నాకు తెలుసు. దొడ్డమ్మగారు తమమీద చాలా ఆశ పెట్టుకుని వున్నారు.

అచ్యుతదేవరాయుడు—అలాగా ?

విరూపాక్షరాయుడు—"పోయిన వారు పోయినా కుటుంబం విడిపోడానికి వల్లకా" దని చెబుతూ వదిన గారు తమ విషయం బాగా ఆలోచించా లని గట్టిగా సెలవిచ్చినట్టు తెలిసింది. ఇది దొడ్డమ్మగారికి నచ్చింది.

(అచ్యుతదేవరాయని ముఖం వికసిస్తుంది. వెంగం పక్కకి తిప్పుకుని తీక్ష్ణంగా చూస్తూ తలపంకించు కుంటూ వతను. అది చూసి విరూపాక్షరాయుడు పెద వులు బిగించి కనుబొమ్మ లెగరవేసుకుంటాడు)

అచ్యుతదేవరాయుడు—అయితే, తమ రిక్కడే వుండాలి తప్పదు. తమరు దొడ్డమ్మగారి చెల్లెలికుమాళ్ళు కావడం వల్ల నాకు బాగా సన్నిహితులు. ఇది వరలో మనకు గల పరిచయం యీ పదిదినాలలోనూ దృఢతర స్నేహంగా పరిణమించింది. దొడ్డమ్మగారు మా అమ్మ గారిని సొంతచెల్లెలుగా చూసుకుంటున్నారు. అంచేత, నేను తమర్ని విడిచివుండలేను.

విరూపాక్షరాయడు—దొడ్డమ్మగారి హృదయం మిక్కిలీ స్నిగ్ధ మయినది. దురదృష్టవశాన, ఆమెకూ చిన్న దొడ్డమ్మగారికీ సరిపడలేదు కానీ—

అచ్యుతదేవరాయడు—అందుకు విచారిస్తే యేమి లాభమూ? చిన్నదొడ్డమ్మగారు, పెద్దదొడ్డమ్మగారికీ, మా అమ్మగారికీ కూడా యెప్పుడూ యెడంగానే వుంటూ వచ్చారు. అయినా, నాయనగారు సమర్థులూ చతురులూ కనక సరిపోయింది; కాని లేకపోతే గృహచ్ఛిద్రా లేర్పడి సామ్రాజ్య నిర్మాణాని కవకాశాలు లేకపోయి వుండును.

విరూపాక్షరాయడు—(అచ్యుతదేవరాయని ఇంగితం కనిపెడుతూ) కాని కృష్ణదేవరాయలవారు చనిపోడం సామ్రాజ్యానికి పెద్దదెబ్బ. అంటే, తమరు సామాన్యులని కాదు సుమండీ.

అచ్యుతదేవరాయడు—నాకు నేనయి చెప్పుకోడం కాదు గాని, అనేక యుద్ధాలలో చిన్నన్నయ్యగారికి నే ననేక సందిగ్ధస్థితులు తప్పించాను.

విరూపాక్షరాయడు—అవునుగదా? అంచేతనే వదినగారూ, దొడ్డమ్మగారూ తమమీద చాలా ఆశపెట్టుకుని వున్నారు; కాని కృష్ణదేవరాయలవారు లేని లోపం మాత్రం సాధారణమైనది కాదు. అన్నయ్యగారంచేత అలాంటి ఆజ్ఞ యిప్పించారో, దానికి ప్రోత్సాహంచేసినవా

రెవరో, ప్రతివిషయంలోనూ మంచిచెడ్డలూ, లాభ నష్టాలూ, సాధ్యాసాధ్యాలూ బాగా విచారణచేసే తిమ్మరుసయ్యగారు మారుమాట లేకుండా ఆవని యెంచేత వెంటనే జరిపించివేశారో నాకేమీ అర్థం కావడం లేదు; గాని చాలా పొరపాటే జరిగిపోయింది.

అచ్యుతదేవరాయుడు—వా రుండవలసిందే. కాని మనం ఇందరం వుండగా, వారొక్కరివల్లా సామ్రాజ్యానికి ముప్పువస్తుం దంటే మాత్రం నేను నమ్మలేను. ఇంతకీ: పెద్దన్నయ్యగారు నిరాధారంగానే అలా అనుమానించా రంటారా తమరు?

విరూపాక్షరాయుడు—ఎంతమాట? ప్రభువుని శంకించ గలనా నేను? గాని అంతా బ్రహ్మభేద్యంగా వుంది. నేనేమీ చెప్పలేకుండా వున్నాను. పెద్దన్నయ్యగారి ఆజ్ఞ దొడ్డమ్మగారికి మొదట తెలియదు. తరవాత తెలిశాటప్పటి కంతా అయిపోయింది.

అచ్యుతదేవరాయుడు—అలా సెల విప్పించారా?

విరూపాక్షరాయుడు—తెలిసిన తరవాత వారు చాలా విచారించారు. ఇక వదినగారి సంగతి చెప్పనే లేను.

అచ్యుతదేవరాయుడు—చిన్నదొడ్డమ్మగారికి మాత్రం అనుమానం—

విరూపాక్షరాయుడు—అవును, విన్నాను; కాని రామ

రామా! అది వొట్టి నీలాపనింద తప్ప మరేమీ కాదు. ఆపాపం కించిత్తున్నూ దొడ్డమ్మగారి కంటదు. నేనిది చాలా గట్టిగా చెప్పగలను. అది అలా జరిగిపోయినందుకే వారు చాలా పరితపిస్తున్నారు. ఒక విధాన కాదు, సాయం పోవడం, నీలాపనింద రావడం—

అచ్యుతదేవరాయడు—కానేవచ్చు.

విరూపాక్షరాయడు—తమరు కనిపెట్టే వుంటారు, గుణగ్రహణంలో దొడ్డమ్మగారిని చెప్పి మరొకర్ని చెప్పాలి. ఇప్పుడు కృష్ణదేవరాయలవారే వుంటే, పిల్ల వానిపేరు మీదుగా తమ రిద్దరూ పరిపాలన సాగిస్తూ వుందురనీ, తాము రామా కృష్ణా అనుకుంటూ నిశ్చలంగా కాలం వెళ్లబుచ్చేటందుకు వీలుగా వుండే దనీ దొడ్డమ్మ గారిభావం; కాని దైవసంకల్పం మరోలా వుంది.

అచ్యుతదేవరాయడు—అయితే, పెద్దన్నయ్యగారి సంకల్పం పెద్దదొడ్డమ్మగారికి మొదటే తెలిసివుంటే—

విరూపాక్షరాయడు—ఇలా జరిగే వుండదు. అసలు, అన్నయ్యగారి కయినా యీసంకల్పం స్వయంభువు కాదండీ! ఎవరో వారిమనస్సు పాడుచేశారు.

అచ్యుతదేవరాయడు—తమ ఉద్దేశం—

విరూపాక్షరాయడు—తెలియడం అంటూ వుంటే తమకే తెలిసివుండాలి.

అచ్యుతదేవరాయుడు—నాకున్నూ యేమీ తెలియదు. నాకింతవరకూ రాజకార్యాలంటే అంతశ్రద్ధ లేనే లేదు. దినానికొక్కమాటు అన్నయ్యగారి దర్శనం చేసుకోడమూ, తరవాత స్నేహితులతో విహారాలూను.

విరూపాక్షరాయుడు—రాజకార్యాలలో ప్రవేశిస్తే యిక నిద్రాహారాలకున్నూ తెరపివుండదు. అవి మీద పడేదాకానే రాజపుత్రులకు సుఖం అయినా, ఆనందం అయినాను.

అచ్యుతదేవరాయుడు—అన్నయ్యగారు బతికివుంటే యిప్పుడయినా—

విరూపాక్షరాయుడు—తమ కా ఆందోళన అక్కర లేదు. తమకి ఉక్కిరిబిక్కిరి కాకుండా, తమమీద, క్రమాంతరాలమీద కార్యభారం వుంచుతూ వుండమని దొడ్డమ్మగారితో నేను మనవిచేసుకుంటాను లెండి.

అచ్యుతదేవరాయుడు—అక్కర్లేదక్కర్లేదు, వారితో తమరలా మనవిచెయ్యనేవద్దు. పెద్దన్నగారుపోవడంతోటే నాకు ఆటలమీద దృష్టి మళ్ళిపోయింది. బాబయ్యగారూ, వారి తరవాత పెద్దన్నయ్యగారూ స్తవనీయంగా రాజ్యపాలనం చేశారు. నేను, వారి ప్రతిష్ఠకు భంగంరానివ్వను.

విరూపాక్షరాయుడు—తమ రంతవారు కారనా? తిమ్మరుసయ్యగారు కూడా దొడ్డమ్మగారితో తమ

విషయం చాలాదూరం మనవిచేసినట్టు తెలిసింది.

అచ్యుతదేవరాయుడు—సందేహమా! నేనంటే వారికి చాలా ప్రేమ. తమ తమ్ముళ్లు గోవిందరాజయ్యగారి తోనూ, తమ అల్లుడు అప్పన్నగారితోనూ సమంగా దిద్దుతున్నారు వారు నన్నుం. నాశక్తి వారికి బాగా తెలును.

విరూపాక్షరాయుడు—శక్తి వుండడమే వస్తే అది అణగిపోయి వుంటుందా! ఇంతకీ: నరసరాయులవారి అంశ తమదగ్గిర పూర్తిగా వుంది, నాకు తెలును.

అచ్యుతదేవరాయుడు—నేనది బాగా చూపిస్తాను. నాసంగతి తమరున్నూ దొడ్డమ్మగారికి మనవిచెయ్యాలి.

విరూపాక్షరాయుడు—అది తమరు సెలవివ్వించాలా! అవశ్యమూను.

అచ్యుతదేవరాయుడు—మరి నాకిప్పటికి సెలవు దయచేయించండి, యింకోమాటు కలుసుకుందాం.

విరూపాక్షరాయుడు—చిత్తం చిత్తం, సెలవు.

అచ్యుతదేవరాయుడు—సెలవు.

(అచ్యుతదేవరాయుడు వెళ్ళిపోతాడు)

విరూపాక్షరాయుడు—(అచ్యుతదేవరాయుడు వెళ్ళిన దిక్కుకి చూస్తూ) అబ్బో, పెద్దయెత్తులే! ఓహో! పెంకి రాకడలు వచ్చావంటే, నువ్వు కూడా తక్కువ, జాగ్రత్త.

(లోపలికి వెళ్ళిపోతాడు)

## ఆరో రంగం

•••○•••

(రుక్కమ్మ నగరు. కుడిడొక్కనుంచి రక్తం కారుతూ వుండగా చెయ్యి అడ్డుపెట్టుకుని "చచ్చాను, చచ్చాను" అంటూ వొకపరిచారిక వచ్చి కూలబడుతుంది. "ఏమిటే! ఎందుకే!" అంటూ మరో పరిచారిక వచ్చి, దగ్గిర కూచుని దాన్ని పట్టుకుంటుంది)

మొదటిపరిచారిక—డొక్కలో పొడిచాడే! చచ్చానే! పేగులు బయిటికివచ్చాయేమో చూడు.

రెండోపరిచారిక—పేగులూలేవు, గీగులూలేవు, ఏదీ చూస్తానూ (చూసి) పెద్దగాయమే. ఎవడే పొడిచినవాడూ?

మొదటిపరిచారిక—బతకనంటావా?

రెండోపరిచారిక—పొడవడం యేమిటో, పొడిచినవాడెవడో, యెందుకు వచ్చిందో యిదంతా చెప్పకపోతే నువ్వు బతికినా బతకనివ్వరు తిప్పమ్మాదేవిగారు, తెలుసా?

మొదటిపరిచారిక—ఎవడో నాప్రాణాలకు దాపరించాడే వాణ్ణిపాతెయ్యా! (అయ్యో, అయ్యో! ఏడుస్తుంది)

రెండోపరిచారిక—ఎవడే వాడూ?

మొదటిపరిచారిక—అమ్మగారి చుట్టంట. "బాగా వున్నావుటే గంగూ?" అంటూ వచ్చాడే, వాడి దుంప—

రెండోపరిచారిక—నువ్వెరగవూ?

మొదటిపరిచారిక—వాడిమొగం నేనెప్పుడూ చూడ

లేదే! అమ్మగారిని చూడ్డానికి వచ్చా ననగా, అనుమానం కలిగి, అదీయిదీ అడుగుతూ వుండగా, ఆడుకుంటూ బుల్లిబా బిలా దయచేశారు. వెంటనే ఆవచ్చిన చచ్చి నాడు కైజారు దూసి బుల్లిబాబుమీాది కురికాడు. గభీ మని నే నడ్డువెళ్ళాను. తప్పిపోయి వాకపోటు బుల్లిబాబు చేతికీ రెండోపోటు నాకిక్కడా తగిలాయే, యెలా పోయాడే వాణ్ణి కోసెయ్యా!

రెండోపరిచారిక—బుల్లిబాబేమయినట్టూ? (లేస్తుంది)

రెండోపరిచారిక—చస్తూ వుంటే నన్ను విడిచిపెట్టి వెళ్ళి పోతావుటే?

రెండోపరిచారిక—నీచావుబతుకులు కాదు ప్రధానం, ముందు బుల్లిబాబు సంగతి చూసుకోవాలి. లేకపోతే, నీకయిందే నాకూనూ. ఓర్చుకో, చూసివస్తాను.

మొదటిపరిచారిక—(లేచి) నాకొడకోయ్! నాకూతు రోయ్! నేను బతకనర్రోయ్! నాప్రాణాలకు వాడెక్కడ దాపరించా డర్రోయ్! (ఏడుస్తూ లోపలికి వెళ్లిపోతుంది)

## ఏడో రంగం

....o0o....

(తిప్పమ్మ నగరు. ఒకగదిలో తిప్పమ్మా తిమ్మరుసయ్యా నుంచుని వుంటారు.)

తిప్పమ్మ—పుట్టింది రాచపుట్టుక కదా యీాకా స్త్రీ

అంత ఔంబేలుపడిపోతే యెలాగా? తమరు చెప్పినా వినక నేను చెప్పినా వినక—ఇక తన ధోరణే తనదా?

తిమ్మరుసయ్య—అమ్మా, బహుసున్నితమైన హృదయం కోడలుగారిది. తగ్గనభగ్గనలకు తాళుకోలేదు. ఏక పుత్రునిమీద మృత్యుచ్ఛాయ వాలిందనేటప్పటికి బేజారయిపోయారు వారు. సావంకాశంమీద అంతా నేను చక్కబరుస్తాను లెండమ్మా!

తిప్పమ్మ—తాను లోకంతోపాటే అయితే నాకిక ఔంగ యేమిటీ? తల్లినిపట్టే కదా బిడ్డలు? బుల్లిబాబుని తనలాగే దిద్దితే యిక మాటతక్కుతుందా?

తిమ్మరుసయ్య—నామనవి యేమిటంటే? సున్నితమైన హృదయానికి వోవట్టాన కాఠిన్యం అలవడదు. అలవడితే మాత్రం అంత భయంకరమైనది మరి వుండదు. ఇలాంటి సన్నివేశా లొకటిరెండు తటస్థించాయంటే ఆకాఠిన్యం తనంతట అదే వస్తుంది. కనక, తమరు కొంచెం వోపికపట్టాలి.

తిప్పమ్మ—కాఠిన్యం అంటే—

తిమ్మరుసయ్య—అదే అదే, నాఉద్దేశం తమరు గుర్తించాలి. స్త్రీజనసామాన్యానికీ తమకూ పోలికే లేదు. రాజ్యపరిపాలన కుండవలసిన అర్హత తమవద్ద పూర్తిగా వుంది. అదీ నేను మనవిచేసుకునేది.

తిప్పమ్మ—అంతే అంతే, అదిలేకపోతే మనం యెందు కయినా పనికివస్తామా? అయితే, తమరు ముందు సంగతి యేమాలోచించారూ?

తిమ్మరుసయ్య—ఆలోచించకపోలేదు. అయితే—

తిప్పమ్మ—ఇది హత్యాప్రయత్నం అనడాని కేమయినా సందేహం వుందిటండీ? ద్రోహిని పట్టించి—

తిమ్మరుసయ్య—ఇది హత్యాప్రయత్నం అనడానకీ సందేహం లేదు, ద్రోహిని పట్టుకోడమూ తప్పదు. అయితే—గంగు వైద్య శాలలో వుంది. రెండు దినాలు అది మాట్లాడగూడ దని వైద్యుడు నిషేధించాడు. తరవాత సావకాశంగా దానివల్ల పోలికలు తెలుసుకుని—

తిప్పమ్మ—సావకాశంగానా? ఈలోపున వా డెక్కడి కయినా పారిపోడూ?

తిమ్మరుసయ్య—ఇప్పుడు పారిపోలేదనా తమవూహా? నానమ్మకం యేమిటంటే? వాడు ద్రోహం తలపెట్టాడు. పోటు తప్పిపోయింది. కసితీర్చుకోడానికి మళ్ళీ వస్తాడు, వచ్చితీరతాడు, దొరికిపోతాడు. వాణ్ణి తమ కళ్ళయెదట యేనుగుకాళ్ళకింద బెట్టి నేను మట్టించేస్తాను, సరా?

తిప్పమ్మ—వా డెవడయి వుంటా డనీ తమ నమ్మకం?

తిమ్మరుసయ్య—నా కేమీ ఆలోచన తెగడం లేదు. మనమీాద పగపట్టవలసినవా రెవ రున్నారూ?

తిప్పమ్మ—అదేమిటి పంతులుగారూ, నాసవితిమీద తమకి అనుమానం లేదూ?

తిమ్మరుసయ్య—మొదట వారిమీదే కలిగింది; గాని నిలవలేదు.

తిప్పమ్మ—అదేమిటండీ?

తిమ్మరుసయ్య—వారిపక్షాన అయిూడు కుర్రవాడెవ డున్నాడూ?

తిమ్మప్ప—కూలికి రాకూడదూ?

తిమ్మరుసయ్య—అదీ వొ్ాక ఆలోచనే, సందేహం లేదు. డబ్బుకక్కుర్తి యెంత కయినా పురికిస్తుంది; కాని అగ్నిహోత్రం కదా తమరు? తమపేరుచెబితే దిక్కులు గజగజలాడిపోతాయే, యెవడో కూలివాడు వచ్చి—

తిప్పమ్మ—మరి తమ వూహా యేమిటీ?

తిమ్మరుసయ్య—నా వూహా వొకట్టే. వూనుకుంటే వాణ్ణి నిమిషాలమీద పట్టుకోవచ్చు, ఖైదు చెయ్యవచ్చు, చిత్రవధ చెయ్యవచ్చు, చర్మం వొలిపించి మీదికి కుక్క లను వదలవచ్చు, ఉప్పుపాతర వెయ్యవచ్చు; కాని మనం యిప్పుడే యీ వ్యవహారం ప్రారంభిస్తే ఈ కల్లోలాలు పురస్కరించుకుని సామంతు లెవరయినా—

తిప్పమ్మ—అదీ నిజమే లా కనబడుతోంది దండీ! పట్టాభిషేకం అయిపోయిందంటే జనులు తమకి తామే

వద్దనుగుతారు. ద్రోహుల కప్పుడు కుమ్మక్కు చేసేవా రుండరు. సైన్యం కూడా వొక శక్తికి అంకితం అయిపో తుంది కనక, అంతఃకలహాల కవకాశా లుండవు.

తిమ్మరుసయ్య—అదీ నా నమ్మకం. మన మిప్పుడు మిక్కిలీ గంభీరంగా వుండాలి. ఎవరో కుర్రవాడు—ఏదో కారణంవల్ల ఉద్రిక్తుడై వేసిన యీ కుప్పిగంతులకు మనం అంతగా—

తిప్పమ్మ—అదేమిటి పంతులుగారూ! కోటలో— అంతఃపురంలో—

తిమ్మరుసయ్య—నాబుద్ధికి తోచింది మనవిచేసు కున్నాను. కాదంటే—ఆ పనే ముందు చేయిస్తాను, సెలవిప్పించండి.

తిప్పమ్మ—అదా మరొకటా ముందు చెయ్యడం ఆలోచించండి. వ్యవహారం అంతా తమమీద విడిచి పెట్టాను. మధ్యమధ్య సలహాలు మాత్రమే చెబుతూ వుంటాను చివరి కేదిచేసినా యేదిమానినా తమ యిష్టం

తిమ్మరుసయ్య—నాయిష్టం అని తమరువిడిచిపెట్టేస్తే యెలాగమ్మా? నేను తమ భృత్యుణ్ణి—

తిప్పమ్మ—తమ రంతమాట సెలవిప్పించవద్దు.

తిమ్మరుసయ్య—తమ కంత అనుగ్రహం వున్నందుకు చాలా సంతోషం. అయితే, నేను తమ భృత్యుణ్ణే

ఇందు కేమీ సందేహం లేదు. ఇలా చెప్పుకుంటే నాకు పరువే గాని అప్రతిష్ఠలేదు. ఇలా చెప్పుకుంటేనే నాకు గౌరవమున్నూ. చక్రవర్తికి పాదా లొత్తేవాడు కూడా అదృష్టవంతు డయి వుండాలి. మంత్రిసంగతీ దండనాథుడి సంగతీ యిక చెప్పడం యెందుకూ? మహామంత్రికూడా భృత్యుడే, కాదంటే, పెద్దభృత్యుడు, అంతే.

తిప్పమ్మ—తమతో నేను వాదించగలనా? తమ మట్టుకి తమ రేమనుకున్నా, నేను, తమర్ని విజయనగర సామ్రాజ్యానికి మూలాధారం అని భావించుకుంటున్నాను. తమరు ఈచిక్కు లన్నీ తొలగించి, సరియైన ప్రభుత్వం యేర్పడ్డ దని, జను లనుకునేలాగ—

తిమ్మరుసయ్య—నాజీవితం ధారపోస్తాను. తమ యీ కోరిక నెరవేరుతుంది. వీరనరసింహారాయలవారిని మించిన ప్రభువు దొరికా డని జనులు సంతోషిస్తారు.

తిప్పమ్మ—అబ్బాయి మొగాన మంచి కళ వుంది, తమరూ చిత్తగించే వుంటారు.

తిమ్మరుసయ్య—చిత్తం, చిత్తం—తుళువవంశంలో యిలాంటి జాతకుడు పుట్టలే దంటారు సిద్ధాంతిగారు.

తిప్పమ్మ—అంతవాణ్ణి తమరు చెయ్యాలి. తిప్పమ్మ కుర్రవాణ్ణి బాగుచేసిందని నాకు పేరుతెప్పించాలి తమరు.

తిమ్మరుసయ్య—ఇంతకంటేనా అమ్మా? వీరనరసింహా

రాయలవారు ఇంటా బయటా కూడా స్వతంత్రంగా వ్యవహరించారు. అప్పుడు నా శక్తి కనపరచడానికి కాదు, నేను తెలుసుకోడానికే వీలులేకపోయింది. ఇక నేను ఆశ్చర్యచకితులుగా చేసేస్తాను తమర్ని.

తిప్పమ్మ—తమ రంతవారూ అవుదురు.

తిమ్మరుసయ్య—మరి, వోకమాటు వైద్యశాలకు—

తిప్పమ్మ—అవు నవును, వాడి పోకి ళ్ళన్నీ బాగా జ్ఞాపకంచేసుకుంటూ వుండమనండి దాన్ని.

తిమరుసయ్య—సెలవిప్పించండి.

తిప్పమ్మ—దయచెయ్యండి.

(తిమ్మరుసయ్య వెళ్ళిపోతాడు)

తిప్పమ్మ—తిమ్మరుసయ్యవారు చెప్పింది బాగుంది, నిజమే. ఈమాత్రానికే మనం కంగారుపడ్డట్టు తెలిస్తే జనులను అదుపులో వుంచడం కష్టం. తిమ్మరుసయ్యగారివల్ల కానిది లేదు. ఆయనకు మన యెడల మంచిభయభక్తులున్నాయి, సందేహంలేదు. తిన్నది ఊరికేపోతుందా మరి?

---

## ఎనిమిదో రంగం

••••o◉o••••

(నాగమ్మనగరు. నాగమ్మా నీలమ్మా కూచునివుంటారు. ఇద్దరికీ మధ్య రక్తసిక్తమైన కైజా రుంటుంది. లక్ష్మమ్మ అప్పుడే వస్తుంది. వియ్యన్న ఆమె వెనక వుంటాడు.)

నాగమ్మ—రండి, నీలం వోక పందినిపొడిచి వచ్చింది.

లక్ష్మమ్మ—(నీలమ్మకేసి మెప్పుగా చూస్తూ) నీలమ్మ తలుచుకుంటే యింకా అడ్డా? అయితే—

నాగమ్మ—నీలమ్మ కనబడితే విరూపాక్షరాయుడి కళ్లు తిరిగిపోతూ వుండేవట.

లక్ష్మమ్మ—ఆ, మిడతగాడు.

నాగమ్మ—మిడతే అయిపోయాడు చివరికి. వాడి వేడి నెత్తుటితో నీలానికి నేను బొట్టుంచాను, మీరున్నూ వుంపించండి.

లక్ష్మమ్మ—ఇంతకంటేనా? (కైజారు తాకి నీలమ్మకి బొట్టుపెడుతుంది)

నాగమ్మ—ఆభూతం వర్తమానించగా పాపారాయుడు గారప్పుడే వెళ్లారుట. వారు గుమ్మందిగడం తడవుగా విరూపాక్షుడు సాక్షాత్కరించి ప్రేమభిక్ష—

నీలమ్మ—ఆమాట చెవినిపడాటప్పటికి నాకు వొళ్లు తెలియకుండా పోయింది. ఒక్క క్షణానికి మూలుగు వినపడి ప్రపంచకం తెలిసింది. కైజా రూడలాక్కోగా పేగులు బయటికి వచ్చాయి. అరటిబొందలాగ తివాసీ నిండుగా పడిపోయాడు రాక్షసుడు.

లక్ష్మమ్మ—ఆభూతం కుడిచెయ్యి నరికేశావు. ఒక్క దెబ్బతో రెండుఫలాలు సాధించావు. (నాగమ్మతో) ఎందుకూ? దేవుడు చూడలేకపోయాడు.

నాగమ్మ—నాకర్మం అలా కాలిపోయింది. కడతేరి నాయనా, మోడయి నీలమూ నా కడుపులో చిచ్చు—

లక్ష్మమ్మ—వద్దువద్దు. తమరు కళ్ళనీళ్ళు పెట్టుకున్నా రంటే చేతిలో వున్న కార్యం జారిపోతుంది. నీలమ్మ చేసినపనికి సంతోషించవలసిన సమయం యిది. (వెనక్కి చూస్తూ) ఇలా రా తమ్ముడూ! నీచేతిలు మహారాణికి విన్నవించుకో.

వియ్యన్న—(నాగమ్మ యెదటికి వచ్చి, చేతులు జోడించుకుని) ఏలినవారికి మరొక సంతోషవార్త. త్రిలోచనరాయలవారు వేంచేశారు.

నాగమ్మ—(ఉలిక్కిపడి) ఎక్కడికి!

వియ్యన్న—(అంజలిబంధం ఆకాశానికి చూపిస్తాడు)

(ఆ, అంటూ నీలమ్మా "ఏమన్నారూ?" అంటూ నాగమ్మా ఆశ్చర్యచకిత లవుతారు. లక్ష్మమ్మ మంద హాసంతో గంభీరంగా చూస్తుంది)

నాగమ్మ—వివరాలు సెలవిప్పించండి పంతులుగారూ!

వియ్యన్న—ఏటివొడ్డున నేనూ కొండారెడ్డిగారూ మాట్లాడుకుంటున్నాము. కుమారశ్యామరాయలవారు చాలా దూరం ప్రోద్బలపరిచా రని చెబుతూ రెడ్డిగారు అప్పుడే ఏలినవారిసేవకు అంగీకరించారు. ఈసమయాన త్రిలోచనరాయలవా రక్కడికి వచ్చి—

నాగమ్మ—అతగాడు మీమాటలు వినలేదు గదా?

లక్ష్మమ్మ—విన్నాడే అనుకోండీ! ఇంకేమి భయమూ?

నాగమ్మ—సరే సరే, ఏమి జరిగింది నాయనా?

వియ్యన్న—రావడం తడవుగా నన్ను చూసి "నువ్వు కుట్రచేస్తున్నావుట, మహామ్మాయి వండించేస్తా"నన్నాడు. నాకు వొళ్ళు తెలియలేదు. వొక్కటే వేటు, కొబ్బరి పుచ్చెలాగ వాడి తలకాయ దుల్లిపోయింది.

నాగమ్మ—(చేతులు జోడించుకుని) భలే పని చేశారు. నాయనా, నేను మాత్రం మీరుణం తీర్చుకోలేను.

వియ్యన్న—రుణమేమిటి మహారాణీ? మాతమ్ముడు తన విధి నిర్వర్తించుకున్నాడు.

నాగమ్మ—దుష్టచతుష్టయంలో యిక వొక్క సాంబ శివరాయ డున్నాడు. (వియ్యన్నతో) అంతేనా?

వియ్యన్న—చిత్తం, చిత్తం, వారొక్కరే వున్నారు. తనకు త్రిలోచనరాయులవారితో వుండుకున్న అంతః కలహంవల్ల కొంచెం తప్పించుకుని తిరుగుతున్నారు; గాని యిక దీక్షపడతారు వారు.

నాగమ్మ—వాళ్ళిద్దరికంటే ఘటకుడు. వొకపట్టాన లొంగడు. ఏమంటారు?

వియ్యన్న—విడిచిపెట్టను, ఇంతే నేనుమనవిచేసుకునేది.

లక్ష్మమ్మ—మహాదేవరాయులవారు కూడా మన

పత్నంఅయినట్టు వారి మూడో భార్య వర్తమానించారు. వీరప్పనాయకుడు (వియ్యన్న కేసి చూసి) ఏమన్నాడు తమ్ముడూ?

వియ్యన్న—రుక్కమ్మగారి నగరు దోపిడీచెయ్యాలని వుంటే తలుపులు తెరిపించి వుంచుతానూ మహారాణీ అతను.

నాగమ్మ—అతని కాభరవసా—

లక్ష్మమ్మ—అక్కడి మహామంత్రి, అతణ్ణి అక్కడ కావలావేశారు. తనగుర్రపుపౌజుతో అతనక్కడవున్నాడు.

నీలమ్మ—అయితే, (గభీ మని లేచి) ఆవురుగుని నలి వేసి వస్తాను.

నాగమ్మ—తల్లీ, (అంటూ నీలమ్మనికూచో బెడుతుంది)

లక్ష్మమ్మ—తిప్పమ్మగారు మనమణ్ణి తమ నగరిలో వుంచుకున్నారు.

నీలమ్మ—రాకాసిపీనుగా!

లక్ష్మమ్మ—తక్కిన సంగతులు మనవి చేస్తాను. అచ్యుత దేవరాయల వారికి రాజ్యాశ పట్టుకుంది. గంగుని పొడిచినవాడికోసం వీరమల్లయ్య వెతుకుతున్నాడు.

నాగమ్మ—వెతకనివ్వండి, మన కేం? లక్ష్మమ్మగారూ! నీలమ్మ ఆవేళఅచ్చంగా మొగపిల్లవాడయిపోయిందినుమండీ!

లక్ష్మమ్మ—తమరు విన్నారో లేవోగాని ఆపిల్లవాని తర్జని యెగిరిపోయింది టమ్మా!

సెలమ్మ—(ఎగిసిపడి) ఏమిటీ? సెబాస్! బతికివుండినా వాడిక జీవచ్ఛవమే.

నాగమ్మ—ఇంకేమిటి లక్ష్మమ్మగారూ!

లక్ష్మమ్మ—మధ్యాహ్నం మళ్ళీ కొన్ని వార్తలందుతాయి, యిప్పటికి సెలవిప్పించండి.

నాగమ్మ—మంచిదమ్మా! పంతులుగారూ, మనకి రాజ్యం కావాలి, సందేహం లేదు. ఒకవేళ వీలుతప్పితే నాపతికి సర్వనాశనం అయినా కావాలి. ఇంతవరకూ వచ్చాం కనక అదయినా జరిగితే గాని నా కసి తీరదు.

లక్ష్మమ్మ—రెండూ జరుగుతాయి మహారాణీ, తమ రనుమానాలు పెట్టుకోకండి. ఏమి తమ్ముడూ?

వియ్యన్న—మహారాణీ! తిప్పమ్మాదేవిగారిని అరదండాలతో ఏలినవారి పాదాలదగ్గిర పడేస్తాను? సరా?

నాగమ్మ—అంతే అంతే, చాలు పంతులుగారూ!

వియ్యన్న—మరి సెలవిప్పించండి.

లక్ష్మమ్మ—సెలవు.

నాగమ్మ—వెళ్ళిరండి.

---

## తొమ్మిదో రంగం

(తిప్పమ్మ నగరు. తిప్పమ్మ కూచుని వుంటుంది. ఎదటా వొక పరిచారిక నిలిచి వుంటుంది)

తిప్పమ్మ—తిమ్మరుసయ్యగారు నీకేనే చూడలేదూ?

పరిచారిక—లేదమ్మా, పోనీ అంటే, నేనూ వారికేసి చూడలేక పోయాను.

తిప్పమ్మ—ఎంచేతా?

పరిచారిక—వారు ప్రళయకాలరుద్రులయి వున్నారు. జగ్గారాయుడు బాబయ్యంతవారు గడగడ లాడి పోతు న్నారు, వారిని చూసి.

తిప్పమ్మ—అదేమిటా?

పరిచారిక—తుంగభద్రలో వొక యోగి కృష్ణ దేవరాయలవారిని స్నానం చేయిస్తున్నట్టు—

తిప్పమ్మ—ఆ, తెలిసిందటనా? యోగులు కళ్లు రప్పించగలరు, మళ్లీ మొదటికి వస్తుందో యేమిటో?

పరిచారిక—వారిని పట్టి బంధించి అడవిలో జాగ్రత్త పెట్టి వుంచమని తిమ్మరుసయ్యవారు గుర్రపుపౌజుతో జగ్గారాయలవారిని తరిమిపంపారు. "మీరు తప్పించుకొని తిరగడం బాగా లేదని సాంబశివరాయలవారిని బాగా మందలిస్తున్నారు కూడా.

తిప్పమ్మ—అతగాడి కిప్పటి కింకా కళ్లు రాలేదన్న మాటేనా?

పరిచారిక—లేదుట అమ్మగారూ! కళ్లమాట యేమ యినా, పీలుతప్పితే, ఇద్దర్నీ నరికివెయ్యమని జగ్గారాయుల వారికి మహామంత్రి అజ్ఞ. ఇదివరకటిమాట యేమయినా,

కృష్ణరాయలవారి కీక చావు తప్ప దమ్మా!

తిప్పమ్మ—దొరికితే కదా?

పరిచారిక—ఒకవేళ, జగ్గారాయడుగారు ద్రోహం చేస్తారేమో అని శంకించి, మహామంత్రి, వారి ననుస రించివుండ మనీ, తప్పివస్తే వారిని బంధించవలసిం దనీ సాంబశివరాయలవారిని వెనకవెనక నే పంపించారు.

తిప్పమ్మ—జగ్గారాయుడు ద్రోహం చేస్తాడూ?

పరిచారిక—ఎప్పటి కేమిటో యెవరు చెప్ప గలరమ్మా! వారు కృష్ణరాయలవారికి ఒకటిరెండు యుద్ధాలలో కుడి భుజంగా వుండినవారుట. అయినా, ఏలినవారికి వారి మీద ఎక్కువ నమ్మకమూ ఆశా వుండడంవల్ల—

తిప్పమ్మ—నిజమే. అయితే?

పరిచారిక—విరూపాక్షరాయలవారినీ, త్రిలోచన రాయలవారినీ తమ రలాగే నమ్మారు. ఇప్పుడు వారిద్దరి జాడా కూడా లేదు.

తిప్పమ్మ—వార్త లేమయినా తెలిసినట్టా?

పరిచారిక—వారి వార్తే లేదు; కాని విరూపాక్ష రాయలవారి మండలంలో సైనికసన్నాహాలు జరుగు తున్నట్టూ, త్రిలోచనరాయలవారి దండు వరకంలో వున్నట్టూ—

తిప్పమ్మ—(స్తబ్ధ అయి) ఆ!

పరిచారిక—గంగు పరాకుమాట లాడుతోందమ్మా!

తిప్పమ్మ—దానికర్మం. కల్లోలాలు చెలరేగేలా గున్నాయి, తిమ్మరుసయ్య వారిని నుంచున్న పాళంగా తీసుకురా.

(వెళ్ళు వెళ్ళు అంటూ తిప్పమ్మ పరిచారికను వెంబడిస్తుంది)

---

## పదో రంగం

(తుంగభద్ర వొడ్డున అచ్యుతదేవరాయ డొక రాతిపలక మీద కూచుని వుంటాడు. ఎదట వియ్యన్న నుంచుని వుంటాడు)

అచ్యుతదేవరాయడు—ఆలోచించలేదేమో కాని తమకు మాత్రం తోచనిదా యిది?

వియ్యన్న—అనుమానం పుడితే గదా, ఆలోచన?

అచ్యుతదేవరాయడు—తిమ్మరుసయ్యవారు పెద్దన్న య్యగారి దగ్గిర యెప్పుడూ భయభక్తులతోనే మసిలే వారు; కాని చిన్నన్నయ్య గారినీ నన్నూ శిష్యులుగా ప్రేమించేవారు.

వియ్యన్న—భేదం యేమయినా—

అచ్యుతదేవరాయడు—మా యిద్దరిలోనూ చిన్న న్నయ్యగారియెడల వారికెక్కువ మక్కువ అనుకోండి—

వియ్యన్న—వారిప్పుడు లేరుగా?

అచ్యుతదేవరాయుడు—అదే నే ననేది. పెద్దన్నయ్యగారు లేరుగదా, చిన్నన్నయ్యగారున్నూ లేకుండా నే పోయారుగదా, మరి తిమ్మరుసయ్యవారు నన్నివ్వా డెలా చూడా లంటారూ మీరూ ?

వియ్యన్న—సరే, మనవిచేసుకుంటూ, సెలవిప్పించండి.

అచ్యుతదేవరాయుడు—వారు బుల్లిబాబుకే పట్టాభిషేకం జరిగించ బూనుకున్నా, రిది మీకు తెలియనిదా?

వియ్యన్న—అందుకు కారణం తమకు తెలిసివుండాలి.

అచ్యుతదేవరాయుడు—తెలుసు, మహారాజు కొడుకనీ. మానాయనగారికి ముగ్గురుభార్య లున్నప్పుడు, వారి రాజ్యం, ముగ్గురు భార్యల బిడ్డలకూ క్రమాంతరాల మీాద సంక్రమించవద్దూ? ఇదీ నేను మనవిచేసేది.

వియ్యన్న—ఇది బహిరంగ మైన ధర్మం, తమరు సెలవిప్పించడం యెందుకూప్రభూ? మరి, మహామంత్రుల వారు ఈ ధర్మసూక్ష్మం తెలియనివా రనుకోనా ?

అచ్యుతదేవరాయుడు—అమ్మమ్మా, అంత మాట అనడం యెలాగా ?

వియ్యన్న—ఇంకేమిటి ప్రభూ ?

అచ్యుతదేవరాయుడు — వారు పెద్దదొడ్డమ్మగారి తంత్రంలో పడ్డారని నే ననేది.

వియ్యన్న—తమరున్నూ తిప్పమాంబదేవిగారి అను

గ్రహం సంపాదించుకుని వుండరాదా?

అచ్యుతదేవరాయుడు—అనుగ్రహమా? ఎంత తప్పు దారిని వున్నారు పంతులుగారూ మీరూ? వారు నన్ను మాత్రం కడతేర్చకుండా వుంటారని యెలాగా నమ్మడం?

వియ్యన్న—(చెవులు మూసుకుని) పాపం శాంతిం చాలి, పాపం శాంతించాలి. ప్రభూ, నేను మనసిచ్చి అడుగుతున్నాను. అంతఃపురాలలో జరుగుతున్న దంతా తమకి తెలిసివుంటుంది. కృష్ణదేవరాయలవారి కళ్లు పీకిం చడంలో తిప్పమ్మాదేవిగారి ప్రమేయం లేశమూ లేదని నానమ్మకం. తమ రేమి సెలవిప్పిస్తారూ?

అచ్యుతదేవరాయుడు—అసలు, ఈ సంకల్పం పెద్ద దొడ్డమ్మగారికే కలిగింది. వారే పెద్దన్నగారికి దుర్బోధ చేశారు.

వియ్యన్న—కొత్తసంగతి నాకిది.

అచ్యుతదేవరాయుడు—అదలా వుంచండి. విజయ నగర సామ్రాజ్యం మా నాయనగారి స్వార్జితం. వారి కుమారుడను నే నుండగా, నా ముందుతరంవాడికా పట్టాభిషేకం?.............ధర్మశాస్త్రం మాట అలా వుంచండి. చూస్తూ వూరుకుంటే నేను బతికివున్నట్టే లెక్క అవుతుందా?

వియ్యన్న—పట్టాభిషేకం వి[illegible]

దేవిగారు, సామ్రాజ్యభారం అంతా తమ మీాదే వుంచుతారేమో, యోచించారా తమరు?

అచ్యుతదేవరాయడు—మీారలాంటిమాటలు చెప్పకండి. పెద్దదొడ్డమ్మగారికే రాజ్యాశ వున్నది. కోడలి పక్షం వారినికూడా చేరనివ్వరు వారు. కుర్రకుంకని అడ్డుపెట్టుకుని ఏకచ్ఛత్రాధిపత్యం నిర్వహించాలని వారి సంకల్పమూ, ప్రయత్నమూను. తిమ్మరుసయ్యవారు ఆకుట్రలో పడ్డారు, ఇదీ నాబాధ.

వియ్యన్న—పెద్దబావగారు, సంగతి తెలిసే పడ్డారంటారా?

అచ్యుతదేవరాయడు—వారికి దుస్సంకల్పం ఆరోపించలేను నేను. మరి నాతవన యేమిటంటే? దద్దమ్మనయి నేను కళ్ళప్పగించి వూరుకోవలసిందేనా?

వియ్యన్న—కనక?

అచ్యుతదేవరాయడు—ఇక మన సిచ్చి మాట్టాడతాను. మీారు నాకో ఉపకారం చేసిపెట్టాలి.

వియ్యన్న—ఏమిటి ప్రభూ అది?

అచ్యుతదేవరాయడు—సైన్యం అంతా యిప్పుడు అప్పన్నగారిచేతిలో వుంది. వారి యెదట పడి నాకోరిక విన్నవించుకోడానికి నేను సాహసించలేకుండా వున్నాను. మీాకూ వారికీ దేహాలు మాత్రమే వేరు. మీారు వారికి

నామీాద అనుగ్రహం కలిగేటట్టు రాయబారం నడిపించాలి (వియ్యన్న చేతులు పట్టుకుని) మీాసెలవు ప్రకారం నడుచుకుంటాను. సింహాసనం నాకు స్వాధీనం చేయించండి. తరవాత అంతా మీాయిష్టం.

వియ్యన్న—తమకు నాయెడల ఇంత విశ్వాసం కలిగినందుకు చకితుణ్ణవుతున్నాను నేను. ముందు, తమరు బావగారితో మంతనాలు జరిగించి చూశారా?

అచ్యుతదేవరాయుడు—లాభం లేదు పంతులుగారూ!

వియ్యన్న—అప్పన్నగారి ఆంతర్యం—

అచ్యుతదేవరాయుడు—నాకు తెలుసు. నాయెడల వారికి వైముఖ్యం లేదు.

వియ్యన్న—నగరాధిపతులు చిన్నబావగారు కదా, వారితో మంతనాలు అగత్యం లేదూ?

అచ్యుతదేవరాయుడు— లేకేమిా? నేను నూటిగానే వారితో వ్యవహారించుకోగలను.

వియ్యన్న—వ్యవహారించడం అయినట్టేనా?

అచ్యుతదేవరాయుడు—ముందు అప్పన్నగారి విషయం తేల్చుకోడం ముఖ్యం అని నా వూహ.

వియ్యన్న—అయితే, యిది నాకప్పగించండి. అది తమరు చూసుకోండి.

అచ్యుతదేవరాయుడు—సంతోషం. తిమ్మరుసయ్య

వారిఅనుగ్రహమున్నూ నాకు లభించినట్టే, సందేహంలేదు.

వియ్యన్న—మనవి చేసుకున్నాను గాదూ? అశ్రద్ధ మంచిది కాదు. రేపు లేదు, ఎల్లుండి పట్టాభిషేకం. సన్నాహం అంతా యీలోపున పూర్తిచేసుకోండి.

అచ్యుతదేవరాయడు—చాలా సంతోషం.

వియ్యన్న—ఒక్కటిమాత్రం వుంది. ఇది వీకలమీాదికి వచ్చే వ్యవహారం. కనక, తమకు గల ఆధారాలేమిటో—

అచ్యుతదేవరాయడు—తప్పకుండా మనవి చేసుకుంటాను. జగ్గారాయడు నాకు కుడిభుజంగా వున్నాడు. అసలు, నా కీదృష్టి కలిగించినవాడే అతను. అతని పరంగా మరికొందరు మండలేశ్వరులున్నూ నాకోసం ప్రాణాలు ధారపొయ్యడానికి సిద్ధంగా వున్నారు.

వియ్యన్న—తమకు మంచి బలమైన ఆసరా దొరికింది. ఒక్కపెద్దబావగారిని తప్పిస్తే జగ్గారాయలవారిని పోలగలవారు మరి లేరు.

అచ్యుతదేవరాయడు—తమ ఆసరా అంతకంటే గొప్పది గదా?

వియ్యన్న—ఇది నెరవేరినప్పుడు గదా, ఆప్రశంస నాకు? మరి తమరు దయచెయ్యండి. మనం చాలాసేపు ఏకాంతంగా వుండడం శ్రేయస్కరం కాదు.

అచ్యుతదేవరాయడు—అవునవును, మరివర్తమానం—

వియ్యన్న—నేనందచేస్తా కాదూ? ఎప్పుడూ అని మాత్రం నన్నడక్కండి. భారం నామీద వుంచారు. సరి, యిక నన్ను మరిచిపోండి.

అచ్యుతదేవరాయడు—చిత్తం, సెలవు.

(అచ్యుతదేవరాయడు వెళ్ళిపోతాడు)

వియ్యన్న—అనుమానం నిశ్చయమే అయింది. "యాచకో యాచక శ్శత్రుః" నాగమ్మాదేవిగారి కిది మంచి సహాకారి. తిమ్మరాజు పని పైసలా. అది తప్పదు.

(వెళ్ళిపోతాడు)

---

## పదకొండో రంగం

(తిమ్మరుసయ్య భవంతి. అచ్యుతదేవరాయడు కుర్చీ మీదకూచునీ, తిమ్మరుసయ్య యెదటనుంచునీవుంటారు)

అచ్యుతదేవరాయడు—అనేకవిధాల ప్రార్థించాను. తమ దగ్గిరికి వెళ్లమనడం తప్పిస్తే పెద్దదొడ్డమ్మగారు మరోమాట సెలవిప్పించలేదు.

తిమ్మరుసయ్య—తమరు వారి దర్శనానికి యెందుకు వేంచేశారు ప్రభూ?

అచ్యుతదేవరాయడు — దినమ్మా వారకమాటు దర్శనం చేసుకుంటున్నాను. అలాగే యివాళా వెళ్ళాను?

తిమ్మరుసయ్య—వెళ్ళి?

అచ్యుత దేవరాయడు—వెళ్ళాను. పాదసేవ చేసుకుని చేతులు కట్టుకుని నిలవబడ్డాను. వారిముఖం ప్రసన్నంగా లేదు. కారణం వూహించలేక గజిబిజి పడుతున్నాను. "వెళ్లి తిమ్మరుసయ్యవారికి కనపడు" అని వాక్యమాతే సెలవిచ్చారు వారు, ఆజ్ఞాస్వరంతో.

తిమ్మరుసయ్య—కనపడి?

అచ్యుత దేవరాయడు—అడిగాను. ప్రత్యుత్తరం లేదు.

తిమ్మరుసయ్య—మరి, యిప్పుడు తమ సెల వేమిటి?

అచ్యుత దేవరాయడు—అదెందుకో తెలిస్తే గదా, సెలవివ్వడం అయినా, ఆలకించడం అయినా?

తిమ్మరుసయ్య—వింతగా వుంది.

అచ్యుత దేవరాయడు—వా రేమి సెల విచ్చారో—

తిమ్మరుసయ్య—ఏసందర్భములోనూ కూడా యివాళ తమప్రస్తావన రాలేదు.

అచ్యుత దేవరాయడు—వర్తమానం అయినా —

తిమ్మరుసయ్య—రా కేం? భోజనం కావడం తరవాయిగా దర్శనానికి రావలసిం దని మాత్రమే వచ్చింది.

అచ్యుత దేవరాయడు—ఆశ్చర్యకరంగా వుంది.

తిమ్మరుసయ్య—ఏదో వుంది. ప్రభూ, సర్వమూ తమ యిద్దరిలోనూ వుంది.

అచ్యుత దేవరాయడు—నాదగ్గి రేమీలేదు. నమ్మండి

పంతులుగారూ! కఠినమైన వారి ఆజ్ఞ వినడంతోటే నా మనస్సు ఎలాగో అయిపోయింది. మరి వూహా అందనేలేదు.

తిమ్మరుసయ్య—చిత్రం!

అచ్యుతదేవరాయడు—తమకున్నూ దుర్భేద్యమైన విషయం వుంటుం దంటే నేను నమ్మవలసిందేనా?

తిమ్మరుసయ్య—లేదు ప్రభూ! తిప్పమ్మాదేవిగారి దగ్గిర మసలడం కత్తులమీద సాముగా వుంది. ఏక్షణాని కాక్షణం నా తల ప్రాణం తోకకు వస్తోంది. ఎప్పు డెలాంటి అపాండం మీదపడి పోతుందో అని కుత కుత లాడిపోతున్నాను.

అచ్యుతదేవరాయడు—తమరే అలా అయితే, యిక మావని యెలా వుండనూ?

తిమ్మరుసయ్య—తమకేమి ప్రభూ, నరసరాయుల వారి కుమాళ్లు, తమర్ని, ఎవరేమి చెయ్యగలరూ?

అచ్యుతదేవరాయడు—ఇదిగో, ఈస్థితిలో వున్నాడు నరసరాయులవారి కుమారుడు.

తిమ్మరుసయ్య—మరి నరసరాయులవారి యీ భృత్యుని గతి?

అచ్యుతదేవరాయడు—తమ రలా అనవద్దు.

తిమ్మరుసయ్య—తిప్పమ్మాదేవిగారు తమర్ని నా దగ్గిరికి వెళ్ళమనడం చూస్తే, నావిషయ మయ్యే వా రేదో

ఆలోచిస్తున్నట్టు కనపడుతోంది. ఏమీ పాలుపోడంలేదు

అచ్యుత దేవరాయుడు—మరి నాకేమి సెలవు?

తిమ్మరుసయ్య—మళ్ళీ వారి దగ్గిరికే దయచెయ్యండి.

అచ్యుత దేవరాయుడు—దయచేసి?

తిమ్మరుసయ్య—నాదగ్గిరికి వచ్చిన సంగతి మనవి చెయ్యండి.

అచ్యుత దేవరాయుడు—తమ దృష్టి మరోచోట వున్నట్టు కనపడుతోంది పంతులుగారూ!

తిమ్మరుసయ్య—తమరు సరిగా సెలవిప్పించారు ప్రభూ! స్థితిగతు లేమీ బాగా లేవు. ఎటు చూసినా దుర్వార్తలే. ఎప్పటి కేమిటో వూహకునూ్న అందడం లేదు. అంతా అంధకారబంధురంగా మాత్రమే కాదు, భయంకరంగా కూడా వుంది.

అచ్యుత దేవరాయుడు—దుర్వార్త లంటే?

తిమ్మరుసయ్య—విరూపాక్షరాయలవారూ, త్రిలోచనరాయలవారూ అయివు లేరు. తిప్పమ్మాదేవిగారు చాలా ఆందోళపడుతున్నారు.

అచ్యుత దేవరాయుడు—నిజమే, విరూపాక్షరాయల వారికోసం నేనూ అటమటించిపోతున్నాను.

తిమ్మరుసయ్య—(కనుబొమ్మ లెగరవేసుకుంటూ అలాగా? ఇంకేమిటి? (జేబులోనుంచి ఉత్తరం తీసి) ఇది

చిత్తగించండి. (ఇస్తాడు)

అచ్యుతదేవరాయుడు—(పుచ్చుకుని, చదువుకుని) శ్రీహరీ! శ్రీహరీ! ఎంత ఘోరమైన కల్పన! ఇదివరలో వారూ నేనూ తరుచు కలుసుకుంటూ వుండడం నిజమే. అయితే, యిదేమిటీ యీరాగాణం?

తిమ్మరుసయ్య—వేగు అలా వుంది ప్రభూ!

అచ్యుతదేవరాయుడు—నిజంగా, వారివల్ల నాకు కొంత ప్రయోజనం సిద్ధిస్తుం దని ఎదురు చూస్తున్నాను. ఇలాంటి స్థితిలో నేనే వారిని చంపించానంటే—

తిమ్మరుసయ్య—ఈ జాబింకా తిప్పమ్మాదేవిగారికి అందలేదు. ఇది వారికి తెలియనే తెలియదు.

అచ్యుతదేవరాయుడు—అంటే, వారు నన్నిక్కడికి పంపించిన కారణం మరొకటి అన్నమాట.

తిమ్మరుసయ్య—అలాగే అనుకోవాలి మరి.

అచ్యుతదేవరాయుడు—అదెలాంటిదో?

తిమ్మరుసయ్య—త్రిలోచనరాయులవారిని గురించిన్నీ వేగు ఇలాగే వుంది మరి.

అచ్యుతదేవరాయుడు—ఏమిటీ? వారుకూడా కడ తేరినట్టే వార్తలు వచ్చాయా?

తిమ్మరుసయ్య — కడ తేరడం అక్షరాలా జరిగి పోయింది. ఒక్కవేటుతో వారు రెండు ఖండా లయి

పోయారు. ఆఖండాలు తుంగభద్రలో మొసళ్ళకు వేసి, వారితలకాయ ఈటెకు గుచ్చి—

అచ్యుత దేవరాయుడు— (స్తబ్ధుడై) ఆ, అంతదారుణమా? అంత అరాజకంగా వుందా స్థితి?

తిమ్మరుసయ్య—తమకి తెలియని దేముంది ప్రభూ?

అచ్యుత దేవరాయుడు—ఇదిన్నీ నాకు వొక్క అక్షరం తెలియదు. అయితే, యీసందర్భం కూడా నామీదికే—

తిమ్మరుసయ్య—వివరాలింకా అందలేదు ప్రభూ!

అచ్యుత దేవరాయుడు—పోనీ, బుల్లిబాబుని పొడిచినవాడెవడో—

తిమ్మరుసయ్య—అంతా తమకు తెలును, నన్నెందు కడుగుతారూ?

అచ్యుత దేవరాయుడు—తమ నమ్మకం యేమిటి?

తిమ్మరుసయ్య—నానమ్మకాని కేమి వుంది? నేను తమ తండ్రిగారి దయవల్ల వొక యింటివాణ్ణయినాను. నలుగురిలోనూ తలతిప్పుకుంటున్నాను; కాని తమ కుటుంబంలో కల్లోలాలు పుట్టకుండా చూడలేకపోయాను. వాటిని సద్దుబాటూ చెయ్యలేకుండా వున్నాను.

అచ్యుత దేవరాయుడు—పెద్దదొడ్డమ్మగారు మా వంశానికి బ్రహ్మరక్షస్సు అయి—

తిమ్మరుసయ్య—వద్దు, తమ రలా సెలవిప్పిస్తే చిక్కు

ఉన్నాయి మరి.

అచ్యుత దేవరాయడు—ఉన్నవే చిక్కులు. వాటికి కారణం ఆవిడ. అదీ నేను మనవిచేసుకునేది.

తిమ్మరుసయ్య—చిత్రం చిత్రం, తమ తల్లి ఓబమ్మా దేవిగారికీ తిప్పమ్మాదేవిగారికీ వొకటే ప్రాణం కదా?

అచ్యుత దేవరాయడు—(నిర్విణ్ణుడై వూరుకుంటాడు)

తిమ్మరుసయ్య—(గంభీరంగా చూస్తూ వుంటాడు)

అచ్యుత దేవరాయడు—పంతులుగారూ! నాకు తెలిసినవి కొద్ది, తెలియనివే అధికం. ఏమయినా, కల్లోలం ప్రారంభం అయింది. అది వశమూ తప్పింది. ఇక దాపరికం యెందుకూ? నాకు రాజ్యాశ పుట్టింది. స్వయంభువు కాదనుకోండి, పుట్టింది. ఇంతవరకూ నాప్రయత్నాలిలాంటి విషఫలితా లిచ్చేవిగా లేవు. నిజం మనవి చేసుకుంటున్నాను నేను. నాస్థితి యింకా ఆలోచనల లోనే వుంది. ఇది కనిపెట్టి యెవరో ఆపదంతులు నా మీదికి తెప్పారు. ఇవాళో రేపో నిజం మీకే తెలుస్తుంది.

తిమ్మరుసయ్య—వొప్పుకుంటాను. అయితే, ఆనిజం నాకు తెలిసేటంతవరకూ కల్లోలాలకి సంబంధించినవారు మరి అడుగు ముందుకు వెయ్యరనా తమ నమ్మకం?

అచ్యుత దేవరాయడు—వేస్తారు. వెయ్యనే వేశారు. తనకనే తమ యెదట నే నిప్పుడున్నదున్నట్టు మనవి

చేసుకుంటున్నాను.

తిమ్మరుసయ్య—సెలవిప్పించండి.

అచ్యుతదేవరాయడు—సామ్రాజ్యం మాతండ్రిగారి స్వార్జితం. పెద్దన్నయ్యగారు గతించడంవల్లా, చిన్నన్నయ్యగారు లేరు కనకా, మానాయనగారి సొత్తు నాకా నాతర వాతి తరంవాడికా సంక్రమించవలసింది?

తిమ్మరుసయ్య—సింహాసనాధికారం విషయమై శాస్త్రాతిక్రమణం కూడా జరుగుతూనే వుంటుంది, కాదనను; కాని వొక్క సంగతి సెలవిప్పించండి.

అచ్యుతదేవరాయడు—అడిగించండి.

తిమ్మరుసయ్య—విరూపాక్ష రాయలవారితో తమరు తరుచు కలుసుకొంటూ వుండినట్టు సెలవిప్పించారే, యీ విషయం వారికో—

అచ్యుతదేవరాయడు—ఎప్పుడూ చెప్పలేదు; కాని వారి ముఖతః పెద్దదొడ్డమ్మగారి ఉద్దేశాలు తెలుసుకోడానికి మాత్రం ప్రయత్నించాను.

తిమ్మరుసయ్య—చిత్తం, అయితే, విరూపాక్ష రాయలవారికి బుల్లిబాబుగారా సన్నిహితులు, తమరా?

అచ్యుతదేవరాయడు—(నసుకుతూ) సెలవిప్పించండి.

తిమ్మరుసయ్య—బుల్లిబాబు చక్రవర్తి అయితేనా లాభం వారికి, తమరు చక్రవర్తి అయితేనా?

అచ్యుతదేవరాయడు—నేను చక్రవర్తి నయితేనే లాభం అనుకుంటూ వచ్చాను.

తిమ్మరుసయ్య—ఇప్పటికిన్నీ అలాగే—

అచ్యుతదేవరాయడు—లేదు, అంచేతనే నావిషయం తమతో మనవిచేసుకుందామని వచ్చాను.

తిమ్మరుసయ్య—తమరు వారిని వదులుకున్నారు. తరవాత వారు కనబడకుండా పోయారు. హత్య జరిగిన ట్టేమో రూఢి.

అచ్యుతరాయడు—చిత్తం,నాతప్పు ఇప్పుడు తెలిసింది.

తిమ్మరుసయ్య—కనక, యేమి సెలవు?

అచ్యుతదేవరాయడు—తమరు నన్ను కటాక్షించాలి. (ఇలా అంటూ లేచి, దోసిలి వొగ్గుతాడు)

తిమ్మరుసయ్య—(వద్దన్నట్టు చెయ్యివూపుతూ) దయ చెయ్యండి, ఎందుకు లేస్తారూ? నేను నరసరాయలవారిని మరిచి పోలేదు. నరసరాయలవారు నన్ను ఆత్మవతుగా భావించుకున్నారు. తమరుమాత్రం, మంత్రిఅంటే నాలుగు డబ్బులకోసం కక్కూర్తిపడే జీతగాడు అని భావించారు.

అచ్యుతదేవరాయడు—నే నలా భావించలే దంటే తమరు నమ్మడానికి వీలులేని సందర్భాలు తటస్థించాయి, కాదనను; కాని—

తిమ్మరుసయ్య—నావిషయం విడిచిపెట్టండి. రాజ

సేవకు ఫలితా లెప్పుడూ యిలాగే వుంటాయి. అది తెలియక నే నిందులో ప్రవేశించలేదు. దక్కే కావా లంటే నేను కరణీకం సంపాదించుకుని వుందును. గుమాస్తాగా అయినా చేరి వుందును—

అచ్యుతదేవరాయడు—(వినయంగా) విన లేకుండా వున్నాను పంతులుగారూ?

తిమ్మరుసయ్య—తమ మనస్సు నొప్పించానా?

అచ్యుతదేవరాయడు—వద్దు, వద్దు, నా కేమిటీ సెలవు?

తిమ్మరుసయ్య—మనస్ఫూర్తిగా మనవి చేసుకోనా?

అచ్యుతదేవరాయడు—తప్పకుండానూ. నాకప్రియం అవుతుం దేమో అని సందేహించవద్దు.

తిమ్మరుసయ్య—అయితే, తమరింటికి దయచెయ్యండి.

అచ్యుతదేవరాయడు—వెడతాను.

తిమ్మరుసయ్య—ఎల్లుండి పట్టాభిషేకం. ఇవాళా రేపూ తమరు తిప్పమ్మాదేవిగారి నగరికి వేంచెయ్యవద్దు.

అచ్యుతదేవరాయడు—చిత్తం, వెళ్ళను.

తిమ్మరుసయ్య—పట్టాభిషేక సమయాన, ఎల్లుండి, సభకి రావడమూ మానవద్దు.

అచ్యుతదేవరాయడు—చిత్తం, వస్తాను.

తిమ్మరుసయ్య—ఇక దయచెయ్యండి.

(అచ్యుతదేవరాయడు చేతులుదోయిలించుకుని, తిమ్మరు సయ్యాకేసి మిడుతూమిడుతూ చూస్తూ వెనక వెనకగా వెళ్ళిపోతాడు)

తిమ్మరుసయ్య—పండితపుత్రులూ, రాజపుత్రులూ సాధారణంగా వొకలే కోవ.

(వెళ్లిపోతాడు)

## పన్నెండో రంగం

•••ooOoo•••

(నాగమ్మ నగరు. నాగమ్మా అత్కుమ్మా కూచునీ వియ్యన్న నుంచునీ వుంటారు)

వియ్యన్న—మహాదేవరాయలవారూ, బేతాళరెడ్డి గారూ, కోదండపాణినాయనింగారూ, అక్కినీడుగారూ, వీరభద్రారెడ్డిగారూ వలినవారికోసం ప్రాణాలు విడిచి పెడతా మని భూమిముట్టుకుని శపథం చేశారు. ఇవాళ కోట అంతటా వారి పౌజులే కావలా.

నాగమ్మ—అయితే, మనకేమీ అడ్డులేదన్నమాట.

వియ్యన్న — నూరప్పనాయనింగారూ, చంద్రప్ప నాయనింగారూ, వీరారెడ్డిగారూ, రామారాయణింగారూ తటస్థులు. సింహాసనం మొవ రెక్కగలిగితే వారిని సేవించడమే వారిపని. శరభయ్యనాయనింగారూ, వేమారెడ్డి గారూ, రుద్రప్పనాయనింగారూ, భీమారెడ్డిగారూ, శంక

రప్పనాయనయ్యవారూ, గౌరీపతిరాయలవారూ తటస్థులుగా వుంటూ, కలపటం తప్పకపోతే, చివరికి మొగ్గు ఎటుంటే వారటు.

లక్ష్మమ్మ—ఇందున్న విశేషం చిత్తగించారా? అసలు, అక్కడి మహామంత్రే యిదంతా నా కెందుకని తప్పించుకుని తిరుగుతున్నట్టు కనపడుతుంది. లేకపోతే, యీ తటస్థులంతా తిప్పమ్మగారి పక్షంగా వుండవలసినవారే కాదూ?

నాగమ్మ—అవునమ్మా, అవును, నాకొడుకుమీద మాత్రమే వారికి దయలేకపోయింది.

వియ్యన్న—తిప్పమ్మగారి పక్షంగా వొక్క సాంబశివ రాయలవారు మాత్రమే బాహాటంగా కనబడుతున్నారు. వీరప్పనాయనింగారు వారికి మద్దత్తు. ప్రతాప రాయలవారొక్కరే అచ్యుతదేవరాయలవారి పట్టు. అచ్యుత దేవరాయలవారిది పైచెయ్యి అవుతుందన్న సూచనలు కనపడితే, చొక్కప్పనాయనింగారూ, నారాయణరెడ్డిగారూ, తిమ్మారెడ్డిగారూ, బుద్ధారెడ్డిగారూ, గోనారెడ్డిగారూ, పెంచలురెడ్డిగారూ, విజయరంగం నాయకులుగారూ, గోవిందరాయలవారూ వారి పక్షం అవుతారు. లేకపోతే, వారందరూ, చివరి కెవరు ప్రభువయితే వారిని కొలుచుకుంటారు.

లక్ష్మమ్మ—తమరు బాగా చిత్తగించాలి. అచ్యుత

దేవరాయలవారు ప్రభువు కాబోతున్నారంటేనే. లేక పోతే, వారందరూ తిప్పమ్మగారి పక్షం మాత్రం కారు.

నాగమ్మ—బోధపడింది.

వియ్యన్న—పైగా, సాంబశివరాయలవారికి, అచ్యుత దేవరాయలవారి మీంది స్పర్ధ యెక్కువగా వుంది. వారు వారిని నొక్కెయ్యడానికే ప్రయత్నిస్తున్నారు.

నాగమ్మ—అది చాలా మంచి సంగతి.

వియ్యన్న—చిన్న బావగారూ, అప్పన్నా సింహాసనం రెండు పక్కలా అంగరక్షకులై వుంటారు.

నాగమ్మ—ఏమంటారూ లక్ష్మమ్మగారూ?

లక్ష్మమ్మ—అది మనకే అనుకూలం.

వియ్యన్న—ఈసన్నాహం యిలాజరుగుతూవుండగా, కొండారెడ్డిగారూ, కుమార శ్యామరాయలవారూ కూడా అయివు లేరు.

నాగమ్మ—అయ్యో, యెలాగ లక్ష్మమ్మగారూ? నాయన అంటే కొండారెడ్డికి భగవంతుడే. కుమార శ్యామ రాయుడు నాకు తమ్మునికంటేయెక్కువ. వారేలేకపోతే—

లక్ష్మమ్మ—వారిసైన్యాలమాట యేమిటి తమ్ముడూ?

వియ్యన్న—వారి బలగాలు గుర్రా లెక్కడానికి సిద్ధంగా వున్నాయి. కొండారెడ్డిగారయినా, కుమార శ్యామరాయలవారైనా రాత్రి తెల్లవార్లూ నగరంలోనే

వున్నట్టు వార్త వచ్చింది. అరుణోదయం అయింది, అంతే. వారు మరి కనపడ్డం లేదు.

నాగమ్మ—ఏమయినట్టూ?

వియ్యన్న—ఇళ్ళల్లోనూ తెలియదు. ఎవరికీ తెలియదు; అయినా, యెవరికీ ఆందోళన లేదు. అందరూ ఉత్సాహంగా వున్నారు.

నాగమ్మ—ఇక మన కేమి దారి?

లక్ష్మమ్మ—వారిసంగతి తెలిస్తేగదా భయమయినా, ప్రియమయినా? అయిపే లేనప్పు డెవరికి యేమిలాభమూ?

(అప్పు డతిరభసగా నీలమ్మ వస్తుంది)

నీలమ్మ—అత్తయ్యా, తిమ్మరుసయ్యవారు బాబయ్యగారికి వర్తమానం చేశారు. నంచున్న పాళంగా రమ్మని పంచకల్యాణిని పంపించారు.

నాగమ్మ—అన్నయ్య వేంచేశారా?

నీలమ్మ—వెళ్ళారు.

లక్ష్మమ్మ—వెళ్ళనివ్వండి మహారాణీ! వెడితే మన కేమి భయమూ? పాపారాయడుగా రంటే వారి కెంతో విశ్వాసం, బెంగపెట్టుకోకండి.

నాగమ్మ—బెంగపెట్టుకోవద్దంటే, అదేమిటో, యిదేమిటో బోధపడితేనా? మీ రేమంటారు వియ్యన్నగారూ?

వియ్యన్న—బావగారు పాపారాయులవారిని పిలి

పించుకున్నా రంటే సత్యధర్మాలను ఆహ్వానించుకున్నా రన్నమాట, అది మనకు శ్రేయస్కరమే మహారాణీ!

(అప్పుడొక పరిచారిక వస్తుంది)

పరిచారిక—అమ్మా, ఫలాలతోనూ, మంగళ ద్రవ్యాలతోనూ నిండివుండిన పళ్ళేలతో తిప్పమ్మాదేవిగారి పరిచారికలు వచ్చి దర్శనం కోరుతున్నారు.

నాగమ్మ—(లక్ష్మమ్మతో) మంగళద్రవ్యాలతో—

లక్ష్మమ్మ—రప్పించండి. నువ్విలా రా తమ్ముడూ.

(లక్ష్మమ్మా, వియ్యన్నా పక్క గదిలోకి వెడతారు)

నాగమ్మ—తీసుకురా.

పరిచారిక—చిత్తం అమ్మా!

(పరిచారిక, తిప్పమ్మ పరిచారికలను వెంటబెట్టుకుని వస్తుంది. వాళ్లు మంగళద్రవ్యాలతో నిండివున్న పళ్లేలు నాగమ్మ ముందు ఉంచుతారు)

తిప్పమ్మపరిచారిక—అమ్మగారికి దండాలు. బుల్లిబాబుగారికి పట్టాభిషేకం. తిప్పమ్మాదేవిగారు, దయచెయ్యవలసిందని తమర్ని ప్రార్థిస్తున్నారు.

నాగమ్మ—ఇదే వచ్చామని మనవిచెయ్యి.

తిప్పమ్మపరిచారిక—చిత్తం అమ్మా, దండాలు.

(వెళ్లిపోతారు లక్ష్మమ్మా, వియ్యన్నా వస్తారు.)

లక్ష్మమ్మ—బుల్లిబాబుకి పట్టాభిషేకమా? ఏబుల్లిబాబుకి?

నాగమ్మ—అదేమిటి, లక్ష్మమ్మగారూ?

లక్ష్మమ్మ—ఏమో చెప్పలేను. కృష్ణరాయబాబు కళ్లకు కట్టినట్టు కనపడుతున్నారు.

నాగమ్మ—ఇంకెక్కడి బాబు తల్లీ?

లక్ష్మమ్మ—ఆమాట తమరు కాదుఅనడం తిప్పమ్మ గారిచేత అనిపించాలి. ఏమంటావు నీలం.

నీలమ్మ—(నాగమ్మకీ, లక్ష్మమ్మకీ పాదాభివందనం చేసి) అలా అనిపించగలిగేటట్టు నన్ను దీవించండి.

నాగమ్మ—వెళ్లిరా తల్లీ!

లక్ష్మమ్మ—ఈకళ్లతో చూస్తాం. మరి పద.

(నీలమ్మ వెళ్లిపోతుంది)

నాగమ్మ—ఇకబయులుదేరుదామా లక్ష్మమ్మగారూ?

లక్ష్మమ్మ—అవశ్యమూను. తమ్ముడూ!

వియ్యన్న—ఇదిగో, వెడుతున్నాను.

(ముగ్గురూ వెళ్లిపోతారు)

## పదమూడో రంగం

(సభామంటపంలో ఒక గది. అందులో నాగమ్మా, లక్ష్మమ్మా కూచునివుంటారు. ఎదట నుంచునివియ్యన్న)

వియ్యన్న—చిత్తం మహారాణీ! మనవారి కందరికీ వుప్పందింది. ఎక్కడ వుండవలసినవా రక్కడ చేరు

కున్నారు. పాపారాయుడుగారూ, కుమారభూపతి పేరిట సీలమ్మగారున్నూ—

నాగమ్మ—అదుగో, గోవిందరాజయ్యగారి దగ్గర సింహాసనానికి కుడిగా కనపడుతూనే వున్నారు.

లక్ష్మమ్మ—సీలమ్మని యెవరయినా గుర్తుపట్టగలరా?

వియ్యన్న—ఈ గది గుమ్మాన, సాయుధులై నుంచుని వున్న రంగప్పనాయనింగారూ, బలరామనాయనింగారూ, తిరుమల నాయనింగారూ, రాఘవరాయుల వారూ తమకు అంగరక్షకులు. ప్రపంచం తలకిందు లయినా, వారు, తమకు అపాయశంక అయినా కలగనివ్వరు.

నాగమ్మ—సంతోషం.

వియ్యన్న—సంకేతధ్వని కావడంతోనే మనవా రెక్కడ వున్న వా రక్కడ తమ పనులు ప్రారంభిస్తారు. ఎదటిపక్షంవారి చాకచక్యాన్ని వట్టి విధానంలోమార్పు వచ్చినా పని మాత్రం జరిగిపోతుంది.

నాగమ్మ—బాగుంది. మరి ఆభూతం మాట?

వియ్యన్న—తిమ్మరాయులవారు పీటలమీదికి వచ్చి రావడంతోనే సేవకుడు ఆ భూతాన్ని కైదు చేసి—

లక్ష్మమ్మ—వారికి సంకెళ్ళు—మరిచావాతమ్ముడూ?

నాగమ్మ—నాయనా, అది చూస్తేగాని యీకళ్ళు చల్లబడవు. కుర్రకుంకకి పట్టబంధనానికి బదులు నిగళ

బంధనం కావాలి.

వియ్యన్న—చిత్తం అమ్మా! తిమ్మరాయులవారిని బావగారు వారిదగ్గిరనుంచి పీటలమీదికి తీసుకువస్తారు. వెంటనే నేను వారిని కైదుచేసి, ఆ గది తలుపులు బిగిస్తాను. అంతా అయినాక, సంకెళ్ళతో వారిని—తిమ్మరాయులవారిని.

నాగమ్మ—చాలు నాయనా!

లక్ష్మమ్మ—తమ్ముడూ, దయాదాక్షిణ్యాలు మరిచిపో, ఏ సంకోచమూ దగ్గిరికి రానివ్వకు. హృదయం మహారాణీ పాదాల దగ్గిర వుంచేసి మరీ వెళ్ళు.

వియ్యన్న—ఇదివరకే చేశా నది యెరగవా అక్కా?

నాగమ్మ—ఎంతమాట సెల విప్పించారు నాయనా! తమరు బ్రాహ్మణోత్తములు, తమ పాదాలు కడిగి, శిరస్సున చల్లుకోవలసినవాళ్ళం మేము.

లక్ష్మమ్మ—అంతపని మావల్ల అయినప్పటి మాట అది. తమ్ముడూ, ఇక నువ్వు వెళ్ళు.

వియ్యన్న—మహారాణీ, తమ దాసీలు నలుగురు గుమ్మాన వున్నారు. వాళ్ళు ఎప్పటి కప్పుడు సభలో జరుగుతూ వున్నది తమకు నివేదించుకుంటూ వుంటారు. మరి నాకు సెల విప్పించండి.

నాగమ్మ—మంచిది నాయనా!

## పద్నాలుగో రంగం

(సభామంటపాన మరోచోట మరోగది. రుక్కమ్మా, రాజవేషంతో వున్న తిమ్మరాజుని వొడిలో వుంచుకుని తిప్పమ్మా కూచుని వుంటారు. తిమ్మరుసయ్య ఎదట నుంచుని వుంటాడు)

తిమ్మరుసయ్య — నలభై సంవత్సరాల నుంచీ ముహూర్తా లుంచుతున్నారు, ఇంతవరకూ యిలాంటి ముహూర్తం వుంచి యెరగమంటారు మన సిద్ధాంతిగారు.

తిప్పమ్మ—అబ్బాయి జీవితం జగజ్జేగీయమానంగా వుంటుందని మొదణ్ణుంచీ నే నంటూనే వున్నాను. ముహూర్తం అందుకు తగ్గదే దొరకుతుంది వింతయేమిటి?

తిమ్మరుసయ్య—బుల్లిబాబుగారి చరిత్ర విలక్షణంగా వుంటుందని నేనూ యెరుగుదును.

తిప్పమ్మ—అవునుగదా?

తిమ్మరుసయ్య—ఇంతే కాదు, దానికాకారణమున్నూ నే నెరుగుదును.

తిప్పమ్మ—అదేమిటో సెలవిప్పించి నన్ను కూడా సంతోషపెట్టండి.

తిమ్మరుసయ్య—అది తమహోమకత్వమే. మరేముందీ?

తిప్పమ్మ—తమ రెప్పుడూ భారం అంతా నామీదే

వుంచుతూ వుంటారు. నాదగ్గిర వున్న విశేషం యేమిటీ?

తిమ్మరుసయ్య—నే నొక్కణ్ణేనా యీమాట అనడం? సామ్రాజ్యంఅంతటా యిదేమాట. ఒక్కటి చిత్తగించండి. నగరంలోనే కాక, సామ్రాజ్యం అంతటా యుగంధర ప్రజ్ఞావంతులైన సరదార్లూ, మండలేశ్వరులూ వేలున్నారు. విజయనగరసామ్రాజ్యవైభవం చూసి కుమిలిపోయే వర రాజులున్నూ అనేకు లున్నారు; కాని, వీరనరసింహ రాయలవారు కైలాసానికి వేంచేసి పదిహేను దినాలైనా వొక్కడైనా తల యెత్తగలిగాడా? ఒక్కడైనా యుద్ధం ప్రకటించగలిగాడా? తమ ఓజస్వితకు ఇంతకంటే మరేమి నిదర్శనం కావాలి?

తిప్పమ్మ—పేరు నాది. తమర్ని చూసీ, తలుచుకునీ, అందరూ కిక్కినపే లయి వున్నారు.

తిమ్మరుసయ్య—తమమాట కొట్టెయ్యలేను. అయితే తమ సామర్థ్యంపట్టేగదా నా తెలివి తేటలకు వినియోగం?

(అప్పు డొక దాసి వస్తుంది)

దాసి—వేళ కావస్తూ వున్న దని సిద్ధాంతిగారు మనవి చేసుకుంటున్నారు. పురోహితులవారు ద్వారాన వేచివున్నారు, మహారాణీ!

తిమ్మరుసయ్య—అమ్మా, బుల్లిబాబుగారిని తమరూ, అమ్మాయీ దీవించి పంపించండి.

తిప్పమ్మ—ఇలా రా తండ్రీ! (వొడిలోవున్న తిమ్మ రాజుని తన యెదట అభిముఖంగా నిలువుకుంటుంది)

తిమ్మరుసయ్య—బాబూ, బాబయ్యమ్మగారికి నమస్కారాలు మనవిచెయ్యండి.

తిమ్మరాజు—(చేతులు జోడించుకుని) నమస్కారాలు విన్నవించుకుంటున్నాను.

తిప్పమ్మ—నాకూనా, చక్రవర్తివై అఖండవైభవాలనుభవించు.

తిమ్మరుసయ్య—బాబూ, అమ్మగారికిన్నీ నమస్కారాలు సమర్పించండి.

తిమ్మరాజు—(తల్లి యెదట నుంచుని చేతులు దోయిలించుకుని) నమస్కారాలు సమర్పించుకుంటున్నాను.

రుక్కమ్మ—నాతండ్రీ, చక్రవర్తివై, మంచి ముహూర్తాన కుమాళ్ల తండ్రివై నూరేళ్లు వర్ధిల్లు.

తిప్పమ్మ—బాబూ, మహామంత్రులవారికి కూడా నమస్కారాలు చెప్పాలో.

తిమ్మరుసయ్య—అమ్మా, అది చాలా అనుచితమైన పని. ప్రభువు ఎంత చిన్న లయినా, మంత్రి బ్రాహ్మడే అయి, పెద్దకూడా అయినా నమస్కరించడం శాస్త్ర సమ్మతం కాదు. బాబూ! దయచెయ్యండి.

(తిమ్మరుసు తిమ్మరాజుని తీసుకుని బయటకి వెళ్ళిపోతాడు. తెరలో "మమాగ్నే, అగ్నే వర్చాః" అంటూ స్వస్తి ప్రారంభం అవుతుంది. అప్పుడు అతి రభసంలో ముందు వియ్యన్నా, తరవాత నలుగురు సైనికులూ వస్తారు. వారినిచూసి తిప్పమ్మా, రుక్కమ్మా "ఓ, ఓ" అంటూ కంగారుపడుతూ వొణికిపోతారు)

వియ్యన్న—(అతిగంభీరంగా నుంచుని, చర్రున కత్తి దూసి, తిప్పమ్మకేసి తీక్ష్ణంగా చూస్తూ) నోరెత్తవద్దు. మీరు మా ఖైదీలు. కదిలారంటే పుచ్చె లెగిరిపోతాయి. (సైనికులను చూసి) వీరికి సంకెళ్ళు తగిలించి, గుండెలకు బల్లేలు గురిపెట్టి మీరు లోపల వుండండి.

(వియ్యన్న బయటికి వెళ్ళిపోతాడు)

---

## పదిహేనో రంగం

(నాగమ్మగది. నాగమ్మా లక్ష్మమ్మా కూచునివుంటారు)

నాగమ్మ—అలా చూశారా లక్ష్మమ్మగారూ?

లక్ష్మమ్మ—చూశా చూశా, నిక్కడ పురోహితులూ అక్కడ వియ్యన్నా వొక్కమాటే సంకల్పం చేశారు.

నాగమ్మ—అదిగో, అదిగో, కత్తి దూశారు వియ్యన్నగారు.

తెరలో

హర! మహా—దే—వ!

ఒకదాసి—(వచ్చి) మహారాణీ, మహారాణీ! వియ్యన్న బాబుగారు, వొళ్ళు తెలియని ఆవేశంతో కత్తిదూసి సింహనాదం చేశారు. అదేమిటో, యెందుకో తెలియక అందరూ తెల్లబోయి చూస్తున్నారు. (వెళ్ళిపోతుంది)

తెరలో

కిల్ల ల్ల ల్ల ల్ల ల్లా

రెండోదాసి—(వచ్చి) మహారాణీ, మహారాణీ, వియ్యన్న బాబుగారు సింహనాదం చెయ్యగానే నీలమ్మ గారు కెవ్వున కేక వేసి తిమ్మరాజుగారిమీద దుమికారు. అది చూసి సాంబశివరాయలవారు నీలమ్మగారి మీద దుమికారు. (వెళ్ళిపోతుంది)

నాగమ్మ—
లక్ష్మమ్మ— } అయ్యో!

మూడోదాసి—(వచ్చి) మహారాణీ, మహారాణీ, పాపారాయలవారు, విసిరికొట్టి సాంబశివరాయలవారి కుడిచెయ్యి జబ్బల్లోకి నరికేశారు. వెంటనే అప్పన్నదొర గారు జుట్టుపట్టుకుని సాంబశివరాయలవారిని వెనక్కి యీడ్చేసి గుండెలమీద కూచున్నారు. (వెళ్ళిపోతుంది)

నాగమ్మ—నీలమ్మేమయిందో కదా లక్ష్మమ్మగారూ!

నాలుగోదాసి—(వచ్చి) మహారాణీ, మహారాణీ! నీలమ్మగారు పొడిచిన పోటుకి తిమ్మరాజుగారి కుడిభుజం

దూసుకుపోయింది. (వెళ్ళిపోతుంది)

లక్ష్మమ్మ—అయ్యో, పోటుతప్పిపోయింది, యేమి దారి నాగమ్మగారూ!

మొదటిదాసి—(వచ్చి) మహారాణీ, మహారాణీ! తోటకూరకాడలాగ వాలిపోయిన తిమ్మరాజుగారిని తిప్పమ్మాదేవిగారూ, కోడలుగారూ వున్న గదిలోకి గెంటి, వియ్యన్నబాబుగారు, పిడిపించడానికి వచ్చినవారి నందరినీ నరుకుతున్నారు. (వెళ్లిపోతుంది)

లక్ష్మమ్మ—ఆభూతానికి కది చాలదు, అందరికీ సంకెళ్లు వెయ్యాలి.

నాగమ్మ—సంకెళ్లు వెయ్యడంతో సరిపోనిస్తానా—

రెండోదాసి—(వచ్చి) మహారాణీ, మహారాణీ! తోసుకుంటూవచ్చి అచ్యుతదేవరాయలవారు సింహాసనం ఆక్రమించుకున్నారు. జగ్గారాయలవారు వారిమీదికి లంఘించారు. ప్రతాపరాయలవారు జగ్గారాయల వారిమీదికురికారు. ఇద్దరూ మదపుటేనుగుల్లాగ కుమ్ముకుంటున్నారు. (వెళ్లిపోతుంది)

తెరలో

పృథ్వీవృత్తం

సుధీమధురవాక్సుధానుముఖ! నాగామాంబాసుతా!

నాగమ్మ—ఆ, లక్ష్మమ్మగారూ!

మూడో దాసి—(వచ్చి) మహారాణీ, మహారాణీ! గోవిందరాజు బాబయ్యా, అప్పన్నదొరగారూ వచ్చి కన్నెర్ర జెయ్యగా, అచ్యుతదేవరాయలవారు సింహాసనం దిగి వెళ్లపోతూ నుంచున్నారు. (వెళ్లిపోతుంది)

తెరలో

సుధీమధురవాక్సుధానుముఖ! నాగమాంబాసుతా
మధుప్రసవసాయకస్మయ విరామరమ్యాకృతీ!
దధీచ, విధు, కామధు, గ్ధనద, దుగ్ధసింధుప్రథా
వధీరణపరాయణోజ్జ్వల వదాన్యతాలంకృతా!"

నాలుగో దాసి—(వచ్చి) మహారాణీ, మహారాణీ, వందిమాగధులు మహోల్లాసంతో లేచి బాబయ్యగారిని కీర్తిస్తున్నారు. అదేమిటో, యెందుకో తెలియక అందరూ ఆశ్చర్యచకితులై ఉత్కంఠిత్తుగా లేచినుంచున్నారు. (వెళ్లిపోతుంది)

నాగమ్మ—ఏమి టంటారు లక్ష్మమ్మగారూ?

లక్ష్మమ్మ—కృష్ణరాయబాబు బతికివున్నారు మహారాణీ! క్షణానికో క్షణానికో—

తెరలో

క॥ శ్రీవేంకటేశ పదప
ద్మావేశిత సదయహృదయ! హారనిటల నట
త్పావక పరిభావి మహః
ప్రావృతనిఖిలేశ! కృష్ణరాయ మహీశా!

మొదటిదాసి—(వచ్చి) మహారాణీ, మహారాణీ! అక్కడి మహామంత్రి తిమ్మరుసయ్యవారు చేతులు కట్టుకుని ద్వారాభిముఖంగా తిరిగి నిశ్చలంగా నుంచున్నారు. అచ్యుతరాయలవారు ఎందుకో అడుగు ముందుకి వెయ్యబోయారుగాని గోవిందరాజుబాబయ్యని చూసి ఆగిపోయారు.

(వెళ్లిపోతుంది)

నాగమ్మ—నాయనపేరు వినాటప్పటికి ప్రాణా లెగిరించి పోయాయి వెర్రినాయనకు.

లక్ష్మమ్మ—మాతిమ్మ డింకా—

రెండోదాసి—(వచ్చి) మహారాణీ, మహారాణీ! కొండారెడ్డిగారూ, కుమారశ్యామరాయలవారూ అశ్వారూఢులై వచ్చి, గుఱ్ఱాలను ద్వారాభిముఖంగా తిప్పి, వాటిమీదే అలాగే వుండిపోయారు.

లక్ష్మమ్మ—అమ్మయ్యా, కృష్ణరాయబాబు దయ చేశా రన్నమాట, సందేహం లేదు మహారాణీ!

తెరలో

జయము, జయము శ్రీకృష్ణదేవరాయ సార్వభౌమా జయము, జయము!

సీ. లోలంగంగ ధూమకేతుక్షోభ జనులకు,
నతివృష్టి దోషభయంబు వాయ,

కంటకాగమభీతి గడవ, నుద్ధత భూమి
భృత్కటకంబెల్ల నెత్తు వడగ,
మాయ నఘస్ఫూర్తి మరుభూములందును
నెల మూడు వానలు నిండ గురియ
ఆబాలగోపాల మఖిల సద్ద్విజమును
ఆనందమున మనికి నతిశయిల్ల,
గీ. జనుల కెల్లను రామరాజ్యంబుగాగ,
చారుసత్త్వాఢ్య! యీశ్వర నారసింహ
భూవిభుని కృష్ణరాయ! అభ్యుదయ మొంది
పెంపుమీరగ ధాత్రి పాలింపుమయ్య!

మూడోదాసి— (వచ్చి) మహారాణీ, మహారాణీ! భద్రగజా రూఢులై శ్రీకృష్ణరాయబాబు వేంచేశారు. (వెళ్ళిపోతుంది)

నాగమ్మ—నానాయనే వచ్చాడా? నాతండ్రేవచ్చాడా?

లక్ష్మమ్మ—ఇలా దయచెయ్యండి మహారాణీ, నేను మనవిచేసుకోలేదూ, కృష్ణరాయబాబు బతికే వున్నారనీ?

నాలుగోదాసి—(వచ్చి) మహారాణీ, మహారాణీ! బాబయ్య చక్కంగా చూస్తున్నారు. గజా వరోహణం చేసి దయచేస్తున్నారు. (వెళ్ళిపోతుంది.)

లక్ష్మమ్మ—మహారాణీ, అదిగో, కృష్ణరాయబాబు, చుక్కల్లో చంద్రుడు లాగ మెరిసి పోతున్నారు. ఓహో,

సామంత మండలేశ్వరులూ, సరదారులూ, దడవాళ్ళూ, రాజబంధువులూ ఎక్కడివా రక్కడ మోకరిల్లుతున్నారు.

నాగమ్మ—అమ్మయ్యా, కళ్లు చల్లబడ్డాయి లక్ష్మమ్మ గారూ! నా నాయన్ని వొక్కమాటు పొదివి పట్టుకుంటే గాని వుండలేను, వదండి, లక్ష్మమ్మగారూ!

మొదటిదాసి—(వచ్చి) మహారాణీ మహారాణీ, సాంబశివరాయలవారు విసిరిన కత్తి నీలమ్మగారికి తొక్కలో దూసుకు పోయింది. అయినా కృష్ణరాయ బాబు దయచేశారని తెలియగానే వుచ్చిత్తుగాలేచి, తండ్రి గారిని అనుకుని తూల్తూ తూల్తూ దయచేస్తున్నా రామె.

నాగమ్మ—(మండిపడుతూ) ఆ, నా చిట్టితల్లికే గాయం అయిందా? ఇక సహించడానికి వీలులేదు. కుళ్ళబొడి పించి సాంబిగాణ్ణి ప్రాణాలతో వుప్పుపాతర వేయిస్తాను. నాసవతినీ, తిమ్మరాజుగాణ్ణీ చంద్రగిరికోటలో ఖైదు చేయించి, బతికివున్నంతకాలమున్నూ ముప్పతిప్పలూ పెట్టి [illegible] లేకపోతే, నాపేరు నాగమ్మకాదు, [illegible]నుకోండి.

(నాగమ్మా లక్ష్మమ్మా దురుసుగా వెళ్ళిపోతారు)

సమాప్తం




1935 ప్రబుద్ధాంధ్ర [illegible]

# శ్రీ కామాక్షీ స్తుతి



భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మ

# శ్రీ కామాక్షీ స్తుతి

## మూకపంచశతికి
### అనువాదము

రచయిత :

**భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మ**

రావివారిపాలెము, మోపిదేవిశివారు, కృష్ణాజిల్లా.

కృతికర్తలు : ముద్రాపకులు

**శ్రీ నాదెళ్ల పురుషోత్తమ దక్షిణామూర్తి శాస్త్రులవారు**

మచిలీపట్టణము

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# విజ్ఞప్తి

ఓంకార పంజరశుకీం ముపనిష దుద్యాన కేళి కలహంసీమ్ ।
ఆగమ విపినమయూరీ మార్యా మంత ర్విభావయే గౌరీమ్ ॥
శ్రీవిద్యానిలయాయ తత్త్వవిదుషే సీమాతిగాంచత్కృపా
శ్రీవిభ్రాజ దపాంగతర్పిత సుధీ శ్రేణీహృదే సన్ముదే ।
ద్యావాభూతల సంప్రపూర్ణ విపులావ్యాజాత్మ సజ్జ్యోతిషే
దావాభాఘనుదే నమోభవతు మేధాదక్షిణామూర్తయే॥
వేధోవిభూమాధవ హేతుభూత
బ్రహ్మానుసంధాన నిరస్తబాధమ్
విద్యాసుధాప్లావిత సాధుయూథ
ముద్యత్సుబోధం గురునాథ మీడే॥
శ్రీకామకోటి వరపీఠమహేశ్వరీయ
వీక్షావ్రజ ప్రహతజాడ్య మహాంధకారః ।
ప్రావోచ దంచితరసం శతకానిపంచ
స్తుత్యాత్మకాని య అరంసుకవిం త మీడే॥
గుణక్షీరాస్వాదనచణులగు విద్వదవతంస పరమహంసములారా !

శ్రీమూకమహాకవిప్రణీతమగు శ్రీకామాక్షీ పంచ శత స్తుతిగల బృహత్ స్తోత్రగత్నాకరాఖ్య గ్రంథమును బూని యొకప్పుడు(శ్రీకృష్ణాతీరమందలిశ్రీ దేవీ క్షేత్రభూతమగుమద్దురు గ్రామమున కేగి యటఁ బ్రాతఃకాలమునఁ గృష్ణవేణిలో నవగాహన మొనర్చి యాహ్నికముసల్పి మఱలునపుడు శ్రీ దేవీ 'పాద శతకము'నందలి తొలిపద్యమైన 'మహిమ్నఃపంథానం మదన

పరిపంథి ప్రీణయిని' యని యనుకొనుచుండఁగా, భగవత్సాను గ్రహమేమో 'కంతుద్విట్ప్రీణయాఢ్య నీమహిమ మార్గంబుం దగందెల్ప' అనుపద్యము నాల్గుపాదములు మనమునుండి దొరలినవి. 'శ్రీదేవీపాదనుతి' యఘాపనోదకముగదా! నాభాగ్యమనుకొని యప్పుడాశతకము నాంధ్రమునఁ బద్యాత్మకముగా ననువదించి, యంతఁ గ్రమముగా 'స్తుతి, కటాక్ష, స్మిత, ఆర్యా' శతకములఁగూడ శ్రీజగన్మాతచేఁ బ్రేరేపఁబడి యథాశక్తి ననువదించితి.

మున్ను నాచేరచింపఁబడినగ్రంథములకెల్ల శ్రీమోహినీపురము (మోపిదేవి) న వేంచేసియున్న గంగాపార్వతీసమేత సకలేశ్వరస్వామియే యధినేతయైయుండె. అమ్మహాదేవుఁడే 'నాకనన్యభిన్నుఁడు కాని స్వకనామకమనువు నుపదేశించిన త్వద్గురుదేవు నీకృతికన్య కధినేతనొనర్చి ధన్యుఁడవగు' మని ప్రేరేప శ్రీమత్కూర్మపురాణ ప్రథమభాగమును శ్రీస్వామివారికి నివేదించుతఱి సమాగతులగు మద్గురుపాదులు, విమర్శ కాగ్రేసరులు, మద్యోగక్షేమ నిర్వాహులు, నాయందవ్యాజ సోదరాదరముగల విద్వత్కవిశేఖరులగు బ్ర॥ వే॥ శ్రీ నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రిలవారితో నాసభలోస్వామివారి సన్నిధి ననియుంటిని. పిదప నారచించినపద్యములను మూలశ్లోకములను శ్రీవారికి వినిపించి సంస్కరింపించుకొంటిని. మున్ను

నాలోచించినగ్రంథముల కమ్మహామహులే పీఠికలువ్రాసి ముద్రాపణ భారముఁగూడ వహించుచుండిరి.

ఇప్పుడీకబ్బమున 'కధినేతలు వారే కానదీనికెవ్వరు పరిచయమును వ్రాయుదురా' యని నేనాలోచింప, శ్రీమద్గురుభాగవత దత్తమహిమ, సూక్తినిధి ముఖానేకగ్రంథరచయితలు, నుభయభాషాప్రవీణ, కవిశేఖర, వేదాంతపారీణ, బిరుదాభిరాములు' గుంటూరుపురవాస్తవ్యులును, మద్గురుదేవులకత్యంతాప్తులునై నెగడెడి యన్వర్థాభిధేయులగు, బ్రll వేll శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారంతరమునఁ గనుపట్టిరి. ఆ స్తికవరేణ్యులగు శ్రీవారు తామురచించిన 'సూక్తినిధి' గ్రంథము నాకడ కత్యాదరముతోఁ నంపఁ బ్రశంసించుచు నాహృదయమును వారికి నివేదించితిని. విబుధవతంసులగు శ్రీవారు 'మీయీసుకృతికీమాత్రము వ్రాయభారమా ! తోఁచినట్లువ్రాసెద, మీపద్యములను సమూలములనుజేసి పంపుఁడని యాదేశింపమాచిరంజీవి ద్వారమున నాపద్యముల చిత్తుప్రతి నంపితిని. 'ముద్రణకనువుగా వ్రాసియుంపినచో నిచట నేనేప్రూఫులుసరిచూచిముద్రింపించెద' నని యనుగ్రహముతోఁ దెలియఁజేసి నాపంపిన యీకృతి సతికిఁ జక్కని "మున్నుడి" యన్నతిలకమును బెట్టి మద్గురుదేవులకందించి, శ్రీవారంపినద్రవ్యముతో నిమ్మొయిఁబుస్తకరూపమునఁ గట్టనిష్ఠురములకోర్చి యచ్చుపత్రములు దిద్ది ప్రకటనలోఁ

దోడ్పడిరి. అట్టి కరుణాసనాథులగు శ్రీగురునాథుల హృదయ ఫలకమున నిల్పి సర్వదా కృతజ్ఞుఁడనై భావించుకొనియెద.

ఉభయభాషలలో మృదుమధురశైలి ననేకగ్రంథరాజముల రచించి సర్వపండితలోకామోదమును బడయంజాలిన శ్రీగురుదేవులు తాము రసవత్కవితా విచక్షణులయ్యు దేవీ స్తోత్రరూపమగు నీఖండకావ్య సముచ్చయమును నేనర్పంపఁబోఁగా నం బాపక్షపాతముననో మూకకవిసమాదరముననో నాయందలియనుగ్రహముననో యన్యథాకరింపమిచే నేనెంతయు ధన్యుఁడనైతినని యెంచి పూజించుకొనుచున్నాఁడను. ఇందలి గుణవిశేషమెల్ల మూలగ్రంథకారునిదిగను దోసఁగులే వేనున్న నాయవిగనుగుణగ్రాహులెంచి మన్నించెదరుగాత.

రావివారిపాలెము
22-6-59

ఇట్లు
గురుపాద రేణువు
భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మ

# మున్నుడి

ఒకనాఁడు బ్రహ్మశ్రీ వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు తన పుస్తకమిచ్చి కవికుమారునాకడకంపి యుపోద్ఘాతము వ్రాయవల సినదనిరి. ఈజగమెఱిఁగిన బ్రాహ్మణునకుజందెమేల? నావలనఁ గాదంటిని. అన్నను వినకయనుశాసించిరి. మిత్రాజ్ఞోల్లంఘనము నకు వెఱచి నాశక్తినిమఱచి యేవో మూఁడుముక్కలువ్రాయఁ బూత్తముఁదెఱచితి.

ఇది కంచికామాక్షిని గుఱించిన స్తోత్ర గ్రంథము. కామాక్షీపంచశతి. ఇందలి శ్లోకసంఖ్య నామమునందే చేర్పఁ బడినది. వేదాంత పంచదశి శుక సప్తతి సుభాషిత త్రిశతి ఆర్యాసప్తశతి లక్ష్మీసహస్రము మున్నగు గ్రంథములునిట్లే కలవుగదా. భర్తృహరి సుభాషితత్రిశతిని నీతిశృంగారవైరా గ్యములని మూఁడుగా విభజించి యొక్కొక్క విభాగమును నూఱుశ్లోకములుండ రచించినట్లే మూకకవియుఁ దన గ్రంథ మును బాద, స్తుతి, కటాక్ష, మందస్మిత, ఆర్యాశతకములనియైదు విభాగములొనరించి యైదుశతకములురచించెను. ఐదు శతకము లుగలదిగాననే పంచశతియైనది. తెనుఁగునందువలె సంస్కృ తమున శతకములకొక మకుటముండదు. ఆర్యయనఁ గామాక్షి యనునర్థమున్నను నాశతకభాగమునందన్ని శ్లోకములు నార్య లేకాన దానికా పేరిడఁబడినది. మందస్మితశతకమున నన్నియు శార్దూలవిక్రీడితములు. కటాక్షశతకమున వసంతతిలకలు. పాదా రవిందశతకమున శిఖరిణీవృత్తములు కలవు. స్తుతిశతకమున

మాత్రము మొదట 20 శార్దూలములు పిదప 20 హరిణీవృత్తములు పిదప 20 శిఖరిణులు పిదప 20 శార్దూలములు పిదప 20 శిఖరిణులు చివరమాలినికలదు. అన్నిశతకముల స్తుతియేకదా? యీవిభాగమేల? అన నొక్కొక్కశ్లోకమునఁ బ్రాధాన్యము దేవిపాదములకుంటచేఁ బాదశతకమని, కటాక్షములకుంటచేఁ గటాక్షశతకమని, స్మితమునకుంటచే స్మితశతకమని పేర్కొనిరి. ఆర్యా స్తుతిశతకములలోనట్లు దేవ్యవయవములకుఁగాక దేవికే ప్రాధాన్యముంటచే నచట శ్లోకములంబట్టి యార్యాశతకమనిరి. స్తుతిశతకమున వివిధవృత్తములుంటచే స్తుతిశతకమనిరి. ఔత్తరాహుల ప్రతులలోను దాక్షిణాత్యుల ప్రతులలోను శతకముల క్రమమునవ్యత్యాసముకలదు.

## మూకమహాకవి

ఈపంచశతిని సంస్కృతమున మూకమహాకవిరచించెను. ఈకవినిగుఱించి శ్రీ యం. కృష్ణమాచార్యులుగారు M.A., M.L. Phd. M. R. A. S. గారు తామువ్రాసిన History of Classical Sanskrit Literature అనుగ్రంథమునఁ జర్చించిరి. ఈకవి క్రీస్తు 396 to 436 లో నుండెను. మూకకవిని మూకార్భకుఁడనియు నందురు. ఇతఁడు మూఁగవాఁడై పుట్టి జగద్గురువులైన కంచికామకోటి పీఠాధిపులగు శ్రీ విద్యాశంకరులచే మంత్రోపదేశమునుబొంది కామాక్షీమంత్రమును జపించెను. ఆతల్లి యనుగ్రహమున మూఁగతనము పోయి మహాకవి యయ్యెను. ఇందసంభావ్యమేదియులేదు. 'తెరతీయఁగరాదా' అన్నత్యాగరాజు మాటను వేంకటేశ్వరస్వామి వినలేదా?

ఈవిషయము నీకవిపంచశతిలో మాటిమాటికిస్మరించెను. “మూకాత్మనామపిమహాకవితావదాన్యాన్” “త్వత్కారుణయా సమృద్ధావాగ్ధాటీ పరిహాసితమాధ్వీకవయతాం” “బుధేవా మూకేవా పరిపతతి తస్మిన్ క్షణమసౌకటాక్షః”‘నరీనర్తుప్రౌఢా వదనకమలేవాక్యలహరీ’ ‘సరీసర్తుస్స్వైరం వచనలహరీ నిర్జరపురీ సరిద్వీచీనీచీ కరణపటురాస్యే మమ సదా’ ‘మూకోఽపి ... స్మరతి యః ... ఏకో భవతి స జంతుః లోకోత్తర కీర్తి రేవ కామాక్షి’ ‘మూకానామపికుర్వతీసురధునీనీకాశవాగ్వైభవం’ ఇట్లుమాటిమాటికినీకవిచెప్పుచుంటచే నమ్మదయారసమితనిపైఁ బ్రవహించెననుట నమ్మఁదగినది కాకపోదు.

శ్రీ స్వామిశివానందులు తమ Lord Siva and His Worship అను గ్రంథమున ‘కంచిలోఁగామాక్షీ దేవ్యాలయమునజపముచేసికొనుచు నొకమూల ముడుచుకొని కూర్చున్న మూఁగవానినాలుకపై నాతల్లివచ్చి బీజాక్షరములువ్రాయఁగా నాతఁడేమూకమహాకవియై శ్రీకామకోటి పీఠస్వామియునయ్యె’ నని వ్రాసిరని మామిత్రులు శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి గారు తమ గ్రంథమున వ్రాసిరి.

ఈకవికంచిలోఁగామకోటి పీఠమున 20వ శంకరులుగానుండిరి. “మూకార్భోఽపి జగద్గురోః కరుణయావిద్యా ఘనస్యాప్తవాగాచార్యోస్తిహి శంకరేంద్ర బిరుద స్సర్వజ్ఞ పీఠాధిపః”

(గురురత్నమాలిక పేజి 53)

మూకకవిశిష్యులు రామిలుఁడు, సౌమిలుఁడు, మేంఠుఁడు గలరు. రామిలుఁడు తన ‘మణిప్రభ’ లో గురువగు మూకమహాకవిని స్మరించెను. అలంకారికులచేఁ గాళిదాసుకన్న మహా

కవియని ప్రశంసింపఁబడిన మేంఠుఁడు కాశ్మీరప్రభువగు మాతృగుప్తుని యాస్థానమున (430. క్రీ.) నుండి 'రామచరిత' అను 100 సర్గలమహాకావ్యమునురచించెను. మఱియు నీమేంఠుఁడు 'హయగ్రీవవధ' రచించెను. అందు 'ఖ్యాత శ్రీశంకరేంద్ర ప్రచురతరకృపాలబ్ధ సాహిత్యవిద్యః' అని తనగురువగు మూకమహాకవిని గామకోటిపీఠాధిపతియైన వెనుకఁగీర్తించెను. స్తుతిశతకమున 'సుపుత్రార్త్రీహాద్రత్రైవ ఝటితికామాక్షికరుణా' అని యుంటచే నితఁడు పుత్రులఁకల్గినపిదప నేసన్న్యసించి పీఠాధిపతి యయ్యెనని తలంతును. ఆర్యాశతకమందలి 59- 60- 90 మున్నగుశ్లోకములంబట్టి సమాధియోగముంగూడనీకవిసాధించెనని తలంపనైయున్నది. 'ఉత్తుంగస్తన మండలీపరిచలన్మాణిక్యహారచ్ఛటా' 'అనంగతంత్రవిధిదర్శిత కౌశలానాం' మున్నగు శ్లోకములనీకవిపరమపవిత్రమైన భక్తిభావమునఁ బరతంత్రుఁడై రచించియుండెను. బిడ్డకుఁ దల్లికడఁజాటేమిటి? ఇట్లీకావ్యము నడిచినది.

శతకముకావ్యమా? అవును. శతకములును గావ్యభేదములే. 'వాక్యంరసాత్మకం కావ్యమ్' అని విశ్వనాథుఁడన్నను 'రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యమ్' అన్న పండితరాయల యభిభాషణమునే మనమస్వీకరింతము. అమ్మ యనుగ్రహమున రమణీయార్థమును బ్రతిపాదింపఁగల శబ్దము ననాయాసముగా వాడినమహాప్రతిభావంతుఁడితఁడు. 'ప్రజ్ఞానవనవోన్మేషశాలినీ ప్రతిభామతా-తదను ప్రాణనాజ్జీవేద్వర్ణనానిపుణః కవిః' 'అని భామహుఁడుపల్కెంగదా. క్రొత్తక్రొత్తపోకడలంబోవు ప్రజ్ఞప్రతిభయనంబడును. అదికల్గివర్ణనచేయువాఁడు మహాకవి.

మన కవికటాక్ష పాదస్మితాదులవర్ణించుచు నూఱునూఱుశ్లోకములరచించెఁగదా. ఒక్కొక్కశ్లోకమే యొక్కొక్క కావ్యమనిపించుకొను నన్నందప్పా ? విశ్వనాథుఁడు 'ఖండకావ్యం భవేత్కావ్య స్యైక దేశానుసారిచ' యథా మేఘదూతఋతుసంహారాదయః. అనెంగాన నిది ఖండకావ్యములలోఁ జేరును. ఐనను వచ్చిన న్యూనతలేదు. వామనుఁడు మహాకావ్యములతో ఖండకావ్యముల జతచేసివానినినిబద్ధకావ్యములనెంగదా.

వ్యుత్పత్త్యభ్యాసముల వలనఁ బ్రతిభావంతులై కావ్యములు వ్రాయవచ్చును. దేవతానుగ్రహమువలనం బ్రతిభావంతులై కావ్యములు వ్రాయవచ్చును. రాజశేఖరుఁడు కావ్యమీమాంసలో 'ప్రతిభావ్యుత్పత్త్యోః ప్రతిభా శ్రేయసీ ఇత్యానందః' అనెను. ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభయే (శ్రేష్ఠతరమని యానందవర్ధనుఁడనెను. ఏలన ! 'అవ్యుత్పత్తికృతో దోషః- శక్త్యాసంవ్రియతేకవేః. యస్త్వశక్తి కృతస్తస్య-ఝగిత్యేవావభాసతే' ప్రతిభగల కవి తన ప్రతిభచే వ్యుత్పత్తి లేనందువలనఁ గలిగినలోపమును గప్పివేసికొనును. ప్రతిభ లేనందువలనఁ గల్గినలోపమో వెంటనేకనఁబడును. కనుక-

శ్లో॥ రమ్యంజుగుప్సిత; ముదారమథాఽపినీచం;
ఉగ్రంప్రసాది; గహనంవికృతంచ; వస్తు
యద్వాప్యవస్తు; కవిభావకభావ్యమానం
తన్నాస్తియన్న రసభావముపైతిలోకే (దశరూపక)

చక్కనిది గానీ, చక్కనిదికాక పోనీ, గొప్పదిగానీ, కొద్దిదిగానీ, భయంకరమైనదిగానీ, ప్రసన్నమైనదిగానీ, గంభీర

మైనదిగానీ, వికారమైనదిగానీ, వస్తువుగానీ, అవస్తువుగానీ, కవివర్యునిచే భావ్యమానమై రసభావమును గల్గింపనిది లోకమున లేదు. అట్టిచో జగన్మాతనుగూర్చిన గ్రంథము జగన్మాతృనుగ్రహామువలన మహాకవి నోటరాఁగానానందమున నోలలాడించుటలో సందేహామేమి ?

## రసము

అట్లైననిందు రసము గలదా ? ఉన్నచో నేరసము !

విభావానుభావసాత్త్వికవ్యభిచారులచే నానీయమానమగుస్థాయి భావము రసమని యాలంకారికుల సిద్ధాంతము. దానింబట్టి శృంగారాది నవరసముల స్థాపించి మహానుభావుఁడు జగన్నాథపండితుఁడు పూర్వపక్ష మెత్తుకొని-

అథకథమేతఏవరసాః భగవదాలంబనస్య, రోమాంచాశ్రుపాతాదిభి రనుభావితస్య, హర్షాదిభిఃపరిపోషితస్య, భాగవతాది పురాణశ్రవణసమయేభగవద్భక్తై రనుభూయమానస్య దురపహ్నవత్వాత్. భగవదనురాగరూపాభక్తిశ్చాత్రస్థాయి భావః.

అనఁగా నివియేరసములా ? భగవంతుఁడాలంబనవిభావముగా, గగుర్పాటు కన్నీరు మున్నగునవియనుభావములుగా, హర్షాదులు సంచారులుగా, భాగవతాది పురాణములను వినునపుడు భగవద్భక్తి యనుభవింపఁబడుచుండును. దాని నెవ్వరు త్రోసివేయలేరు. అట్టిచో భగవదనురాగ రూపమగు రతి స్థాయి గాఁగల భక్తిరసము రసముగాదా ? అని శంకింతురా !

"ఉచ్యతే. భక్తేర్దేవాది విషయరతిత్వేన భావాంతర్గతతయా రసత్వాఽనుపపత్తేః"

వినుఁడు చెప్పుచున్నాను. భక్తి దేవాదివిషయకమగు రతికాన నది రసమనఁబడదు. భావమనఁబడును. ఏలన

"రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంజితః
భావః ప్రోక్తః" - ఇతిహి ప్రాచాం సిద్ధాంతాత్.

దేవతాది విషయకమగు రతియు, వ్యభిచారులును భావములని చెప్పఁబడును. అని పూర్వులు సిద్ధాంతీకరించిరి. అని భక్తి రసమును భావకోటిలోనికిఁ బండితరాయలు మెల్లఁగా నెట్టివేసెను. ఈగంగాభక్తుని తరువాత మధుసూదన సరస్వతీస్వాములవారు తన 'భగవద్భక్తి రసాయనము' అను గ్రంథమున భక్తిరసమును స్థాపించెను.

"శోకక్రోధభయాదీనాం - సాక్షాత్సుఖ విరోధినాం
రసత్వమభ్యుపగతం - తథానుభవమాత్రతః."

సాక్షాత్సుఖవిరోధులైన శోకక్రోధభయాదులకే యనుభవించుచున్నాముగదా యని రసత్వమంగీకరింపఁబడినది.

"ఇహానుభవ సిద్ధేஉపి - సహస్రగుణితో రసః
జడేనైవ తయా కస్మా - దకస్మా దపలప్యతే"

ఇతరరసములకంటె వేయిరెట్లధికముగా భక్తిరసమనుభవింపఁబడుచుండ నోయి జడుఁడా! భక్తిని రసముగాద నెద వేమిటయ్యా?

"రతిర్దేవాదివిషయా - వ్యభిచారీ తథాంజితః
భావః ప్రోక్తో రసో నేతి. యదుక్తం రసకోవిదైః
దేవాంతరేషు జీవత్వాత్ - పరానందాఽప్రకాశనాత్
తద్యోజ్యం. పరమానందరూపే న పరమాత్మని"

రసకోవిదులు దేవాదివిషయకరతిని భావకోటిలోఁ జేర్చిరనదరా! పోనిండు. ఇతర దేవతలు జీవులేకాన వారలయందలి

భక్తిపరమానందమును గల్గింపమిచేదానిని భావమన్ననను గాని పరమానందస్వరూపుఁడైన శ్రీకృష్ణపరమాత్మ యందలి భక్తిని రసమని తీఱవలసినదే. ఆభక్తివలన బ్రహ్మానందము కలుగునయ్యా.

"పరిపూర్ణరసా క్షుద్రరసేభ్యో భగవద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్య ప్రభేవ బలవత్తరా"

శృంగారాది నీచరసములకంటె భగవద్రతి పరిపూర్ణరసము గలది. మిణుఁగురుపురుగుల కాంతికంటెసూర్యకాంతిమిన్నగాదా? అని మధుసూదన సరస్వతి భక్తిరసమును బ్రతిపాదించెను. కాన నీగ్రంథమున రసముగలదు. అది భక్తిరసము. మధుసూదన సరస్వతికి శ్రీకృష్ణుడు పరమాత్మయైనచో మనకవికిఁగామాక్షి పరదేవత. కాన దీనను బరమానందమబ్బును. పెద్దవాఁడగు భరతునివాక్యమునిలిపి గౌరవమిచ్చుటకో, లేక, యెవరికిచ్చ వచ్చినట్లువారు క్రొత్తరసములఁజేర్చుచుఁ బోవుచున్నచో రసముల కవ్యవస్థతయేర్పడుననియో, లేక సాధారణీకృతియందు విఘ్నత్వము నశింపవలసియుండుననియో, భక్తిని రసమన లేదనుకొందము. ఏమి? యంతమాత్రమున భక్తికిలోటుకల్గునా? రసములలో దీనినిజేర్చనంత మాత్రమున దీనికిలేని గౌరవము వచ్చునా? ఏల? మాటపట్టింపునకై పెనఁగులాట. చిత్తవృత్తి భగవదాకారాకారితమైన నంతకంటెఁ గావలసినదేమున్నది?

'లోకములోననున్నకవులుఁ బుధులుంగని నాదుగ్రంథమం
గీకృతి సేయరేమొయని ఖిన్నుఁడఁగాఁబనియేమి? యస్యచిం
తాకులితంబుగాక పరమాత్మవిచాగముతోడ రేఁబవ

శ్లేకతఁబొందు సాహ్యాదయమింతకు మించిన మేలుగల్గునే
(శ్రీమద్గురు భాగవతము.)

అని గురుభాగవత కవి వాకొనినాఁడు. కామాక్షిని గుఱించిన భావనలోఁజిత్తముతాదాత్మ్యమును బొందును. ఇంతకంటెఁగావలసినదేమున్నది ? లౌకిక విషయముల మఱచి యాతల్లి పాదాలను, జిఱునవ్వులను, గరుణాకటాక్షములను దుదకాదివ్యాకారమును భావనలో భావించుకొని నిలుపుకొని యానందించుట బ్రహ్మానుభూతికాదా ? ఇంతకంటెఁ దపస్సు కలదా? ఇంతకంటె సమాధికలదా? అందువలన భగవద్విభూతులెన్ని యెన్ని యనుభవగోచరములగునో ఈ పరమ నాస్తికులకు భక్తిశూన్యులకు నేమి తెలియును? ఆమహాభాగ్యము భక్తకవులకేకాని తదితరులకు లేదు. లేదు.కాననే భక్తకవులు లౌకిక విషయము నితివృత్తముగాఁ గైకొనరు. అట్టివారిలో నొకఁడుమన

శ్రీభమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు

వీరు కృష్ణామండలములోని ఘోషిదేవి శివారు రావివారిపాలెమున వసింతురు. శాండిల్యసగోత్రికుఁడు. వెలనాటి వైదిక బ్రాహ్మణుఁడు. వీరితాతగారు పేరయయజ్వ వేద వేదాంగములు పురాణ ధర్మశాస్త్రములు నధ్యయనించినవారు. వారి పెద్దకొడుకు వేంకటాచలపతిశాస్త్రి. ధర్మశాస్త్రవేత్త. నిరతాగ్నిహోత్రి. వారి ధర్మపత్ని పిచ్చమాంబ. ఈపుణ్యదంపతుల నోములపంటయే మన వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు. వీరు వికారివత్సర శ్రావణకృష్ణపంచమి జనించిరి. తండ్రికడనే స్వాధ్యాయమాధ్యయన మొనర్చి శ్రౌతస్మార్త కర్మాధికారి

యయ్యె. అంతతోఁ దనివిసనక బ్రహ్మశ్రీ కుప్పా వేంకటేశ్వర శాస్త్రుల వారి చెంత నాటకాంత సాహిత్యము నభ్యసించెను. తర్క-పరికరణములు కౌముది వల్లెవేసెను. పూర్వసుకృత వశమునఁ బుట్టుకందొట్టి కవిత వెంటనుండ దానియందచందములదిద్దుచు బ్ర॥ నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రులవారు పెంచి పెద్దఁ జేసిరి. శర్మగారి కుమార రత్నము వేంకటలక్ష్మీనరసింహ శాస్త్రి వీరనుషోడశకర్మాధికారియౌటయేగాక 'నవోదయము' మున్నగు కావ్యముల రచించి సత్కవులైరి. ఇట్టిది వీరి పవిత్రమైన వంశము.

శర్మగారుతొలుత విద్యారణ్యస్వాములవారి శంకరవిజయమునాంధ్రీకరించిరి. దానినాంధ్రదేశమందలి విద్వత్కవులు మహామహులెందఱో ప్రశంసించిరి. ఆవలఁ గూర్మమహాపురాణమునాంధ్రీకరించిరి. పిదపఁ బ్రసన్నరాఘవముఁ దెలిఁగించిరి. దీనినాంధ్ర విశ్వవిద్యాలయమాదరించెను. అంత శంకరభగవత్పాదుల దేవీస్తుతిపరములగుశ్లోకముల 'దేవీస్తుతికదంబము' అను పేర ననువాదమొనర్చిరి. ఇప్పుడీ మూకమహాకవికృతముఁ గామాక్షీ పంచశతిని బద్యములలో వ్రాసిరి. మామిత్రులు శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారును మిక్కిలిహృద్యముగాఁ బంచశతినాంధ్రీకరించిరి. మఱియు శ్రీమధునాపంతులసూరయ్యశాస్త్రిగారును 'దేవీనవతి' అనుపేర నచట నచటంగల శ్లోకములఁదొంబదింటినిగొని తెలుఁగుచేసిరి. చేయనిండు. ఆతల్లి నెందఱుస్తుతింపరాదు. ఎవరిభక్తివారిది. ఎవరి పాకమువారిది.

మనశర్మగారాంధ్రీకరణమునవందె వేసినచేయి. వారు వ్రాసినగ్రంథములెల్ల నాంధ్రీకృతములేకాన నందలిలోఁతు

పాఁతులు వారికిఁ దెలిసినట్లాగులకుఁ దెలియవన్న నతిశయోక్తి కాదు. వాదప్రతివాదములు శాస్త్రీయప్రసంగములు పారిభాషికపదబాహుళ్యముగల శంకరవిజయము నేయలవోకగా నాంధ్రీకరించిన వీరికిస్తుతిపరమగు పంచశతి యాంధ్రీకరణము పేలపిండి గాదా. ఇతివృత్తములుగల కావ్యముల నాంధ్రీకరించుటకు శ్రీనాథుఁడొరవడిపెట్టెంగాని యిట్టివానికిఁ బెట్టలేదు. అందు వలన వీరేయాంధ్రీకరణమునఁ బెక్కుదారులు త్రొక్కిరి,

శ్లో॥ కామపరిపంథి కామిని కామేశ్వరి కామపీఠమధ్యగతే
కామదుఘాభవకమలే, కామకలే కామకోటి కామాక్షి.

దీని కెంత శ్రమపడవలయు ? యతిని గూర్చుకొన్నఁజాలునుగా

కం॥ కామువిరోధిప్రియుని కామేశీ ! (ఆర్య49)

ఇట్లు వ్రాసిరి. మఱి యింతకంటె నీశ్లోకము నేమహాకవియు నెట్లు వ్రాయును ?

శ్లో॥ సమరవిజయకోటీ సాధకానందధాటీ – మృదుగుణ పరిపేటీముఖ్యకాదంబవాటీ మునినుత పరిపాటీ మోహితాజాండకోటీ–పరమశివ వధూటీ పాహిమాం కామకోటీ

దీనికిఁ దెనుఁగున యతిప్రాసల నంటించి కొన్నఁజాలుఁగాఁ [చూడుఁడు. స్తుతి 100 ప.]

శ్రీవీరభద్రమూర్తిగారు నించుమించుగా నీశ్లోకమునిట్లే తెనిఁగించిరి. ఎవరైన నట్లే చేయుదురు. అంత్యప్రాసాలంకారము ననాదరింతురా ?

కృష్ణకర్ణామృతమున :

"హే గోపాలక హే కృపాజలనిధే హేసింధుకన్యాపతే
హే కంసాంతక హే గజేంద్రకరుణాపారీణ హేమాధవ

హే రామానుజ హే జగత్త్రియగురో హే పుండరీకాక్ష”

అనియున్న శ్లోకమును పెలగపూడి వెంగనామాత్యుఁ డేమి చేసెను.

శా. ఓ కారుణ్యసముద్ర యోకరటిరక్షోదీర్ణ యోమాధవా
యోకంసాంతక యోరమాసహచరా యోవల్లవీకింకరా
యోకంజేక్షణ యోజగద్గురుమణీ యోరౌహిణేయానుజా.

అని యేగా వ్రాసినది.

వీరెక్కడనైన నొక్కచోట సంబుద్ధిపదమునో విశేషణ పదమునో మూలమును మించి యెక్కుడానిని వాడుదురు. అన్ని శ్లోకముల నెక్కువ తక్కువలేకుండఁ బద్యముల నిముడ్చిరి. ఇది యెన్నదగిన విషయము. మూలకవి యైనను దనశ్లోకమునకు సరియగు తెనుఁగు పద్యము తానే వ్రాయుచోఁ గొంత శ్లోకమైన మిగులును. కొంతపద్యమైన మిగులును. ఎక్కువతక్కువలు లేకుండ వ్రాయలేఁడు. మఱివున కవి యెట్లు వ్రాసెనో యాశ్చర్యముగానున్నది. మఱియు వీనిపద్యముమ వ్రాసికొనుచుఁబోవుటయే కాని ముందు వెనుకలఁజూచుకొనుచు నాలోచించి పదములమార్చుకొనుచు వ్రాసినట్లు కన్పింపదు, అట్లుమార్చుకొన్నచోఁ కామేశితాఁ. పవిత్రిత్వంబు కామాక్షితాఁ. “మదనార్యూరస్సుపీఠక కుఁదెలియనా ... ...” ‘విలుఁబాశమునంకుశముఁ గలిఁగరములఁదాల్చి ... సులలిత మాకాంచిశంభు శుద్ధాంతమహో’ అనఁబలువిధముఁ బద్యము లుండునా! కొన్ని యెడలమాత్రము వెనుకకుఁ దిరిగిచూచినట్లున్నది – ఆర్య 91 పద్యముచూడుఁడు. మొదటవ్రాసినపద్యమున

నంత్య(ప్రాసము రా లేదని మఱొక పద్యము 91వ్రాసిరి. ఇట్లుకొన్ని యెడలనొకశ్లోకమునకు రెండుపద్యములు వ్రాయఁబడినవి. అట్టి వానికిఁ బద్యసంఖ్యనొక్కటియే యిచ్చిరి. ఇట్లు పద్యసంఖ్య నిచ్చుటవలనఁ గావలసినవారు పద్యములకు మూలశ్లోకముల సులభముగాఁ దెలిసికొనవచ్చును. అందుకనియే శతకారంభ పద్యమునకు సంఖ్యనొసఁగరైరి. సంస్కృతము నందలి కొన్ని పదములను యణ్గంతములను గ్రియలను దెలుఁగులోనికిఁ దే వీలు లేదు. అవిశ్లోకమునలంకృతములై మెఱయుచుండును.

'తాపింఛ స్తబకత్విషే తనుభృతాం దారిద్ర్యముద్రాద్విషే
...కంపాతీరము పేయుషేకవయతాం జిహ్వాకుటీంజగ్ముషే'

ఈయంత్యప్రాసము తెలుఁగులోనికి రాలేదుగాన ఘనకవిగారు 'చీఁకటిపూగుత్తి చెలువంబునన్మించి మెయినూనువారి లేమి నిరోలంచి...' స్తుతి. ౭ప. అని మఱొక యంత్యప్రాసమును లంకించుకొని నిర్వహించిరి.

'రాకాచంద్రసమాన కాంతివదనా నాకాధిరాజస్తుతా...
మూకానామపికుర్వతీ సురధునీనీకాశవాగ్వైభవం'

ఇట్లాదుపైనపద బంధములతో రెండుదళములప్రాసములతో నున్నవాని నాపాకము చెడకుండఁ దెనుఁగునకుం దెచ్చుట మిక్కిలి కష్టము. అక్కడికిని

"పోతేన పాతకపయోధి భయాతురాణాం
పూతేన తేన నవకాంచన కుండలాంశు
వీతేనశీతలయ" ఈ మొదలైన శబ్దాలంకారములఁ

బోకుండఁబట్టిరి. చూడు. పాద. 101ప. కొన్నియెడల మూల మునకు మెఱుఁగుపెట్టిరికూడ - చూడు. ఆర్య 42ప.

ఇంక నర్మాలంకారముల నిందుజ్జగింపఁ బడినదొక్క టియులేదు. "జాతాశీతలశైలతః... కాపి తటినీకారుణ్యపాథో మయీ-ఇట్టి శ్లోకములందలి స్వారస్యము చెడకుండ సముచితముగా ననువదించిరి. వ్యాఖ్యానములేనిచో దురవగాహమగు తావుల వీరు మక్కికిమక్కి వ్రాయక విస్పష్టముగా వ్రాసిరి. 'జలధిద్విగుణితహుతవహ-దిశాదినేశ్వరకళాశ్వినేయదళైః' దీని నిట్లె వ్రాసిన నెందఱు గ్రహింపఁగలరు? చూడు. ఆర్య 96ప. స్పష్టపఱచిరి. ఇట్లే యోగపరమైన శ్లోకముల సొంపుగా ననువదించిరి.

ఏల పెక్కులు? వీరిది తుచ తప్పని యనువాదము. ఈ యైదుశతకములలో మందస్మిత శతకము గట్టిది. అనువాదకుని బట్టి చూచునది. అయినను మనకవిగారు తిన్నఁగ నేగట్టెక్కిరి. కారణము కవిగారికి సంస్కృతమున సమధిక పాండిత్యముంటయే. కనుకనే వీరిశైలి సంస్కృత పద భూయిష్ఠమై యుండును. అందువలనఁ గొన్ని యెడల నన్వయకాఠిన్యము కన్పట్టు చున్నది. ఒక శ్లోకమున కొకపద్యము వ్రాయవలెనన్న దీక్షచే నిదితప్పనిసరి యగుచున్నది. ఇట్టి పవిత్ర గ్రంథమును శర్మగారుద్దండపండితమండల ప్రకాండులైన బ్రహ్మశ్రీ నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రులవారి కంకితమిచ్చిరి.

అన్నగారూ! ఎందుకండీ మీకీ యాయజూకులకన్య. ఇది సుగుణవతియైనను నిరంతర యతిగణపరివేష్టిత. మందస్మిత కటాక్షయైనను బదములు ధ్వనించుచుండును. ఆర్యాస్తుతిపరాయణయైనను బ్రాసములఁ జూపుచుండును. ఈమె భావములకు మీరు మురిసితిరా? పంచవిషయి యని భ్రమపడితిరా?

ఈమె నలుగురి నోళ్లలో నానుంజుమీ. ఇల్లిల్లుందిరుగుంజుమీ. ఈమెను దేశముమీఁదఁ బడకుండ నాపఁగలరా ? అదుపులో నుంచుకోఁగలరా ! మీరెప్పుడో తెల్లవాఱకముందు నాలుగు గంటలకే లేచి జపముచేసికొనుచు జాము ప్రొద్దెక్కిన పిదపఁ గాని యీవలకు రారైతిరి. ఈలోఁగావిశ్వమీటు పోయినను గన్నెత్తి చూడరు. పల్కరు. పోనీ తరువాతనైన గృహకార్య నిమగ్నులగుదురా ? కారు. మడితోనే కూర్చుందురు. మైల పడరు. గడపఁ దాఁటరు. భాష్యమును జూచుకొనుటయో నానాశాస్త్రాది పాఠములు చెప్పుటయో గ్రంథములు రచించు కొనుటయో. ఇంతలో మాధ్యాహ్నికకర్మములు. భోజనము తద నంతరమైన నింటిపని పట్టించుకొనరు. మడితోఁబద్మాసనము వేసికొని కూర్చుందురు. ఇఁకఁబ్రతిఫలమేమాత్రము నొల్లకయే సర్వసమదృష్టితో జాతకములు చూచుట, ప్రశ్నలు చెప్పుట ముహూర్తములు పెట్టుట, లేఖలు వ్రాయుట, కైతలఁదప్పులు చూచుట, వ్యవహారములు చెప్పి చేయించుట, కాచుకొని యున్నవారి యక్కఱలు దీర్చి పంపుట. అబ్బా ! విసుగు విరా మమునులేకుండఁ బ్రొద్దుపుత్తురు. ఇంచుకసేపైన నడుము వాల్పరు. ఎంతప్రొద్దుపోయినఁ గొడుకులు తెచ్చి చూపు నాయవ్యయముల లెక్కలు సరిచూడ వలసినదే. వేలువచ్చిన మోదములేదు. వేలుమునిఁగిన ఖేదములేదు. ఇచ్చినఁ దీసి కొనుట. ఈకున్న నూరకుండుట. ఒంటిపూట మెతుకు. ఇట్టి జ్ఞానవైరాగ్య సంపన్నులకు మీకు నఱువదియవపడిలోఁ గన్య కావలసి వచ్చినదా ?

అన్నగారూ! ఎన్నఁడైన నొక్క బందుగునింటఁ జివ ఱకు వియ్యంకు నింటనైన "అమృతమస్తు" అన్నారా? చెప్పఁడు. గత్యంతరములేక పరగ్రామ మేగినచో నున్ననిన్ని నాళ్లు ఫలాహారమేగాని యన్నపూర్ణ దర్శనము చేసితిరా? ఆయినూత్రైనఁ ద్రికాల సంధ్యావందనము జరుగవలసినదే. ఒక్కసారియైనఁ జతుర్థార్ఘ్య మిచ్చితిరా? ఎంతయసిధారా వ్రతము! ఇట్టి మీకా యాకన్య చెప్పఁడు. అదిగాదు తమ్ముఁడా! ఆకన్యకయే వలచి వచ్చినదనెదరా? మంచిది. కానిండు. ఈకన్య సువర్ణాలంకృత. గుణవంతురాలు. జాతి రీతి నీతి కలది. శయ్యాసౌభాగ్యము-పాకనైపుణినందినది. మంచి వృత్తము కలది. విజ్ఞానవతి. కాన బహుశాస్త్రములలోఁ బండి తుఁడవనియు ననేక గ్రంథములు రచించినవాఁడవనియుఁ దినఁ బెట్టంగలవాఁడవనియు నైష్ఠికుఁడవనియుఁదలంచినదికాబోలు. సరే. శుభమస్తు. శీఘ్రమేవ కార్యసిద్ధిరస్తు.

అయ్యా! శర్మగారూ! కృతార్థుఁడవు కాకేమి?

మ॥ తెనుఁగాకొట్టినపిండి సంస్కృతమొ స్వాధీనంబుచిన్నప్పుడే
ఘనశాస్త్రంబులొజన్మసిద్ధములు సత్కావ్యాళినిర్మించు పా
ల్పొ నినుంబుట్టకమున్నచేరె నిపుడల్లుండో లభిం చెన్సుధీ
వనజాతోద్భవుఁడెంత ధన్యుఁడవు సుబ్రహ్మణ్యవిద్వన్మణీ!

ఇఁకఁ జక్కని స్వతంత్ర కావ్య నిర్మాణమున భారతింగై సేయ మీకాయురారోగ్య భాగ్యముల ననుగ్రహించు గాక యని యీశ్వరుని బ్రార్థించు చున్నాఁడను.

గుంటూరు
20-7-1959

మిన్నికంటి గురునాథశర్మ

శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# కృతి స్వీకృతి

శ్రీమేధామయ దత్తమూర్తి సకలేద్వీశ్వేశ నాగేశ్వర
శ్రీనారాయణ వేంకటేశ వరద శ్రీరామ రంగాంకిత
స్సర్వేషాంహృదయాబ్జపీఠ నిలయస్తత్తన్మతి ప్రేరక
స్సబ్రహ్మణ్యకృతి ప్రదానసమయేకుర్యాద్యశశ్శ్రీయసే 1

భారతిహోమకుండమున జ్వాలలనుండియె దండినే 'కవిం'
గారటిటంబొనర్చ వినికాళికిదాసుఁడు 'వీఁడెవండె ! దం
డా ! దవళింపవే' మననయానవు 'నీవగుదేవ' యన్న నా
ధీరునెమూకఁజేసిన సుశీలబలికె న్మత పంచకంబుగాఁ 2

త్రిసకప్రియమెమైహికంబయిన మాదాంపత్యపున్షష్టి పూ
ర్తిసమీపింపఁగ నున్నయిత్తఁటి సపత్నిందార్చుచుం 'బార్వతిం'
గుసిలింపంగనఁజేయనోయన వితాకుంగొల్పనీ 'మూకఁ' దె
చ్చి సమర్పింపఁగ దక్షిణేశతకుమార్చి న్దక్షిణాంకాంకునిన్ 3

ఆసనుజెందఁగ న్నైకపహాస్యమెునద్రుదు లోకులెల్లరుఁ
శాసనమావిరుద్ధమవుఁజానమటొక్కఁ త చిక్కనే కొనం
గాసరిచేరసత్తతి యుఁక స్భయిసంగతికా కథాగతిఁ
దోసిలియొగ్గనేమనిన దోసమవుంగద తోసిపుచ్చినన్ 4

శ్రీదపరిగ్రహంబులను జెప్పిరికన్నియభూమి విద్దియన్
గాదనకుండఁ గైకొనఁగఁ గావ్యకుమారిక యుగ్రగణ్యగా
నాదటరా.నయాచితమిదొటను శుల్కముఁగోరకుంట మ
ర్యాదయెచూడఁ జుల్కనగనంచుఁగొనంజేయిసాఁచితింగదా 5

కవినన్ను 'స్వర్ణదత్తసౌధ' గతుని స్వనామ్యమణిం దెచ్చి కూ
ర్చునశిష్యుం, డెటువార్ధకంబునను గాసింబెట్టునో! పుట్టువీ
కనుదుస్సాధ్య యనంగనై బిరుసుపాకం, బర్థసాహసిం దా
వని దుర్గాపదబంధ సంధియుత గర్వారంభ సంరంభగన్. 6

తాతకుదగ్గు నేర్పుటకె తారసిలన్నను? నిన్నుఁగన్న ప్రి
జ్ఞాతిశయుం డనన్యగుణగణ్యుఁ డుపాత్తసుసాహితీధనుం
డాతత 'కూర్మ' 'శాంకర' మహా 'లహరీ' సుగమ 'ప్రసన్న' వి
ఖ్యాతబుధేడ్యవాక్ప్రచయుఁడై వినయైక నిధానమౌఁగదా 7

ప్రాంచితవాగ్రిమన్ భమిడిపాటికులీనుఁడు సుబ్బరాయఁడే
ద్దించు చిటాంధ్రసీమలపథిన్నిను మెట్టఁగఁజేసి నెట్టనన్
గొంచెరుదెంచ నియ్యెడ కకుంఠిత సద్గతివౌచుఁ దండ్రియా
ర్జించిన కీర్తికి న్మెఱుఁగుఁజేయఁ గడంగుమి సాధువర్తనన్ 8

ప్రాకటసత్కవిత్వ 'గురుభాగవత' ప్రసృతాచ్ఛకీర్తి, వి
ద్యాకుశలత్వ దేశికపద ప్రకటీకృత షష్టిపూర్తి, క
న్నాకగు మిన్నకంటి గురునాథకవీంద్రునుపోక్తి తోడుగా
న్నాకరమందుఁజేరితి వసంత మహాసుకృత ప్రశస్తిగాన్ 9

అకలంకుండవైఁ డద్వయప్రథితి సర్వాంతర్గతుండౌనొ యూ
సకలేశుండె మదంతరంగ గతుఁడై సంతుష్టి నూత్రార్గొ సం
గి, కృతార్థత్వము నీకునీపితకొసంగెంగాక, యేనవ్వఁడన్!
సుకృతీ! యీవిలనిల్చునందనుక సంశోభిల్ల వర్ధిల్లనౌన్. 10

బందరు. నాదెళ్ల మేధాదక్షిణామూర్తి.



| | |
|---|---|
| కృతిభర్త | కృతికర్త |
| శ్రీ వే. బ్ర. నాదెళ్ల | భమిడిపాటి |
| మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారు | వేంకటసుబ్రహ్మణ్యశర్మ |

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# కృతిసమర్పణము

శ్రీ కాంచీపురి భద్రహర్మ్యమున సుస్మేరాస్యమొప్పన్ గృపా
లోకప్లావిత లోకయై శ్రుతిశిర శ్లోక్య ప్రభావాఢ్యయై
యేకామ్రేశ్వరుతో సతంబెసఁగు సర్వేశాని భద్రాత్మిక
న్శ్రీకామాక్షిఁ భజింతు సంతతము శ్రేయస్సమభ్యర్థినై 1

ఆననమందు వక్షమున నర్ధశరీరమునందు వాణి నం
భోనిధిసంభవ న్గిరిజఁ బూని జగంబుల కెప్పుడున్గృపన్
స్త్రీనరయోగజంబగు స్థితి న్వెలయించెడు వేదమూర్తుల
న్నజ విష్ణు శంకరుల నిర్జరవంద్యులఁ గొల్తు భక్తితోన్ 2

వాణికిఁ గలవాణికి సం
త్రాణన గుణమణికి నిందిరారమణికి శ
ర్వాణికి నభయదపాణికిఁ
బాణుల జోడించి భక్తిఁ బ్రణతులొనర్తున్ 3

దండము లర్పించెద వే
దండాస్యున కంతరాయ తతిహారునకు వి
తాండార్చితునకుఁ గరుణా
మండితునకు భక్తి నే సుమహాత్మ్యునకున్ 4

తెలుఁగున సంస్కృతమ్మున మతిప్రతిభ దగు సత్పురాణవ
క్తల గణనీయుఁడై చు వితతంబగు నైష్ఠికత నైలంగి ని
స్తులకృప నన్నుదిద్దిన విశుద్ధచరిత్రు సుధీకు వేంకటా
చలపతిశాస్త్రి మజ్జనకు సాధ్విని బిచ్చమమాతఁ గొల్చెదన్ 5

శ్రీకాంచీ నగరీశ్వరీ విమల నిస్సీమానుకంపామృతా
సేకంబబ్బ హిమాగమూర్ధ విఘర చ్ఛ్రీజాహ్నవీధారదా
శ్రీకి న్దీటుగ శ్లోకపంచశతి వాసింబల్కి శ్వశ్శ్రేయముం
జేకొన్నట్టి మహాత్ము మూకసుకవి శ్రేష్ఠేంద్రుఁ గొండాడెదన్ 6

అక్షరము లొ్మదలొ్కని దయాంతరులై తగ నన్నుదిద్ది భ
వ్యక్షను కిక్కలైన గురువర్యుల నార్యుల సాధుశీలురన్
దక్షుల నెల్లవిద్యల నతంద్రిల శిష్యులఁ దేర్ప నేర్పుతో
నీక్షితిఁ గ్రాలువిద్వరుల నెంతు నిరంతర మంతరంబునన్ 7

తనదౌనామమె తారకంబయిన మంత్రింబౌట నిద్దాని భూ
ర్యనుకంపన్దగి నాకుఁగూర్చిన సుధీంద్రాగ్రిణ్యు 'నాదెళ్ల' వం
శ్యుని దీవ్యద్ధరితాచ్ఛగోత్రభవు దక్షు న్దక్షిణామూర్తి నా
త్మను నెంతు న్బురుషోత్తమాత్మజుని మేధాదక్షిణామూర్తినిన్ 8

శివు నారాయణుఁ బద్మసంభవు మునిశ్రేష్ఠు న్వసిష్ఠాఖ్యు శ
క్తివిదగ్రిణ్యుఁ బరాశరు న్నిగమశక్తి న్వ్యాసు నాత్మజ్ఞశే
ష్ట విభూషు న్శుకు గౌడపాద యమివారస్వామి గోవిందయో
గివరు న్శంకరపూజ్యపాదముఖుల న్గీర్తింతు గుర్వగ్ర్యులన్ 9

వాకొందు న్నవచోభిలాషినయి నే వాల్మీకిని న్వ్యాసు స
ద్ధీకు న్మాఘునిఁ గాళిదాసు భవభూతి న్భారవి న్భాసవి
ఖ్యాతు న్బాణు మయూరు దండి జయదేవాభిఖ్యు శ్రీహర్షు న
స్తోకప్రాభవ సంస్కృతోక్తిఁ గవిసందోహంబు సద్భక్తితోఁ

పలుకులఁ దేనెలొల్కఁ బ్రతిభా విలస ద్వరభావయుక్తి మం
జులమగుశయ్య గాంగఝురి శుద్ధినిమించెడు ధార నోరిమిన్
దెలుఁగున భారతాదుల వినిర్మితిఁ జేసి యశంబుఁగన్న భ
వ్యులసుకవీంద్రుల న్విబుధయూధసమర్చ్యులఁ గొల్తు నెల్లరన్ 11

మిత్రుఁడు సత్ప్రభువర్ధనుఁ
డత్రిసుఁడు లోకబంధుఁ డగుభాస్కరు లో
కత్రిక భాసక భాసకు
నేత్రముల న్మూసి గూబ నెఱిఁ బాయదొకో ? 12

అని యిష్ట దేవతాప్రా
ర్థనమును గురువందనంబు రాజత్సుకవీ
డ్వినుతియుఁ గుకవినిరాసముఁ
బొనరిచి మూకకవిరచితము న్నతిఁగంటిన్ 13

మూకమహాకవిగ్రథితమున్ రసయుక్త మలంకృయాఢ్య మా
ర్యాకమనీయపాద దరహాస కటాక్షు నుతి ప్రథాలస
చ్ఛ్లోకశతంబు లైదుగల సూరిగణ స్తవనీయ కామితా
నీకదమున్ స్తవంబుఁ గని నేఁ గృతినాటకుఁ దెల్గొనర్చితిన్ 14

శక్తియు శక్తిమంతుఁడును సద్గురువు స్వరమాత్మనా శ్రుతి
ప్రోక్తి 'యభిన్న మే' యనుచు నూఁదివచించుటఁ జేసి యాదరో
ద్రిక్త గురూపదేశపు గరీయతఁ జేసియె బ్రహ్మమౌట య
న్మ్యుక్తినిఁ బొందనౌట గురుమూర్తిపదాబ్జమె తారకంబగున్ 15

పరమర్షి ప్రకర రాగుల్యుఁడౌ హారితు సద్భవ్యాచ్ఛగోత్రంబున
ద్ధరణీదేవులు వైదికాహ్వాయముతో ద్రైవారు వెల్నాఁడునాఁ
గ రస న్స్వాఖయొకండు పావనత గంగన్మించె "నాదెళ్ల"నా
ధరలోఁ దా నుపనామముంగనిన విద్వద్వంశ మందొప్పెడిన్ 16

సీతారామవరాగ్రహారమనఁగాఁ జెన్నొందు శ్రీకృష్ణవే
ణీతీరంబున వీడొకం డటబుధానీకేడ్య సద్వర్తన
స్థితు 'ల్నాదెళ'వంశ్య భూసురులు వాసి న్భవ్యవిద్యాకులు
జ్జ్యోతిశ్శాస్త్రవిదగ్ర్యులొప్పిరివదాన్యుల్సత్తపస్వ్యగ్రణుల్ 17

నరసింహభట్టునా వఱలె నాకులమందు
ధాతమై వేదవిద్యాశ్రిత గణ్యుఁ
డాతనిపుత్త్రుఁడై ఖ్యాతి నాఘనుఁబోలె;
నాగేశ్వరాభిధా నాగమజ్ఞుఁ
డాసుధీవరునకు వాసి వేంకటసంజ్ఞి
కుండు దైవజ్ఞవంద్యుండు తనయుఁ
డమ్మహానిధికి విత్త్వమ్మునం దెనయాచు
సుతుఁడు సుబ్రహ్మణ్య కృతిరచించె॥

సుగుణఖనియును విద్యాధన గరిమఁదగు
సప్రతిగ్రహుఁ డాతఁ డిద్ధప్రతిభునిఁ
గామయార్యుని సకలాభిరాము నలఘు
సుమతిని వదాన్యుఁ బుత్త్రరత్నమును బడసి 18

అనువృత్తిందగు సాధ్విఁగూడి యనిశంబామ్నాయ సంప్రోక్తరీ
తిని వర్తించెడు సవ్వదాన్యునకు సద్ధీమంతులౌ మూగు రీ
శునకు న్మన్నిభవక్త్రషణ్ముఖ గణస్తోమేశులట్లొప్ప స
త్తనయుల్సన్నయు లుద్భవించిరి ప్రమోదంబందమాతాపితల్ 19

శ్రీమ నారాయణశాస్త్రివర్యులును సుబ్రహ్మణ్యులు న్సూర్యపుషో
త్తముఁడ న్సార్థక నామధేయుఁడగు విద్వద్వర్యుఁ డస్రాంతహృ
త్కమలాసాదిత సర్వదుఃఖహర మేధాదక్షిణామూర్తి పా
దమణిద్వంద్వుఁడు ద్వంద్వదూరుఁడు బ్రశస్తబ్రహ్మనిష్ణాతుఁడున్

ఆమహితుండు శైశవమునందె సుధీకులు మెచ్చ నగ్రసే
వా మహితాదరుండగుచు వాసిగడించెఁ గ్రమంబుగా సుమే
ధామణిభూషుఁడై కలల దార్ఢ్యము నంచితవర్తనంబు స
త్త్యామలమంజులోక్తి విబుధాళివిధేయత దైవభక్తినిన్ 21

చిఱునగవొప్పఁగా నమలశేముషి నాతఁ డశేషభాషల
న్సురుచిర పాండితీగరిమ శోభిలి తెల్గున సంస్కృతంబున
న్సరసకవిత్వము న్లలితశయ్యను గీర్లనాంఘ్రికంజ నూ
పుర కలకింకిణీధ్వనులఁ బోలి నుడు ల్నెగడ న్రచించెడున్ 22

పలుకన్నక్యమె పూరుషోత్తమ కవీట్పాండిత్యపుంజేవ న
ద్యాలఘుం డాంధ్రమునం జతుర్విధములన్ హార్షంబు నెంతేసుధీ
కులువొంద న్స్మదురీతిఁ గోశములఁ బెక్కుల్నాటకిన్నించమం
జులశయ్యా న్విరచించి మించెఁ బ్రతిభాస్ఫూర్తి న్ధరిత్రీస్థలిన్ 23

హిందీ భాషను నాటకంబుల సమగ్ర్యజ ద్రసంబాగరి
న్నందీవ్య ద్యమకంబు లర్థవరభూషాభ్రాజమానంబులౌ
చుం దీపింపఁగ ముప్పదింటికిఁ బయి న్సారుల్నుతింపంగనా
నందంబంది రచించె నారవినిశానాథంబుగా నిల్వఁగన్ 24

కౌండిన్యామలగోత్రులై కలలవిఖ్యాతి న్గడుంగాంచి వి
త్కాండాగ్రియులు వైదిక ద్విజులు సత్యస్థేము లొప్పారి రు
ద్దండు ల్జమ్మలమడ్క 'య న్నిలయవ్యాద్యప్రఖ్యచేఁ గ్రాలు వా
రండపో ద్భవవాహ గోపవరయుగ్యాంఘ్ర్యంబుజారాధకుల్ 25

వారలలో శ్రీలక్ష్మీ
నారాయణసూరి శ్రుతిగణజ్ఞుఁ డెసఁగెఁ గో
దూరనునూరను రాజ్యర
మా రామామణి సుధీసమంచిత సతిగాన్ 26

ఆదంపతు లెంతయుస
మ్మోదంబు నెడందనందఁ బుత్త్రిక సర్వో
ట్పాదాంబుజషట్పద ల
క్ష్మీదయితం బోలి పొడమె సిర కిరవౌచున్ 27

ము_క్తికాంతాభిధాన సంయు_క్త సర్వ
సుగుణమౌ_క్తిక నికర విశుద్ధబుద్ధి
యంబికాపాద కమలార్చనంబు నెఱపు
భవ్య సౌభాగ్యనిలయ సం_స్తవ్యచరిత. 28
ఆదర్శ భూతులై తగు
నాదంపతు లట్టిపట్టి నతుల పేర్మి
న్నాదుచు దిద్దఁగ సన్మే
ధాదీ_ప్తియు మేనిచెన్నుఁ దనర న్సతికిన్ 29
హారితసగోత్రుఁడై యెసఁగు సత్పురుషో_త్తముఁ డన్నసత్కవీ
శ్వరునకు సాంబపాద జలజద్వయ సంతతస_క్త సన్మనోం
బురుహునకు న్గలానికర పూర్ణునకు న్సకలానవద్య భా
సురగుణ ము_క్తికాంత సుత శుద్ధమనస్క నొసంగి రర్మిలిన్ 30
శివుసామేనినిఁ గొన్న గౌరిని రమాసీమంతినిన్ స్వీయభ
_ర్తృవరోరస్స్థలనిష్ఠ మాటల నె తృ_ప్తి న్భ_ర్తకున్గూర్చు చె
ప్పు విచిత్రక్రమమై చరించు పలుకుంబోటి న్సతీత్వంబునం
దు వెసన్మించినము_క్తికాంతసుమతిస్తోమాగ్ర్య నెన్నెంచనౌ? 31
ఉ_త్తమయోగియైన పురుషో_త్తమసత్కవి ము_క్తికాంత దా
పొత్తున గేహిశీర్ష వరభూషణుఁడై నిజధర్మయు_క్తి సం
పత్తునమించి యీవిఁదగి పట్టక దేనిఁ బరోపకారిత
స్వో_త్తృతఁ దాల్మి కల్మినిఁ బవిత్రితమించెమనీషులెంచఁగన్ 32
ఆమహనీయువ_ర్తన మదద్భుత మాశ్రిత నశ్రిమమ్ముగా
మోమున స్మేర మొప్పు లసముం గన కేశవ్రిథ బోధఁ దేర్చి వి
ద్గ్రామణి సల్పుఁగొల్పు వితతమ్మగు మోదము శాంతిదాంతి ని
ష్ఠామత యీసు లేమిబుధసంగముసత్యముఁదత్స్వభావముల్ 33

తనకుం బేర్మి గురూత్తముం డిడిన మేధాదక్షిణామూర్తిపా
వనమంత్రంబు జపించి సిద్ధిఁగని దివ్యత్తత్స్వరూపానుసం
ధి నివిష్టాంతరుఁడై యజస్రమునుసందీపించు నాగేహిన
య్యాన శ్రాద్దైవమె పత్నియన్ముకురమందొప్పం దనూజన్ముఁడై 34
అనఘుం డక్కవివర్యుఁ డాత్మసతియా నాముక్తికాంతాసతీ
జనతా శేఖరదా సమీపమున భాస్వత్తేజుఁడౌ నాత్మనం
దను నీక్షించి ముదంబుతో నిడియె 'మేధాదక్షిణామూర్తి' యం
చును నన్వర్థసమాఖ్య సూనృతవచస్కుండౌచుఁ దానర్మిలిన్ 35
శ్రీమత న్వృద్ధిని శుక్లపక్షమున నక్షత్రాధిపుండట్లు చో
క్కముతో సత్కళలన్గమించి పితృభక్తశ్రేష్ఠుఁడై శేముషీ
సముపేతుండయి తల్లిదండ్రుల సువాత్సల్యంపుటిల్లౌచు ను
త్తమత న్సంస్కృతినందియొప్పెఁగడు మేధాదక్షిణామూర్తి తాఁ
పసుమర్త్యాఖ్య సదన్వయ ప్రభవయా పార్వత్యభిఖ్యాసము
ల్లసిత న్సాధ్వితకిక్కయైన సుగుణాలంకార సౌభాగ్య భా
గ్యసమేత న్పతిసేవనాభిరత వాగ్గౌరీరమార్చానిశా
భ్యసనన్పత్నిఁగనందియెంతయును గేహ్యాగ్ర్యుఁడై యొప్పెఁదాఁ
పితృపాదుల్కృప దిద్దఁగా నెనసెఁదాఁ బిన్నప్పుడే పాండితీ
ధృతినిన్సంస్కృతమందునాంధ్రమునహిందీయందునాంగ్లంబునం
జతురత్వంబు వహించె భవ్యకవితా చార్వంగిని న్సద్రసాం
చిత కోశంబుల విజ్ఞతానన రచించెన్ స్ఫూర్తి దీపింపఁగన్ 38
అకలంకత్వము సత్యసక్తత విధేయత్వంబు విద్వజ్జన
ప్రకరంబందుఁ బరోపకారిత సుధీరత్వంబు స్వాచారపా
లకశీలంబును ధర్మతత్పరత లౌల్యత్యాగము న్నిత్యతృ
ప్తికనత్వంబు సదాశివాభిరతి యాధీమంతునందొప్పెడున్

సత్కర్మనిష్ఠ నశ్రాంతంబుదీపించు
సత్పాత్రదాన నిశ్చలత నలరు
పితృదేవగురుభక్తి యుతచిత్తుఁడై శ్రీలు
సుకలానిచయ సముత్సుకత వఱలు
నిరతంబు సత్కృత్య నియతిని రాణించు
నప్రతిగ్రహదీక్ష ననిశ మెసఁగు
నవిలంబకారియై యనలసత న్మించు
నాశ్రయం బిడు సముపాశ్రితులకు
విధుల నేమఱఁ డెప్పుడు నబుధులఁగూడఁ
డంచితాత్మానలోక సమంచితుఁడగు
ధన్య నాఁడెల్ల పూరుషోత్తమకవీంద్ర
పుత్త్రమణియైన దక్షిణామూర్తి బుధుఁడు

గురుఁడై తండ్రియె పూరుషోత్తమకవీ ట్కోటీరభూషుండు స
త్కరుణ న్దిద్దఁగ వన్నె నెన్నఁగను మేధాదక్షిణామూర్తి శా
స్త్రరసజ్ఞప్రవరత్వము న్సుమతి నైశిత్యంబు స్వాస్తిక్యపుం
గరిమంబు న్వినుతింపఁగా వశమె చక్కన్ జాలి నాబోంట్లకున్
ఎనసెంబట్టము నాతఁడాంగ్లమునఁ దానెన్నం గలాశాలలో
గణితజ్ఞుండయిమించె జ్యోతిషమునం గాంచెం బటుత్వంబుఁ జెం
దె ననూనప్రతిభ న్గవిత్వమున సందీపించె సంపత్సమృ
ద్ధిని సత్పుత్త్రులఁ బౌత్త్రులన్బడసె ధాత్రిన్పుణ్యగేహాగ్ర్యుఁడై
పార్వత్యభిఖ్యా విభాసినియగా ధర్మ
పత్ని యందున వఱశరత్నములనఁ
దనరుసూనులను మేధాదక్షిణామూర్తి
విబుధుండు ముగుర నుర్వినిఁబడసెను

కృష్ణాభిధాన రోచిష్ణుఁడౌ గుణిమణి
పూరుషోత్తమసంజ్ఞ మీఱుసుమతి
జిహ్మేతరమతి సుబ్రహ్మణ్యనాముఁడు
యమ్. ఎ; యల్. యల్. బి; విద్యాధికుండు
రాజ్యలక్ష్మ్యభిధ సరస్వతీసంజ్ఞక
సావిత్రి యనుపేర శారదాఖ్యఁ
బుత్త్రికారత్నములను సద్బుద్ధిమతుల
స్వానురూపవరోపేత లైనసతులఁ
భాసురాయురరోగత్వభాగ్యవిభవ
భవ్యసంతతి నుభయులుఁ బరఁగుచుండ్రి 43

శ్రీగురుదత్తసౌధము విశిష్టము శిష్టులు మెచ్చ సల్పి స
త్త్యాగముతోడ గోష్ఠినిఁ బ్రతుష్టి నొనర్చుచు శారదారమా
భోగ మెసంగుహర్మ్యమునఁ బుత్త్రులఁ బౌత్త్రులఁగూడిపూర్ణము
ద్యోగముతో నెసంగుత బుధుండగు సద్గురువర్యుఁ డెప్పుడున్ 44

రచియించె దివ్యోక్తిఁ బ్రార్థనశ్లోకాళి
నష్టకమాల నుత్కృష్టముగను
ఆత్రేయగురుని శ్రోత్రానందకరనుతి
లలితవాక్కులనా విలాసియగుచు
వేమయోగీయంబు విమలోక్తి నుత్తమ
జీవయాత్రయు దత్తదేవుచరిత
పరమహంసప్రబోధ రసాంచితగ్రంథ
మలఘుదత్తపురాణ మనెడుకోశ

తల్లజము ద త్తభావ సుధారసంబు
సు త్తమ సునీతిభాస్కరా ఖ్యో త్తమకృతి
నాంధ్ర సుకవిప్రశంసయు హాలికనుతి
ము క్తికాంతామణీ శతకో క్తి మఱియు 45

దశమగ్రహ తారావళి
విశద యశోవిహృతి సకలవిద్వత్కవు ల
య్యుశనుం డీతండనఁగా
యశమలర రచించెఁదెల్గు నందీతఁడొగిన్ 46

విదుషీమతల్లి సాధ్వీవతంసయునైన
రాజ్యలక్ష్మ్యంబభర్త్రి జ్య గాఁగ
స్థిరయశంబెనయ నీశ్వరతృప్తి కాలయం
బమరింపఁ దనయూరి కమరఁగొమరు
జామాతయును గవీశ్వరుఁడైన పూరుషో
త్తమబుధుఁ బ్రేరేచి తనవగలిడ
వానిఁ గాదనక నైఁబూని సత్కార్య సా
ధనకుఁగా దీక్షఁగైకొని రయమున

నమ్మహితుఁ డెంతయుం బ్రమోదమ్ముతోడ
గ్రామవాసులదైన ప్రార్థనము నెనసి
శ్రమమనక దీవిసీమ నెసంగునట్టి
దైన 'కోడూరి' నెడునూర నలరిచె గుడి 47

సోమేశ్వరలింగంబును
నామహితుఁ డనూనభక్తి నంగనతోడ
న్గామంబు లర్థులందఁగ
నామిహిర శశాంకతార మలరన్నిలిపెన్ 48

సోమేశ్వరీయనుతి యనఁ
గా మహి రహియించుకృతినిఁ గావించి కవీ
డ్గ్రామణి పురుషోత్తముఁడా
సోముని సోమధరుఁగొలుచుచు న్గడునలరెన్ 49

అనుదివసంబు నర్చనకునై తగువృత్తినిఁగూర్చి పర్వమం
దనువగుసేవలజ్జరుపు చబ్దమునందగు నుత్సవంబుఁ దా
ననుఁగులతోఁ గుటుంబయుతుఁడై చని సల్పఁగఁజేసి పూర్ణతు
ష్టి నెనసెఁ బూరుషోత్తమవిశేషవిదుండు మనీషులెన్నఁగన్ 50

తనదుపితృపాదుఁబోలె మేధావిభాసి
దక్షిణామూర్తిశాస్త్రి సద్భక్తితోడ
భవ్యకల్యాణమహము సంపదకొలంది
సలిపె సలుపుచున్నాఁడు సలుపఁగలఁడు 51

అట్టిమేధావివరుఁడైన యనఘమూర్తి
పూత 'నాదెళ్ల' వంశసంభూతుఁడైన
దక్షిణామూర్తిశాస్త్రి విద్వరుఁడు గురుఁడు
మత్కృతికి నేతయయ్యె మామక సుకృతిత 52

మామకములైన యోగ
క్షేమము లనిశంబుఁగోరు శ్రీమంతుఁడు మే
ధామహిత దక్షిణాంగుఁడు
మామక కృతినేతయగుట మద్భాగ్యమె కా 53

కృతిభర్తకుఁ గృతికర్తకు
క్షితిఁ జదివిన వినినవారికిన్ శ్రేయస్సం
తతినిడు శ్రీకామాక్షీ
స్తుతి విని చెద గురునిదయ విశుద్ధినెనయఁగన్ 54

కృతికన్యంగొను మోగురూత్తమ యసంకీర్ణాచ్ఛ వర్ణాఢ్య నం
చితసద్వృత్త మహేశ్వరీపద సమాశ్లిష్టాంతర న్నాధ్వాలం
కృతిరమ్య న్నువినీతఁ బూత శుభదాత్రి న్భవ్యసౌభాగ్యభా
సిత బ్రహ్మాత్మక సత్కృపాంతరవిభాసీ వాసినింగాంచఁగన్ 55

## షష్ఠ్యంతములు

శ్రీమత్పురుషోత్తమకవి
సోమతనూజాతునకు విశుద్ధతరమన
స్తామరసాంతఃపూజిత
సోమాంఘ్రిబ్జాతునకు నయోపేతునకున్ 56

త్రయ్యంతసారవేదికి
న్యాయ్యపథానుస్మృతిరతికి నవరసయుతస
చ్ఛయ్యావిలసత్కవితా
స్థాయ్యమల వచఃప్రతుష్ట సత్కవి తతికిన్ 57

విశ్వాసపాత్రునకు నవి
నశ్వర చిద్రూపి దక్షిణామూర్తి కృపా
త్తశ్శ్రేయసతతికిఁ గ
వీశ్వరునకుఁ బార్వతీ సతీశానునకున్ 58

ధన్యునకు సుకవిచయము
ర్థన్యునకు వదాన్యునకు సదాశివపదప
ద్మన్యస్తచిత్తునకు వే
దన్యాయాచరణునకు సుధాహృదయునకున్ 59

అనుకంపానిధికినిఁ బా
వన తర 'నాదెళ్ల' వంశ వారిధిపూర్ణేం
దున కకలంక సుమేధా
ధనునకు శ్రీదక్షిణాస్య తత్త్వజ్ఞునకున్ 60

శ్రీదత్తాత్రేయ దయా
సాదితరుచిరాష్టవిభవ సంతుష్టునకున్
నాదెళ్ల వంశ్యునకు మే
ధాదక్షిణమూర్తి కస్మదాచార్యునకున్

సమర్పితంబుగా మూకమహాకవికృత కామాక్షీ పంచశతి నాం
ధ్రంబున 'శ్రీకామాక్షీస్తుతి' నామంబున ననువదింతు.

శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# శ్రీ కామాక్షీ స్తుతి

## పాదశతకము

శ్రీమన్నాదెళ కుల దు
గ్ధామేయాంభోధి పృథు సుధాంశూ! వినుమా!
శ్రీమేధాదక్షిణమూ
ర్తీ! మంజులకామకోటి దివ్యనుతి గురూ!

కంతుద్విట్ప్రణయాఢ్య! నీమహిమమార్గంబు ల్దగన్దెల్పఁగా
నెంతో యత్న మొనర్చియున్ప్రభువుతా నేవ్వండు? శ్రీకాంచిన
త్యంతంబు న్విహరింపఁగా రసికవౌ నమ్మా! యుమా! యైన మ
త్స్వాంతీయంబువిపాకమే నను నిటుల్ వాగించు నీప న్నుతిన్ 1

శ్రీకామాక్షి! భవత్పదాంశువులదౌ సింధూరవర్ణంబు స్వ
ర్లోకోద్యాన మహీజపల్లవరుచిన్ రోధించుగాంతెత్తి; య
ట్లే కల్యార్కమహశ్చయంబునకుఁదా నే యొజ్జయౌ మున్నుబం
ధూకోరుస్తబకాళిగెల్చు; రహి నందున్సంతతం బంతటన్.

అంచ నెలందు లందముగు యానము నేర్వఁగ సద్గురుండు; ని
ష్కించన సంచయంబు బ్రతికింపఁగఁ జెంగటి కల్పకంబు; రో
ధించెడునట్టి పెన్నిరుల ధిక్కృతిఁ జేసి రహింప దక్షమౌ
కాంచిపురీశ్వరీచరణ కంజము నీజన మందఁగోరెడున్.

మ్రొక్కెడు వేల్పుఁదొయ్యలుల మూకల పాపటలందు సింధురం
బొక్క యనంగనై కవిపయోజ చయోద్యదినోరుశోభమై
నిక్కపువిద్రుమబోటి కొను నిద్దపుఁ గెంజిగి రైకయై యనీ
దృక్కయి కామనేత్రదగు దివ్యపదాంబుజకాంతి యొప్పెడున్ 4

ప్రణయంపుంగలహంబుచే వెఱపులోఁబట్టంగ వే నమ్రుఁడౌ
ఫణిరాడ్భూషజటాళిగేహియగునా ప్రాలేయభానుండు ధా
రుణిసాంధ్యంబగు వన్నె వేనివగు బల్ రోచిస్సుల న్బొందె? స
న్మణికామాక్షి పదారవిందములఁ దిన్న న్మామనం బానుతన్.

తమయంతన్బొడసూపు ప్రానుడులె సౌధశ్రేష్ఠముల్గా; సురా
ఘమణిస్ఫూర్జిత సత్కిరీటతతియే కమ్రార్చ్యపీఠంబుగాఁ
గమలాసాదికులెల్ల దాసులుగ నెక్కాలంబు దీపించు నా
దిమ కామాక్షిపదంబులం దెపుడు నర్థి న్మన్మనం బొప్పుతన్.

అరవిందంబులనైన వన్నెలకు దైన్యం బబ్బఁగాఁ జేయుచున్
హరిదంతంబుల రాగము న్నఖచయాంశ్వర్ధేందుచేఁ గూర్చుచు
న్ధరలో సత్కవిచిత్తకైరవకన త్త్వంపుం బనిం గొల్పుచు
న్వరకాంచీనగరీశ్వరీ చరణశోభా సంధ్య మించు న్గదుర్.

స్మితముఖుఁడౌచు నాత్రిపురజేత వినమ్రిత మ్రోలఁదోఁప శిం
జితముల నేమియోమధురశీలతఁ బల్కెడు ప్రౌఢితో సమ
న్వితయగు సద్వయస్యయటు ప్రేమజమౌ కలహాంకురంబుఁ బెం
జతురత వ్రీలఁజేయు గిరిజా పదకంజ యుగి న్భజించెదన్. 8

తుమ్మెదలెన్నఁ గ్రమ్మ నుదితుండగు భానుని దీప్తి నెఱ్ఱనై
చిమ్ము మరందమొప్ప వికసించెడు తమ్ములతోడ వేలుపుం
గొమ్మలయూఁగు ముంగురులఁగూడి యలక్తక లిప్తమై రఁగం
భమ్ముల నొప్పు గొందగు పాదయుగంబు వహించు బంధుతన్ 9

సముదగ్రంబు రజంబుగల్గి యరజస్కస్వాంత నిష్ణాతమా
ను; మహారక్తిమ నొప్పి పొందనగు నెందున్ స్వా విరక్తాళికే
క్రమత న్మందత నూని మందులకు నెక్కాలంబున న్బొందఁగా
దమితాశ్చర్యరసంబుఁ గొల్పెడిని కామాక్ష్యంఘ్రియుగ్మంబహో!

కామాక్షీ! ననుఁగన్నతల్లి! జగము న్గాపాడఁగా సల్పెఁబె
న్నిమంబూని తపంబు నీదు పదపానీయోద్భవద్వంద్వ మొ
ప్పా మంజీరయుగంపుఁ గెంపుల యనూనాంశుల్ జడ ల్గట్ట శో
భా మానాచ్ఛ నఖప్రభామరధునీ పాథంబుల న్మగ్ని తాన్.

మంజీరద్వయ శింజితంబుల నభీమానోక్తుల న్బల్కుచు
న్పుంజీభూత మహస్సుచే నరుణిమంబుం బొంది పాపఘ్నమై
మంజుత్వంబున కిక్కయైన పదపద్మద్వంద్వము న్నాతలన్
రంజింప న్దరిటెయుంచి సల్పుతఁ బవిత్రత్వంబుఁ గామాక్షి తాన్.

అమ్మా! శాంకరి! నీదు కాల్గవ తమోవ్యామోహసంఘమ్ము సాం
ద్రిమ్ము న్దుర్భవమిచ్చు మామకము నంతస్స్వాంతగాఁ ద్రుంచి భ
ద్రిమ్ము న్గూర్చుత; దేనిలాక్షదగు నుద్యద్బిందుశోభా ప్రసా
రమ్ము న్బూనుటఁ జంద్రరేఖ శివమూర్ధస్థంబు శోణాంకమా 13

మముసంపూతులనల్పుఁగాత నెస నమ్మా! పాటలాభమ్ముల
క్ష్చ్యములోనీ యరకాలి రేణువులు; శర్వార్ధాంగి! కామాక్షి! శి
క్షమున న్నైనికణంబుఁబొందుటకు హర్షంబొప్ప శ్రీశారదా
క్కా మెయి న్జేయుచు నేను నేనను చుఁబోం కంబుగాను చంద్రస్థితిన్ 14

గోళ్ళులనిగ్గులెల్ల నెసఁగుం గన బెగ్గుపక్కాదండలై
పాళిగ మొగ్రిక్కా వేలుపుల భామల పెన్గచ మేఘసంఘమం
దోలిఁ గనత్కదంబముల కుద్దిగనై ప్రసరించు నీ పదా
బ్జాల మరీచు లోశివుని భామిని! త్రోల్కరికొగ్రిమ్మెఱుంగులా.

రాగంబున్గని ప్రత్యహంబెసఁగు నా రాజవమందప్ల ద్వే
షాగస్సున్వహియించెడు; న్విబుధమూర్ధాగ్రహము న్వల్పి యెం
తే గాటంబగు నీపదాబ్జమదియె జెల్లప్పుడు న్మ్రొక్కన
త్యాగంబు న్గరుణించి ముక్తిరమ నింపున్? దెల్పుమీ శాంకరీ.

కామాక్షీ! వికసజ్జపాకుసుమ రక్తంబై పృథుజ్ఞాన ప
ద్మామోదావహమై జగజ్జడిమ మాన్ప న్దక్షమై సంతమ
స్తోమఘ్నంబగు నీపదాంబురుహ బంధుస్ఫూర్తి మద్ధృత్ప్రరో
భూమీభృచ్ఛిరమెక్కి బొట్టగుచు నొప్పుంగావుత న్వేగమే.

కె మోమ్మంబచరింతు రత్నకటకాగ్రి స్ఫూర్జదిందోప్రపల
స్తోమాభాబ్ధిని సాఁగుగోళ్ళుల పసందుల్ నుద్దొలై పాటి తె
ల్పామాడ్కిన్ప్రసరింపఁగా నవిరతం బౌర్వాగ్ని హేతూహము
న్దాముస్సల్పెదు కామదృక్పదపద్మస్థారుణ స్ఫూర్తికిన్. 18

శివ! కామాక్షి! త్వదంఘ్రిదీధితులు నిస్సీమాంధ్యరూపంబులో
జవత న్బాశతనందుఁజొచ్చి దివసేశ త్వంబు నాహ్వాత్సరో
జ వనంబందునఁ బొందు; భవ్యకవితాంచద్రీతుల న్వాహినీ
నివహంబందు నభోఖ్యమాసముగ సందీపించు నశ్రాంతముఁ 19

శగుశుభ్రత్వాంతమున న్విపక్షమయి నేత్రింబట్లు సద్వృత్తయు
క్తగళోపాస్యత రమ్యమైనద్విజ సంతానంబుచే మోవిమై
నగు జుష్టంబయి చన్నుదోయియట్లు ముక్తాళ్యాశ్రితంబొందలం
చఁగఁగామాక్షి యొన స్తుతిత నతిరతు న్సల్పు నీయంఘ్రికిన్

ప్రాక్కఁగవంగు నాబుధవిభుప్రియగా తనయుంతసూఁకు పెం
జిక్కని శేఁషియన్నిలువచే శబలంబును గోష్ఠిదైన పెన్
పుక్కను పాల సంప్రియమనోజ్ఞపయస్సున విద్రుమచ్ఛవి
న్నెక్కొనఁజేయు శంభు గృహిణీ పదవారిరుహద్వయి ప్రభల్.

త్రిజగత్తాప నివారిణీ! స్మర విరోధిప్రేయసీ! దుర్భరో
ర్వృజినానూనవిశోష్ఠ తాపమునువారింపంగదక్షంబుఁ బ
ద్మజముఖ్యాగ్ర్యమునో త్వదీయ పదపద్మద్వంద్వ సేవామృతం
బు జనిత్రీ! క్షణమాత్రమేని యెపుడేఁ బొందంగలానో? కదే.

కామించున్నతతంబు దేనిదగు రాగం బందఁగా సాంధ్యమా
ధామం; బైందవి దేనిగోళులరుచి న్బాఁ గోరెడున్గాంతి; యెం
దో మేల్మార్దవ పాకము న్గిసలయం బందంగయత్నించు; నా
కామాక్షీ చరణద్వయం బునుతు మే కాలంబుఁ జేతంబునన్. 23

'నేదం నేద' మటంచు నిజ్జగము నెంతేని న్గమాగ్రింబటు
ల్గా దీపించుమనంబు శాస్త్రములఁజక్క న్గౌశలింగన్నవి
ద్యాదీవ్యద్యతిరాజిచే విడిచి మృగ్యంబైన నీపాదకం
జోదారాచ్ఛమహత్త్వ మంబ తెగుఁదా నొక్కండెపై నంతకున్,

కామాక్షీ ! మునిమానసంబు కడు వేడ్కన్వ్యస్త్రపీయూషధా
రా మాన్యహ్రదమందుఁగ్రుంకి పరిశుభ్రంబై పవిత్రామృత
యామేయార్హ రసాధ్యమై వెదకుఁ జిద్వ్యాదోధిమధ్యస్థమై
*భూమిన్పన్నగయా త్వదంఘ్రిమణి నెప్పున్సర్వము న్వీడితాఁ,*

పురుమోహాంబునఁబుట్టు పెంధమముచేఁ బూర్ణంబునాచిత్తమం
దిరమందో జననీ ! వెలుంగులను నాదిత్యాయుతంబు న్దిర
స్కరణంబందఁగఁ గ్రిమ్మ చీఁకటులఁద్రుంగంజేయఁగా నో భవ
చ్చరణంబన్మణిదీప మొక్కత్రుటితాసాన్నిధ్యమున్సల్పుతన్.

నఖరరుచి న్బృధవ్రిజమనం బటుకూడుచు హంసకోక్తుల
న్ముఖరితమై సురాపగను బోలుచుఁ గెంపులసొంపుతో నహ
ర్ముఖమటుసల్పు నంబరశిరోజుని కామినిదైన నీరుచు
ట్సఖమగు పాదయుగ్మము వెసన్ స్ఫురియించుతమన్మనంబునన్.

సమ్మోహంబునడంచుఁ జల్లపఱచు న్సద్భక్తుల న్వే యదృ
శ్యమ్మొందాఁబ్రికటించుఁగన్నులకుఁగామాక్షీ ! భవత్పాదయు
గ్మమ్మెన్నిష్టున్ ; గరినామరౌఘమకుటాగ్రిస్పర్శనో శీతభూ
ధ్రిమ్మొందాతటపాళినంటుటనో యుక్తవ్రాతసంసృష్టినో 28

ఘ్రాతంబుల్గిరిజా ! స్వభావమృదులంబుల్నీపదంబు ల్పరా
భూతిన్నల్పఁగభీతిమైఁ జని ద్విజవ్యూహంబు సేవింప న
బ్జాతంబుల్మృదులప్రవాళములునిచ్చల్పూనుఁజుమ్మీవన
స్థాత్మత్వవ్రతనిష్ఠ నిక్కముగ నశ్రాంతంబుఁ గామేశ్వరీ ! 29

పెందడికెల్లొహంసచయ వీక్ష్యమునై జడతన్దొలంచి యె
ప్పుందొసఁగందకున్న విధుభూషణురాణి పదాబ్జ యుగ్మము
ర్వ్యందగి నవ్వుచుండెడి నవేలత హంసలకందనై జడా
లిం దిరముండి దోషసుమలీమసమైన సరోజయుగ్మమున్.

కరిమ్మెడు పెఁదమమ్మల నఖచ్ఛవిచంద్రికల న్దొలంచుట
న్సమ్మదమిమ్ముగా విబుధ సంతతికిచ్చుట భూషయాటఁబ
ద్మమ్ములదై నలచ్చి కవమానముఁ గూర్చుట నీపదద్వయా
స్థమ్ము విభాసమమ్మ ! వసుధ న్బ్రకటించెదుఁ జాంద్రిదాదశన్.

లలితనఖచ్ఛవీయధవళత్వముఁజేసియుఁ గాలిదమ్ములం
దల రెడు కెంజిగి న్ద్రిజగదంబ ! మహేశ్వరి ! నీకు మ్రొక్కు వే
ల్పుల నసబోండ్ల వేసలులలోఁదగఁగల్పసుమాళియు న్గదం
బ లసితసూనముల్పొసఁగు మాలలయందముచిందు నెంతయున్

పరనఖరాంశు దుగ్ధపురు వారిధి శుద్ధజలాంతరంబున
న్వాలుచు రేకలై పాదలు వారిరుహంబు దరంబుఁజక్రము
న్నెఱిఁగొనిమాత్స్యరూపమును నెక్కొని తానెనలేని మేల్రమ
న్గరమువహించిమించు శివకామినిదాపదమ న్ద్రిధాముఁడున్ 33

గోళులనిగ్గులన్నిరుల గుత్తుల నెత్తి పిశంగకస్వకాం
శ్వాళినిఁ గ్రోంజిగుల్లఁదగు సందముఁ జిందఁగఁ జేయుచున్నమ
స్తాలఘుసత్ఫలంబులిడునై సదవాప్యమునై యెసఁగు నీ
కాలిని దేవభూరుహముగా హిమభూధరపుత్రి! యెంచెదన్ 34

సుమతుల చిత్తవేదిని విశుద్ధభవత్పదయుగ్మ గొప్ప జ్ఞా
నమనెడు వహ్నిఁ బ్రజ్వరిల నెప్పుడు ఘుల్లలల న్వషట్కృతు
ల్గమినొనరించుచున్న యతిఁదా జననీ! గిరిరాట్కుమారి! యో
ర్మి మెఱయ వెల్వఁగ రమ్యలహరీ సుహవిస్సులఁ గ్రాలు నందొగిన్.

వరమణి నూపురంబుల రవంబులచే ననువృష్టపించి స
త్తెఱఁగుల నచ్ఛమానఖరదీప్తిమయంబగు బూదిసూఁది నే
ర్పరితన మొప్ప నాశ్రితులఁ బట్టిన యా మహాతాపిశాచి నీ
శ్వరతరుణీ! హరించెడు భవత్పదమాంత్రికుఁ డిజ్జగంబునన్.

పరమజ్ఞాన విఘూదయంబగుచుఁ బెన్పాపాంధకారంబు మ్రిం
ద రహిన్ బల్లను రాగమూని నఖసంతానప్రభాంచత్సితాం
బరముల్ నిండఁగఁ గప్పి నీపదయుగ ప్రఖ్యాతచార్వంగి వి
స్ఫురదస్మద్ధృదయంబుఁ దా నభిసరించుం దల్లి! కామేశ్వరీ!

వేకువపట్టు సంపదరవింద వనాళికి సత్కవీట్ప్రకా
శకిని కెన్నఁ నామని గణింపఁబడ్డోపము జ్ఞానమన్విధు
శ్రీకి భవత్పదస్మృతిగరీయు లసన్మహిమంబు సర్వలో
కైకశరణ్య! కామనయనీ! హిమవన్నగరాట్కుమారికా. 38

తోయజపోద్భవ మైత్రిగల్గి ద్యుతిసందోహాకరంబై ధృతి
చ్ఛాయన్గాడి యశేషలోకముల కుచ్చంబైన యాభోగము
న్డాయంజేయుచు మోక్షకాంక్షులకు వెంటన్దుర్గ సంసాధకం
బై యార్కిన్బదవింగమించు భవదీయంబంఘ్రి కామేశ్వరీ! 39

మ్రొక్కెడువారి చిక్కులనుబోనడఁపన్జాలికాఁడుఁ; గీర్తియ
న్జక్కని యేటివాకకుఁబసంమనొనర్పఁగ నీరదంబుఁ భం
పెక్కుభవాంధకారమున నెన్నఁగ నౌరతనాల దివ్వెయా
చక్కని నీదుకాల్గవ ప్రసాదముఁ గోరెదు నీతఁడమ్మరో!

పురహరురాణి! మెల్లఁగ విమోహపయోనిధి నీఁది యొడ్డుఁజెం
ద రయముగాఁ దలంచి సుకృతంబుగలారికె లభ్యమైన మో
క్షరుచిర సౌధపున్వలభి గాటపునిచ్చెనఁ బోలె నీపదాం
బురుహామున న్స్ఫురచ్ఛరణ పుంజముచే జనులందుకొంద్రిలన్.

మరుదాఘుంబున కెప్డుఁగొల్వనయి యేసూత్రంబుఁ జాంచల్యమె
ష్ఠ రసన్గానక రక్తిమన్విడక మార్పున్సంతయే నంద కు
ద్ధురశోభన్దగు నీ పదాబ్జయుగ మోదుర్గా! భవానీ! గుణా
కరమై యందెలమ్రోఁత తర్జనమొకాఁగా లేజిగుళ్లన్నగున్.

ఓ మంగాఁదగి యెల్లలోకములఁ గంజోల్లాస శిక్షాచణం
బై మర్త్యేతరసమ్యమై విబుధగమ్యంబై కడున్ రమ్యమై
యామోదంబును వేదరాజికిడు మోక్షావాసమై యొప్పు శ్రీ
కామాక్షీపదయుగ్మధామముజయోత్కర్షంబుతో నెప్పుడున్ 43

చోరంబుల్ జడతాతమస్సులకు; వాక్స్తోమాతిదూరంబులు
ర్వ్యగత్వాకరముల్; మునిప్రకరహృద్వీథీ విహారమ్ములు
త్స్మేరంబుల్ నఖరంబులన్నిగమసూక్తివ్రాతసారమ్ములా
ర్యారక్తాంఘ్రులుదుర్భవఘ్నములునాయాంతర్యమందొప్పుతన్

గిరిరాజన్యకుమారి! నీదు పదముక్తివ్రాతపుండెన్న మీ
ఱి రహించు ప్రణమిల్లువారల యనీగృక్పంకము న్యావకో
ద్ధురపంకమ్ము గలట్టిదై యడఁచు చెందు న్దాఁదులాకోటి భా
సురమయ్యు న్దలలేనిదై శ్రుతిశిరస్తోమానిశస్తవ్యమై 45

వనములలోన సిగ్గునఁ బ్రవాళము ను స్వఁణకంగఁజేసి వ
న్నె నెసఁగులేఁతయెండను గణింపక యల్పముఁగాఁ దలంచినూ
తనయగు సంధ్యవంధ్యఁగ సతమ్మనోసర్చిరహించు సంబికాం
ఘ్రినళినరక్తిమాలహరి శ్రేయముఁగూర్చుతమాకజస్రమున్.

ఇందూత్తంసు మనోజ్ఞవౌజనని! శ్రీ నెప్పాప్పనీపాదమా
నందంబున్గోనగోళ్ల దా జిగిని జ్యోత్స్నంగొల్పి హంసాళికి
న్బృందంజేయుచు విచ్చుతమ్మివిరిసొంపుంగాంచి కామాక్షి! తా
సందీపించు శరత్సుకాలపు విలాసప్రోఢిఁ గావించుచున్.

స్నానంబు న్నఖరాంకురస్మిత విలాసవ్రాత భాగీరథీ
పానీయంబునసల్పి యంతఁ బరిశుభ్రింబొచు జ్ఞానామృతం
బానందంబునఁగ్రోలి యందెయలయందా రత్నదీపాళి సొం
పౌ నీపాదసురత్నహర్మ్యమున నమ్మా! నామనంబాడుతన్.48

భవవారాశిని నౌక పెజ్జడిమమన్బల్కానఁ గార్చిచ్చు మా
ధవ ముఖ్యామర సత్కిరీటముల నుత్తంసంపుఁబూమొగ్గ లో
క వితానశ్రీమమార్ప వెన్నెల యనక్రౌశ్రితవాక్పంజరా
న విరాజచ్ఛుకి నీపదద్వయియుపణ్ణా! యొప్పుతన్నా యెదన్ 49

కామాక్షీ! జగదంబ! యందమగు నీకాల్దమ్మి తా మ్రొక్కు స
ద్ధీమత్పాళికిఁ బారమాత్మ్యరుచి సర్థింజూపనౌ రత్నజం
బౌ మేల్దర్పణత న్గమించు మృదులంబౌ నింద్రిపత్నీ కచ
స్తోమం బామణి దర్పణంబుఁదుడువ న్దూగాడు నెల్లప్పుడున్

నిరతంబు న్నుతిపుంజ పంజరమున న్నిష్ణాతమై భూరి నా
ఖర రోచిర్వ్రజము న్సటాపరికరము న్గన్పట్టఁగాఁ జేయుచు
న్ద్వరగా నాడు తమోమతంగజము నోతల్లీ! ప్రచండంబు నీ
చరణస్ఫూర్తి పరాక్రమోల్లసితపంచాస్యంబు ఖండించుతన్

అల్లన నీదు మ్రోల నమరాంగనలెల్లగు లాస్యమున్ రసం
బుల్లసిలంగ సల్పఁగని యోయుమ! గోళుల నిగ్గు స్మేరమై
చెల్లఁగ నందమారచనఁ జెన్నగునందెల యారవంబుల
న్గొల్లఁగఁదాఁజమత్కృతినిగూర్చెడుఁగాల్గవతావకంబహో.

క్రిందమ్మిన్దనెగడున్నఖాంశుచయ కర్పూరంబుచేఁ దెల్లనై
కందర్పారికిరీట సంస్థ శశిరేఖాశీతవాస్సిక్తమై
పెందీప్తిం దగు పల్లవంబులను దీపించున్సదా పాంథదృ
గ్బృందాప్తాద్భృతి నీయడుంగుఁగవ మైత్రిన్సల్పుఁగామేశ్వరీ! 53

కలిమినొక్కొక్కఁడు వారికెప్పుఁడగు నాకర్షింపఁగానౌజసం
బలఘుత్వంబునఁబుట్టు సంస్మృతినిఁబాయంజేయఁగానౌజసం
బలగుందూపులవానినోర్చుఘనుసమ్మోహంబందఁగానౌజసం
బలకామాక్షిపదాబ్జనూపురరవంబశ్రాంతమోముష్మమున్

అనుకంపావతి! కంపదాపరిసరంబం దగదమాదేని పా
వన సమ్మదరిలఁగోరిలి కన్నులను దీవ్యదీర్తితనర్తింతు రా
వనజాక్షాంబుజయోని ముఖ్యులెపుడావంద్యత్వదీయాంఘ్రిస
ద్వనజన్యాసమునోభవాని!దయచిందన్భల్పుమీనాతలన్ 55

ఎఱుఁగెడునట్టివేల్పులు పహించుకకీటములందెసంగు పె
న్విరులఁ జరించు తేంట్లగమివి స్తృతిమాపొగగ ఁగఁ గాంచికా
వరనగరీశ్వరీ చరణ వారిజరుక్పటల ప్రవాహ వి
స్ఫుర దనలంబు నాదుభవ పుంజఘనాటవి నేర్చి మించుతఁ

చందురుఁబోలెఁ దెల్లగ నెసంగెడుఁగోళ్ళులచేతఁ దమ్మిపూ
పుం దిరిపెంబు నెత్తనుఁడువుద్దగి సంశ్రిత సంసృతి వ్యథా
ళిం దలఁగించి మించెను లలిన్భవదంఘ్రియుగంబు మృత్యుజి
త్సుందరి! వాగ్విచక్షణతశోభిలఁజేయుతమాకు వైశమే 57

శ్రీమహితంబులౌచ్యుతులచే దెసలన్నిటినిఁ హాతోత్తను
ప్సౌసముమ్మలై సతంబెసఁగుచొప్పరచించి జడత్వసంజ్ఞికం
బౌ మదహస్తినోంపహరిమై యహామార్వేదు నీనుపాద చిం
తామణియోమృడాని! భవతాపము మామకమున్దొలంచుతన్

అమ్మా! శాంకరి! తాల్చు నీదయినపాదాబ్జంబు భాస్వత్త ధా
మమ్మాఁదా నమృత ప్రశస్తి కరుణాత్మ్యంబౌ నమద్భక్త సా
మ్యమ్మై సద్గురువౌఁ గవిత్వమెనయు న్మందత్వమందున్గతి
న్నమ్మా కొల్చెడువారికీ త్రిజగమన్దు న్దాఁ దమః కేతువౌ. 59

తామరసోద్భవాదులను దాసులఁగాఁ గొని దుర్లభేప్సిత
స్తోమము దీనరాజికిడుచు న్వర భూజము గేలి సేయునో
కామవిలోచనా! జని వికాస లయంబుల నిజ్జగాలకు
న్దామొనయించునీయడుగుఁదమ్ముల దక్షతఁ జెప్ప నేరకా ? 60

జననీ! యీజనుఁడీ జగాన భవభాస్వద్భాను జాలంబుచేఁ
దను సంతాపమునందియెందుఁ బరమార్థ జ్ఞానవార్బిందువై
నను దానందఁగలేక సంతమస పంథ న్బాంధుఁడై నీదు చ
ల్లని కాల్దమ్ములనీడకై వెదకుఁ గళ్యాణీ! మృడానీ! వెసన్ 61

వన్నె న్జెన్నగు నోళ్ల క్రొంజిగులచేవ న్బొల్చు పెన్జాందిని
న్జెన్నౌ వేల్పులవౌ కిరీటముల వాసింగ్రాలు సంఘట్టన
న్మిన్నౌ స్వారుణిమాంశుకాస్తృతిని సామీచీన్యత న్గన్ననీ
పన్నాళీక యుగంబునం దెపుడునంబా! యుంద్రు సంవిత్సుఖుల్.

వేలుపుఁజేని యాశను నవేలతనించు తమంబు నంతయు
న్జీలుచుఁ దేజుచే దెసల చెంతలఁ బాటలితంబొనర్చు! శ్రీ
మూలధనంబు మంచుమల ముద్దులకూన! భవత్పదాబ్జమే
నోలిఁదలంతు దాని నెద నుద్యదనూరునియంతృకాంతిగన్ 63

కామాక్షీ! భవదంఘ్రియుగ్మమహిమోత్కర్షంబు సద్భావ్యటీ
కా మంజుస్ఫుటశయ్యపై నిలిపెడి న్గామక్రియే ష్వాప్తిఁగ
న్గోమైఘాలమెసంగ సల్పుసుమనోగుచ్ఛంబులందంఢనో
సాముద్దేంట్లది నేర్పిసల్పు ధృతిమించ న్మాత్రిక్క సద్భక్తునిన్ 64

తొలుత వివేకమన్మధురతోయ ఝరీస్మృతిఁ జల్లఁజేసి యం
త లసితశాస్త్ర చింతనమునంబడు నాగటి కర్షణంబున
న్గలిఁ బదునైన సజ్జనమనంబను చేనున నీదుపాదమో
చలిమలపట్టి! నాటుఁ బురుసంవిదుపాహ్వాయ సస్య బీజమున్

మాతా! శర్వసమేత! గోళుల రుచి స్యందార గుచ్ఛాకృతి
స్ఫీతి న్బూనుచు నెఱ్ఱవేళులను చాంపేయంపుఁ బూమొగ్గల
న్బ్రాఁతి న్దాలిచి మా కశోకసుమనః ప్రాకట్యము న్నీపదా
బ్జాతం బామని దాతఁజిన్బలె నిజస్రంబు న్బ్రసాదించుతన్

అందపుటందెల న్మరకతాశ్మరుచు ల్పెను నాఁచుగాఁగ నొ
ప్పంది నఖాంశు సంచయముహంసల చాలుగఁగ్రాలనిందు భృ
త్సుందరి! యందెడిన్దయము శోణనదంబె జగంబులందు నీ
సుందర విస్ఫుటాంఘ్రి యుగశోభిత పాటలిమంపుఁ బేరిటన్

కామాక్షీ! నఖరేందుచంద్రికలఁ జక్కన్విచ్చుఁ; బంకౌఘము
న్వే మాయించును; గంటకావళికి భావింపంగఁ గాదెప్డు; నెం
తే మేలైన వికాసమూను; నపరాధీనంబు; కాల్దోయి నీ
దో మాతా! యిదిచిత్రపద్మయుగమే మోతా నసామాన్యమా

మందప్రచండమహా నడల మత్తకరీంద్రులతో నెదుర్చు; నే
కందును లేని పద్మములఁగాదను మచ్చరమూని; కామముం
బొందఁగఁజేయు భూమిధరపుత్త్రి! భవత్పదయుగ్మ మిట్టిద
య్యుం దగ శాంతులౌమునుల యూహములన్గడు మైత్రినద్దిరా!

నగరాట్పుత్త్రి! భవాని! నీచరణమాన్య ప్రాంశుశోణాభచే
నొగి సంధ్యారుచి ధిక్కరింపఁబడి యా యోజస్వివర్తింపలే
మి గతిన్గానక దానిఁ బోలి లలిభూమింగన్న యంభోజరా
జిగతాభన్ముకుళింపఁజేయు నెపుడున్సిద్ధంబు కామేశ్వరీ! 70

నీపాదంబను సద్గురుండు మృదురాణీ! రాజహంసాళి కెం
తే పాండిత్యము నందమానడకలం దేపార నేర్పంగ నే
మో పాథోజము తత్సఖుంబటంచే నుత్కంఠ నెంతేనిఁదా
నాపంకేరుహమందుఁ బొందునని నేనమ్మా! తలంతున్మదిన్

ఘట్టుకదొట్టియు న్మలినపున్మయిగల్గిన తేంట్లతోడఁ జే
పట్టెడుఁబొందు; నింకద్విజపత్రితిభ న్ముకుళించెడిన్ రజం
బుట్టిపడంగనుండెడుఁ; బయోజము లెప్పుడు నీపదాలకుం
గిట్టమియొప్పెడి; న్మదన కృంతనసుందరి! కామలోచనీ! 72

కవితాశ్రీరుచి మిశ్రణంబునను దక్షంబు ల్విపన్నావనం
బు వెస న్సల్పఁగఁజాలునట్టివి పయోభూపేశలంబు ల్సురా
గవిశిష్టంబులు; మానిరాడ్హృదయ మార్గస్వైరచారంబు లిం
పవు కామాక్షిపదంబులన్గొలుతు సంహస్సంహతుల్మ్రిందఁగన్

పరమానంతటికింబరంబులును బాపఘ్నంబు లున్మస్తి మం
దిరము ల్గాఖులవన్న వెన్నెలకు నద్దిండెందన్నై కిర్ంకగెం
పు రహిన్గాంచి శుగ్తుల్నుతింప విబుధుల్మొక్కంగ నై నిష్టిత
స్ఫురదంభోజమదంబులో నమపదంబు ల్మమ్మగాపాడుతన్

మృదుతన్ రక్తిమచే బరస్పరముసాదృశ్యంబు సాజంబుగా
గదురు స్పల్లవయుమ్మదంఘ్రులకు నోకాత్యాయనీ! కాని తాం
టిదికోరు న్వన మన్యమోయపనము న్నిత్యంబుదై గ్లోక్య మం
డదియే భేదము రెంట దోచెడి భవానీ! ప్రాజ్ఞచిత్తంబులన్ 75

వరమణి నూపురధ్వానులవాగ్మి తనందియు సల్పు నెట్లు ని
ర్జరవరముఖ్యులో బుధుల సంయమితోక్తులగాగ నోమహే
శ్వరి! యరుణాబ్జకాంతి సహజంబుగనందియు సల్పె నెట్లు నీ
చరణమహో! విసిర్మలత సజ్జన బుద్ధులకున్ రయంబునన్

చలదాశామయ వీచికానిచయ మోజన్లేచి పెల్లాపె నా
కులతన్బొందుట గంటి మాటికలతన్నూగ్రేప్పెశాసక్త పాం
సుల దుష్టేంద్రియపాళిజిక్కి వెతకంచున్నానకే గన్మమ
జ్జలధిన్దాటగనమ్మ! పాదమణి భాస్వత్సేతువు న్జూపవే 77

పాపంబన్నను వేసగి న్మిగుల నాపజ్ఞాఖ్య మేరెండ సం
తాపంబున్గని నామనశ్శిఖి యనూనం బార్తినిం బొంద న
స్వాపస్ఫూర్తి భవత్పదాబ్జమహిమోత్సంరంభమో శీత భూ
ధాత్రిపత్యంబ! మదంబ! శ్రీవణికమాసాటోపత ల్సల్పదే? 78

ఓపరమేశి! పావనులయున్నత మానసహర్మ్య సీమపై
నీపదమన్ప్రదీప మది నిస్తులమై విలసిల్లి చీఁకటిం
బాప నమేయ దుష్కృత సమాజమొగి న్నలభవ్రజంబుమై
నేపుఁదొలంగిమూఁగి నశియింపదె నీయనుకంపయున్నచో

గోళులవైన నిగ్గులనుకొంజిగి ముత్తెములీను శుక్తి పె
న్బోళెపునావ నమ్రబుధపుంజవిపజ్జలరాశిఁ దారకే
ణ్మాళికుటుంబినీ! భవవనంబు ఘనంబును గాల్పఁదామునీం
ద్రాళుల జ్ఞాన వహ్నికి నవారణి నీచరణాబ్జ మంబికా! 80

సతతంబున్విబుధాళికంతకు నుపాస్యత్వంబునన్గ్రాలి సం
స్తుతి గంధర్వసతీ విపంచికల యస్తోకధ్వనుల్సేయ జృం
భితము న్సంసృతి భూధరౌఘ భవమున్ఛేదించి కామాక్షి! నీ
కుతుక శ్రీద పదాబ్జవాసవుఁడెసంగున్ద్రా వలదోర్హిమై 81

శ్రేయశ్శైవధియౌ వసంతను నమచ్చిత్తాళికెంతే ఘన
చ్ఛాయాపూర్ణమునయ్యుఁబెన్నుచియునై సరోజ్వరుతాపఘ్నమౌ
నోయంబా! నఖరేందుచంద్రికల నెంతోచల్లనై యుండి ప
ద్మోయోల్లాసముఁ బెంచు నద్దిర భవద్దివ్యాంఘ్రి కామేశ్వరీ!

సుకవీట్పాళి కనేకరీతి గుణవిస్ఫూర్జ ద్విచిత్రోక్తి పుం
జ కనద్వ్యాప్యవృతిఁ గొల్పువిద్యఁ గడుదక్షుంబౌట నబ్జంబుఁగ్రిం
దకుఁబోఁబెట్టుటచే సనందనముఖాద్య ప్రాజ్ఞమానీంద్ర రా
జికిమొక్కందగుటన్భవదంఘ్రి పరమేష్ఠిత్వంబునంబా! కనుఁ

కామాక్షీ గిరిపుత్రి! యొప్పెసఁగునీ కాల్గమ్ములన్గోళ్లలో
భా మాన్యామల రేణుపూరములచే భక్తాచ్ఛహృద్దర్పణం
బామృష్టంబగు డందు విశ్వమఖిలం బచ్ఛచ్ఛవి న్బింబితం
బౌ మావాక్పరిసేవితా! శుతిశిరో హర్మ్యైకనిశావాసినీ 84

క్రౌంజగురంబ! నీదునడుగుంగవ కెంతయుభీతినూని వే
గంజనెఁగానదానడికిఁ; గంజముఁదానెట కేగలేమిచే
మంజులరేఖయన్గాచుఁ బరిమంబగు భక్తినిగాలిఁబట్టెనా
సంజతుఁ డేడకోచనుట శతునికాలినిబట్టు టొప్పెడున్ 85

తొలివావిద్యలదానిజంబుఁగొని సద్గుర్వంచితానుగ్రహా
తుల సంవీక్షణమన్ రవిప్రభను దోడ్తోడ న్నమతోస్వరుబం
ధ లలత్సంతమసంబడంగ సుజనుల్తారంబ యత్నింతుప్రెం
దొలిపున్నెంబులపంటనీదు పదపాథోజం బెదన్నిల్వఁగన్ 86

మృదురాణీ! జడపాళికైనఁబోడము న్బన్నభక్తితోలోన నీ
యడుగుందోయిఁ దలంపన త్తఱిని మందాహార్యపుం దిప్పుల
న్గడలిన్ రేఁగు ఘుమంఘుమార్భటులధిక్కారించుచచ్ఛంబులౌ
నుడులెంతే మధురంబులై పెదవి తెన్నున్నించి స్వచ్ఛందతన్ 87

అనిశమునంబికా! మణిమయంబగు హంసకమూని క్రిందుసే
యును భళి! హేలనానడక నొక్కెడగాని నెసూ! భవప్రియం
బు నెఱపుచుండి తానెసలుపున్ భవసంప్రీతినౌర! కామలో
చని! భవదీయమౌచరణ సారసమేమి కతాననో మహిన్ 88

సరసంబై మృదులంబునై యెసఁగు సంచారంబు చేరమ్యమై
పరమానందమునందఁగా బుధులు నీ పాదద్వయీయాన ర్తకీ
తరుణీరత్నము నూపురాల్మ్రోఁయ నుద్యన్మన్మనోరంగమం
దరుదౌ లాస్యముఁ జూపు రాగలహరీ వ్యాసంగమై శాంకరీ! 89

అలసంబాగతియందున్న నే యలయు నత్యంతం బజస్రంబుఁగో
మలమైయుండుఁగదా! సదాశివుని కొమ్మా! నీపదద్వంద్వమే
లలి దేవౌఘకిరీటఘట్టనము నెల్లన్జాలెనోర్వ న్మనీం
ద్రిల సూచీనిచితాంతరంబుల నెటుల్ తుష్టిన్సతంబుండునో 90

శివునికపర్దము న్విషయ జేతలచేతముల న్స్మృతివ్రజ
ప్రవిమల సూక్తికూటముల రంజిలఁజేయుచుఁదోయజంపువ
న్నె వెస హసించు నీపదము నిర్మలమియ్యది నామమత్వశ
త్రువశత వేహరించుతఁబ్రితుష్టినిగూర్చుత సర్వమంగళా! 91

సురతరుణీ శిరోజగత సూనచయంబులసంగతి న్మహే
శ్వరి! ప్రణమిల్లువారలకు వాంఛిత పుంజపుటీవిచే నశో
క రుచిరవృక్షసూనజనకంబు స్వసంగతిచేతనౌట నీ
చరణముము త్తెఱంగులయశంబెనసె న్సురభిప్రథ న్మహిన్ 92

పురుమోహాంబనుదొంగదోఁచుకొనికొంపో నెంచునంచున్నిరం
తరము న్సజ్జనహృన్మణి న్దనకె దత్తంబున్దగన్బ్రోచునీ
చరణంబోపరమేశి! రాగపువిశేషాన న్వెస న్బల్లవ
స్ఫురణంబున్ హరియించునేసరణిఁబె న్దోరున్బలెన్శాంకరీ! 93

సతముజ్జిహ్వాకులాంగి పెన్విషయపుంజవ్యగ్రశాల్యంశక
ప్రతతిన్మ్రక్కుచు డస్సె నాహృదయకీరంబమ్మ! కామాక్షి వి
స్తృతకారుణ్యనిధీ ! నిధీశహితసాధ్వీ ! దీనిఁ జేపట్టి నీ
వితతాంఘ్రిద్వయ పంజరాంతరమున న్బెట్టంగదే పెద్దయున్ 94
కామాక్షీ ! స్మృతిలేశమాత్ర జడిమాఖండజ్వర ప్రౌడిమ
న్వోమాయించెదు; వేదకుంజ కుహరావిష్టంబు గూఢంబు; సు
స్థేమంబెల్లరకందరానిది భవ ద్దివ్యాంఘ్రిసిద్ధౌషధం
బో మాతా ! వెదకన్జిరంబుఁ గృతపుణ్యుల్గాందతే కాంత్రిలన్
మొగ సెదునూపురాలెసఁగ ముద్దగుయానముగల్గి పుణ్యాకృ
గ్వారహృదయస్థితిన్గని యవార్యతమంబు నఖద్యుతిన్దోలం
చి రమణుచే స్వశీర్షమునఁ జేర్పఁగనై కమలాలమై మృదు
స్ఫురణముగల్గునీయడుఁగుఁజొక్కపుజంటకుఁదల్లి! మ్రొక్కెదన్
పున్నమనాఁటి చందురునిఁబోలు మొగంబునఁ గ్రాలిమించుకొం
డ న్నెఱిఁదండిగాఁగొని దిటంబుశమస్వముగల్గు వారి సం
సన్నిధినోమనై యెసఁగు శర్వసతీ ! చిరలభ్యమై సురా
గోన్నతిఁగన్న నీపద పయోజయుగంబున నమ్మ! నా మనం
బన్న మిళిందమెంతయుఁ బ్రహర్షముతో సతమున్ రమించుతన్
నెలపూఁదాల్పునకింపునింపెడు భవానీ ! మందహా యానఘ
న్నలి నై రావణకామినిన్గెలుచు బాలా ! గట్టురాపట్టి ! ప్రా
జ్ఞులుయత్నింతురు చిత్తమత్తకరి సందోహంబు నీదైన ప
న్నలినాలానయుగంబునందెపుడు దిన్నగట్టఁగా నెంతయున్ 98

అసమంబౌనసముం బొనర్చుఁ గవితన్ హర్వ్యందఁగాఁజేయు గొ
ప్పసిరిన్గూర్చు నెడంద కెంతయుఁ బరీపాకంబునుం బెంచుఁ దా
వెస సత్సంశయపాశబంధనతతి న్వ్రీల్చున్ బ్రపన్నాళి కీ
రస నీ కాల్గవ కర్థి మ్రొక్కుపని కూర్పన్లేని దే దంబికా! 99

రసమకరందముబ్బ మధురంబులు తావులెలర్ప సూక్తి సా
రసినిఁ గవివ్రజీయ నలర న్లవమాత్రమె తాఁకిసల్పు నీ
యసమ పదార్కరోచు లమరాధిపునాశఁ బలె న్మనీష నో
ప్పెసఁగఁగ నెద్దియో దశకుఁ బెట్టుఁగదే జగదేకమాతరో! 100

మునుమీనధ్వజవైరి యోహిమనగేట్పుత్రి! యనన్యాంతరం
బున వేభంగులసల్పు సంస్తుతికి సమ్మోద ప్రసాదంబు సం
దిన నీ పేర్మిఁ బురంబుగెల్చె జనయిత్రీ! కానఁగాలంబురాఁ
గని నా డెందమునన్ స్ఫురించెడిని నీకార్ద్గోయి కాంచీశ్వరీ!

శ్రీకామాక్షి పదారవిందముల వాసిం దెల్పు స్తోత్రంబు సు
శ్లోకంబున్ద్రిజగత్ప్రహర్షకము విజ్ఞుల్దీని ముప్పొద్దు నే
రాకర్ణింతురు పఠింతురు వా రఖిల వంద్యత్వంబును న్సత్కవీ
డ్లోకాగ్రణ్యతఁ గాంత్రు సౌఖ్యములఁ బొల్చున్నిత్యైక్యాప్తియున్

నిత్యానిత్య వివేకా
ద్యత్యాజ్యోపకరణాఢ్య! యనిశార్చిత పా
ర్వత్యాత్మేశ్వర పదకం
జా! త్యాగగుణాన్వితా! యతాత్మ! గురువరా! 103

వర మేధారమణీయ భవ్యకవితావామేక్షణాక్రీడ నా
దర సూరిస్తవనీయసూక్తి లహరీధారాభిషిక్తామలాం
తర యోగ్యోత్తమపూరుషా సకలవిద్యాసార విద్వర్య వి
స్ఫురదౌదార్య! సదార్యసంగరత! సంపూతాంతరంగాంబుజా!
హరితముని సగోత్రా! హార్దయుక్షుభ్ర త్పవిత్రా!
పురుషవరసుపుత్రా! పూజితార్యాకళత్రా!
సురుచిరకవితా విస్ఫూర్జితా! ముక్తికాంతో
దరవిలసితశుక్త్యబ్ధ స్ఫురత్స్వచ్ఛముక్తా 105

గద్యము

ఇది శ్రీమచ్ఛంకర సద్గురుకరుణా సమాసాదిత సరసకవితా
విభాస్వర ప్రవర్ధమాన శ్రీ మద్భమిడిపాట్యన్వయ పయః
పారావార రాకాసుధాకర శ్రీ మచ్ఛాండిల్య సగోత్ర
పవిత్రసంతతాగ్నిహోత్ర పరిచర్యోపాత్త ఘనతర
సద్వైదుషీ విరాజమాన పేరి సోమయాజి పౌత్ర
బుధజనసంభావ్య సచ్ఛేముషీకలిత వేంకటా
చలపతి సుధీతనూభవనైరంతర్య భక్తి
సంభావితభవానీధవవిబుధజనవిధేయ
వేంకటసుబ్రహ్మణ్యశర్మాభిధేయశాస్త్రి
కృతంబైన కామాక్షీ స్తుతి
యన్నలి శ్రీకామాక్షీ పాదా
రవిందశతకము
పూర్ణము.
శ్రీ మేధాదక్షిణామూర్తి సద్గురువరార్పితము

శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః

# శ్రీ కామాక్షీ స్తుతి

## స్తుతి శతకము

శ్రీమద్బృందావనపుర
ధామా ! మేధాభిరామ ! దాతృత్వగుణో
ద్దామా ! విను మంబాస్తుతిఁ
నా మహిఁదగుకృతిని దక్షిణామూర్తిగురూ !

శ్రీకామాక్షి ! నినుఁ స్తుతించుపని వైరించంబులో పల్కులు
న్మూకత్వంబుగమించు గర్వముడుగ న్బోఁబండితత్వంబు; సు
శ్రీకేందీవర నేత్ర ! త్వత్పదయుగీసేవా మహత్త్వంబు న
న్నాకోఁజేసెడు నంబ ! నిన్బొగడ శర్వాణీ ! కడున్నేఁడిటుల్ 2

చీఁకటిపూగుత్తి చెలువంబున న్మించి
మెయినూనువారి లేమినిఁ దొలంచి
సంసారమను తమస్సందోహము నడంచి
సత్కవీ జిహ్వోటజము గమించి
మృదునిద్రా నెడమ పెంపొడయందు వసియించి
తనరు కంపాతీగమున రహించి
మహిత చరాచరాత్మక విశ్వమున్మించి
పురుకృప సతము నోముచలరించి

యుట్టిదట్టిదనుచు నెట్టివారలకేనిఁ
దలఁపఁగా వచింపఁ దరముగాని
నిత్య నిర్మలతల నెగడు పెంజోతికి
మొనయుబత్తిఁ గేలుమోడ్తు నెపుడు. 2

శర్వజటాటవిన్దిరుగు చందురుసామును సంజఁబోల్చు స
త్పార్వఁగ వేల్పుఁజేనిసతిదా సరిపాపటఁ జిందిరంబు గా
నుర్వరఁ గాంచికానివసదున్నతపుణ్యముఁ బండఁజేయుచు
న్బర్వెడు శాంకరీచరణపాంసువు లెప్పుడు మమ్ము నోముతన్ 3

కామోల్లాసమునించు లేనగవునాఁగా నొప్పు రేయెండచేఁ
గామారాత్యనురాగమ స్జలధిఁబొంగ న్జేయుచు న్మంగళ
గ్రామంబెల్లరకిచ్చుచు న్బుధులచేఁ గామాక్షినా ఖ్యాతయై
భూమానుగ్రహధామ కంపకడ నొప్పున్దేవి శర్వాణితాన్ 4

తనవాల్చూపుల నించువిల్తుని మహాదర్పంబుమన్నించుచు
న్దన దృష్ఠేను పయస్సమస్మితరుచి న్సర్వాశల న్దన్పుచు
న్వనితాసంతతి మేలుబంతి సకలవ్యాహారసమ్రాజ్ఞి పా
వన కంపాతటమందెసంగుఁ గరుణావారాశి కామాక్షియై 5

ముజ్జగమందు శ్యామమయి పొల్చెడు వెన్నెలయొందు పుణ్యభా
స్వజ్జనతాస్యమం దలఘుసత్కవితామృతవృష్టిఁగూర్చు దీ
వ్యజ్జలదంబెదో మదనవైరి మనంబును మోహపెట్టఁగాఁ
బజ్జఁద మోరుకందళి యపర్ణ కృపేక్షణమోముతన్మముః 6

పరమేశానుని మేన సల్పునది దంభావంపుఁబుంభావుక
స్ఫురదైక్యంబు శశాంకరేఖ తలపైఁ బూవై తగున్దేని కు
ర్వర నౌన్నత్యము దేనమాటి కెనయున్ప్రాలేయభూమీధ్రమా
వరకంపాతట సంచరన్మహము భవ్యవ్రాతము న్మాకిదుః 7

పెనుచీకట్లగుమి న్సుధాంశురుచిఁగన్పింప న్గదున్జేయుచు
న్ఘనమౌ వెన్నెలఁగూడఁ గోకయుగికైక్యం బబ్బఁగాసల్పుచు
న్వీనువీధి న్యమునాప్రవాహదశ నెంతేఁగొల్పుచు న్గాంచి శ
ర్వునిదౌ నేత్రమహోత్సవం బొకఁడు పర్వున్వింతగా నెంతయున్

మంజుకనత్తమాల కుసుమవ్రజ నీలరుచిప్రగల్భతా
సంజయదంగశోభములుఁ జంద్రకళాంచితమూర్ధజంబులు
న్గంజవిలోచనంబులుఁ ననన్యజ శౌర్యనిదానము ల్కుభృ
త్సంజిదురోజము న్స్మృడ లసత్సుకృతాంకురము ల్నిరంతరం
బుం జగదంబ!నాదుమనము న్వెలయించుతఁ గాంచిసంస్థముల్

మరుదవనంపుఁబెన్విధిని మానక పెంచుఁజలింప కెప్డు భా
స్కర కిరణంబులన్గొను నఖండమహాశ్చయశక్తిఁ గాంచికాం
తరగత యయ్యు దీప్తినిఁబొనర్చును విశ్వములోన నెంచఁబె
ల్లిరులనుమాపు నౌర! రహియించెదు దీపిక యొండు మెండుగన్

సొంపౌ పెన్గచపాళి తేటులుగ విస్ఫూర్జత్స్మితోత్కర్ష పూ
జొంపంబుల్గఁ బదాబ్జకాంతి చిగురై చూపందమౌనాకుగాఁ
గంపాతీరవనాంతరం బెసఁగఁ జక్కన్జేయుభవ్యస్థలం
బింపౌ నక్కటికంపుదుంప తఘున్నెంతేఁ గాంచి [illegible] 11

అందములైన పెన్గురులవౌజిగిగుంపులె తేంట్లు పూవులా
సుందరమందహాసములుఁ జొక్కపుఁగాల్గవవన్నెలే జిగు
ళ్లుం దగునాకులక్ష్మిరుచులు న్దగఁ గంపకడ న్జెలంగుతో
టం దనరించుచు న్గృపకుతావగు రత్నము కాంచిమించెదుర్

పున్నమచందమామ పొలుపున్గను నందపుమోముగల్గి దీ
వ్యన్నతిఁ బాకశాసనుఁడు వాసిగసల్పఁగ మూగకేని వా
గున్నతి స్వర్ధునీఝరికి నుద్దిగనిచ్చుచుఁ గాంచిక న్సదా
పన్నివహాఘ్న మొందు కడుఁభాసిలు శంకరుపుణ్యమాకృతిన్

చలిమలఁబుట్టి తానుకృతిసంతతికే కనుపట్టుచింతలోఁ
దలఁపనె యెల్లలోకముల తాపముల న్గడపెట్టుచెప్ప ని
శ్చలత రహించి కంపతటి సత్కరుణాంబుమయాకృతి న్వాచి
త్రి లలితఖేలనం బెసఁగ రాజిలెడి న్ధునివర్యయొండహో 13

చనుఁగవయొప్పఁ గన్నులపసందును మూఁపులదోయిపీనుజం
ఘను దగనంటఁగాఁ బ్రతిదినం బవతంసము నాననంబు వా
ర్జనులకుద్రోహమున్నలుప స్వాదుతయు న్గతి యంచచాన నా
నను గనఁజేయఁ గాంచినిఁ దనర్చుఁగవిత్వపుటీవిమొల్కతాన్

నెలపూవు న్దలఁదాల్చి యెప్పుడును గాంచీసత్పురీఖేలనం
బెలమి న్జేయుచు నింద్రనీలరుచి నెంతేఁ దోఁచి మైఁగొంచు వీ
నులతో మంతనమాడుకన్గవయు జానుస్పృక్కచంబు ల్వయో
విలసద్భూరికుచంబులూను గురుసంవిద్భాగ్యమెప్డబ్బునో 15

నిజకేళీవరసౌధమార్గముగ నెంతేని న్నిసర్గార్ద్ర వా
గ్వ్రజసంపత్తికిఁ గొల్పు పెద్ద కవివీర శ్రేణి సూక్త్యాపగా
గ్వ్రజ సస్యేందిరకుం బొలంబుఁ గలుషఘ్నం బింద్రనీలంపుమా
రు జగావన్నియ కంతుపౌరుషము సౌరున్నాంచి కేసెంచెదన్ 16

సంచౌచూర్ణుల మోముఁదమ్మిని సుధాస్యందంపుఁజాతుర్యము
న్గాంచు న్మౌళివిభూషితాంబుజని ధిక్కార్యాణమైపొల్చి మూ
ర్ఛాంచన్మధ్యము నుబ్బుగుబ్బకవ స్మేరాస్యంబునొప్ప న్గడుం
గాంచీసీమ జగద్విమోహిని కనంగా నంగనాగ్రిణ్యయా

అమ్మా! నీదరహాసచంద్రికల సంవ్యాప్తంబునౌ నీకటా
క్షమ్మున్ రాత్రిరి యాభిముఖ్యముగ విశ్వంబందు నెవ్వానికౌ
నమ్మర్త్యు న్వాసమందునైన మధుభవ్యద్రాక్షికా మాధురిం
గుమ్మంజాలెడువై ఖరీరమ మెలంగు న్జేరితాఁగాంతమై 18

చిరునగవుంబసందను ద్యుసింధుజలంబున యామునాంబుపూ
రరుచులు మోవితేజను తిరంబగుసంజ మహోతమోద్యుతు
ల్వారమణి కుండలాంశుచయ వహ్నిని గ్రొంబొగనిద్దులై మహే
శ్వరి! శుభభూములై కరమెసంగుఁ ద్వదీయకటాక్షసచ్ఛవుల్

కణకణమ్రోగుకాంచిలలిఁ గాంచుచు గాంచిపురీ మహావిభూ
షణ గణమాల మౌళితలసంధృతచంద్రమ చంద్రిమశ్శిరః
ప్రిణయిని సత్కవీశ్వరులపల్కులవిన్నునె పుల్కలూని కా
ఘృణికత మూర్ధమూఁపుచలరు న్గడుఁగంపతటంబునందహో 20

జననీ ! కాంచిపురీవిభూషణి ! రసాంచ త్సూక్తికల్లోలవా
హిని ! హీనేతర సాధమాధురికరంబేపారు; లోకత్రయం
బునఁ బూరించెడుఁగీర్తి పూవిలుతునొప్పంగెల్చు సన్మూర్తి యొ
ప్పును యోగ్యంబునుభోగ్యమైయెదకునెప్డున్ నీకృపావీక్షచే 21

తననీలోత్పలకాంతిచే భ్రమరితత్వంబూని తన్మూర్తిఁజే
రి నతుల్పల్వెడువారి పెందమము నోర్మింజెంది తుండీరసీ
మను దైవారు నగేంద్రపుత్రికరసమ్యక్త్వాక మాతుంటవి
ల్తుని జక్కాడిన శూరులోఁగొను సతీస్తోమావతంసంబహో 22

మందస్మేరములు న్మదేభగతులు న్మాధుర్యవ త్సూక్తు లా
నందాపాదక యౌవనాఢ్యములు నిందప్రప్రస్తరాభంబులున్
బెందివ్వోల్లమమార్పఁగాఁ; గుచభరాభిప్వంగు లేణాక్షుము
ల్సందీపించు మహేణ్మహోత్సవము లెంచన్గాంచినంచత్కృపన్

తమ్మిలవన్నె మెట్టుపయిఁ దార్కొనులోచనము న్గలట్టి వం
దమ్మగు కల్పపూల సుకృతమ్మును గూడుచునాడు కేశపా
శమ్ముగలట్టి వంగరుచిసంగతిఁ జీకటిపూలడాలునుం
గ్రిమ్మఁగఁజేయునట్టివయి కంపకడ న్మృదుకోర్కెలొప్పెడున్

కుశలమ్ము న్సమకూర్పఁగానగుత మాకు న్గాంచిక న్వెలిస
ల్పు శుభాసక్తిగలట్టివై సుకవివాక్ప్వంజాచ్ఛ వాసంతుల
న్విశదింపంగ వసంతలక్ష్ములయి యేణీలోచనంబు ల్ప్రసూ
న శరారాతి విలోచనమ్ముల యనూనస్ఫూర్జదుత్సాహముల్

అలఘువ్యాప్త మహత్తమఃకబళనాయత్తంబుఁ దుండీరమం
డల భూమండన మంబుజాతవనసంతానీయమర్మస్పృగ
ర్థ లసచ్ఛేఖరము ల్నవోదితపయోదశ్యామమౌ శంభుని
స్తుల పుణ్యంబులపంట నాకనులకు జ్జూపట్టుటెవ్వోకదా! 26

పూవిలుకానిదౌ మొదటిముల్కని నుల్కఁగ మోమువన్నెచే
నావనజాతసంభవుని యానము దీనముఁగాఁగతి స్ఖలం
బౌ వచనంబుచే సురలయన్నము ఖిన్నమొనర్పనౌచుఁ గం
పావహినీతటంబును సభాజనము న్మృదురాణిసల్పెదున్ 27

అమ్మరో! యెంతకాలము దురాత్ములచేతులనుండిజారు దు
ష్టమ్ముల సొమ్ములఁగడుపుసాఁకుచు నేఁజరియింతునుర్వి శీ
ఘ్రమ్ముగ మ్రొక్కెనాపయినిఁ గాంచిపురీమణిదీపికా! యతం
ద్రిమ్ముల నీదుచూడ్కులఁ దరంగితము ల్కృపమీరసల్పుమీ

వెసనామ్రాల రహించుఁగాత మునిహృత్పేటీసురత్నంబు భూ
రి సముద్యత్కరుణానటీ విహరణ శ్రీకిక్క కాంచీపురీ
లసమానామల రత్నభూషణ మనల్పంబైనమోహార్తికిన్
రస భవ్యౌషధము న్వృషధ్వజుని నేత్రవ్రాతసాఫల్యమున్ 29

మానిలోకహృదబ్జధామ మమంద ధామముః వాఙ్మయ
ద్యానదీ హిమవత్తపః పృథుతాకరంబుఁ దిరంబుఁగాం
చీ నగర్యవనీ విహారవిశిష్ట మష్టతను త్రిణే
త్రానఘానిశ కేళిసౌధ మహాంగణంబు భజించెదన్. 30

మరకతరత్నకాంతులకు మానకరంబమృతప్రవాహవి
స్ఫురణము శర్వచూడ్కులకు సొంపగునొద్దు భవాబ్ధికి న్మహా
త్తరసుకృతాలపంట సతతంబును గాంచిఁగలారికిన్ హిమా
ద్రి రుచిరసత్కులంబునకు దీప్త్యవతంసము నొందుఁగొల్చెదన్

అనుకంపావతి ! కంపతో సతము నెయ్యంబూను నో పర్వతే
ట్తనయా! సత్తతికి న్భవత్ప్రణమనోద్యద్వాసరారంభమం
దె నవోన్మేషకవిత్వపూష రసయుక్తి న్గ్రాలి నిద్రింపఁజే
యును వేగ న్ప్రతివీరభూరికవిరాడ్వ్యాధోత్పలిన్యోఘమున్ 32

వరకంపాతటిపైఁ జరించు జడత న్వారించుఁ బాపౌఘమున్
హరియించు న్మనసోమనోరథముల న్పండించు నిండించుఁ బె
న్సిరుల న్గామకలావిలాసిని శశిస్ఫూర్యత్కాంతలానీక భూ
ధరరాట్పుత్రిక యమ్మ మాకనులకు న్ధన్యత్వము న్గూర్చుతన్

ఈనా శేముషికంబమ్ముం గెడపి తా నేతందరన్యాసి కం
పా నద్యావసథ న్లసత్కుముద శోభా మైత్రికి న్పాత్రము
జ్ఞానా సూనముఁగాఁ దలన్గొనినయాశర్వాంతరంగప్రియ
న్భినిం దోసి భజించెడి న్జడతరో! పీడింపనీకా నెటుల్? 34

ఎంతయుఁదావి నభ్రమున హేమగిరి న్మటిద్వ్యథత న్గపా
కాంతునియందు నాతపముఁ గంబువునన్సిరి నిర్మలస్థల
ప్రాంతమునందు వింతగఁ గరంబుజనింపఁగఁ జేయు చెంతయు
న్గంతుపరాక్రమం బొకఁడు కాంచిపురంబున సారెదేకనుఁ 35

ఉల్లంబం దెహమామకంబు మృదువాఙ్మోత్సంగ ద్దేశంబుతోఁ
దల్లీ! చారు కవిత్వవ ద్రసనతోఁ దాఁగాంచి కాకుక్షితోఁ
బెల్లా శీతనగేత్తటప్రకర సామీప్యప్రదేశాలతో
నెల్లప్పుద్ధి నకృతిప్రమోక్తితతితో నీశాని! నీపెన్దయన్. 36

శ్రీకాంచీనగరీవతంస భరతాశ్లిష్టంబు లిందూపలా
స్తోక శ్రీకము లేన్గుజేనిదగుసంచు న్స్వీయయానంబున
న్వ్యాకుర్వాణము లానతంబులుఁ గుచద్వంద్వంబుచే శాంకరా
స్తోకప్రాక్సుకృతర్ధులే కృతితఁగూర్చున్నాతఁ గందోయికిన్ 37

పూవిలుకానిదా నసపుఁబుంజము తేనియలూరు సత్కవీ
శావళిదైన పల్కులకు నందపుఁగందముఁ గంపకాధునీ
శ్రీవహభూషణంబును నశేషమనీషిమనోజ్ఞము న్మహా
దేవుని సర్వవిత్తము ఘుదియద్భగగ్రసరంబుఁ గావుతన్ 38

ఎంతయుభక్తినెంచి భజియింతు మజస్రముఁగామకోటిసు
స్వాంతకృతార్థలీల నసితాబ్జవిలోచన నాశ్రితోత్తమః
కృంతనిఁ గంతుకృంతను సుఖ న్మృదుసల్పెదుచేడె ఫాలదే
శాంతరవహ్ని లోలకుటిలాలక మే మళికేక్షణన్మదిన్ 39

కలల విలాసపున్నెలవుఁ గవ్యమలోక్తికుముద్వతీ వన
స్థలికి శరద్విధుద్యుతులధార శశాంక లసత్కిరీటతుం
దిలమగు కంపదానిసుకతిన్నెలఁ బేరిమిమీరుసొన్నపు
న్నెలవిలుకానిరాణి రొయిగినాకనుఁదెన్నును దన్నుఁగావుతన్ 40

గుబ్బలయుబ్బుచే నగునకుంఠితగర్వముచేత వంగిపై
కుబ్బుసుధ న్గడున్గలువ నొప్పునగ న్దలనూని కంపడా
దిబ్బపయి న్సతంబు వసతిన్గని యెంతయుఁగీర్తిఁగన్న యా
లిబ్బవెలంది బిడ్డని యలేశపుఁబున్నపుఁబంటకు న్నతుల్ 41

తనమెయివన్నచే మరకతప్రభ నీసునఁదోసి నాఖరాం
శు నికరచంద్రదీధితులఁ జోద్యముగా దివిషత్కిరీటచుం
బనమునుసల్పి కాంచీఁదనపట్టుఁగఁబట్టి మృడాంకరత్నవే
శ్మ నమితదీపపుంగలిక మత్తమము న్విరియించుత న్వెసన్ 42

స్వరుచివిలాసజాలమున వారిదకాంతులనడ్గించి శం
కరుని మనంబునందిముడఁగాఁ దరళత్వముఁగూర్చిసజ్జనో
త్కర నయనప్రమోదమిడి కల్గుటగిట్టుట లేకఁ గాంచికా
పరిసరమందుఁ గంపమునుబట్టని శంపయొకం డెసంగెడుఁ 43

దరహాసితంపునిగ్గుల సుధాగత ఫేనవిలాసమొప్పఁ దుం
డిరవిషయంబునం దెలమినించుచు నల్లనికల్వపూలదా
వరరుచి నప్పుచు న్జనుఁగవ న్గడువంగిన శాంకరేక్షణో
ద్ధుర సుకృతర్ధిఁ బూగుములతో మదభీప్సితభూజమొప్పుతఁ 44

కరుణార్ద్రాణిక ధారయాఁ గృపణధీకవార్తిమందు న్మహో
ద్ధుర తాపఘ్నము మొర్క్కివారలకు నెందున్వేదదీవ్యత్కిరీ
ట రుచిస్ఫూర్జిత శేఖరోత్కలిక గాఢస్నిగ్ధ ముక్కంటిపై
వరకాంచీపురఖేల హైమవతి దైవారు న్వచోదేవిమై 45

వలిమలదైనవున్నెములవాసి కవిత్వపులచ్చిదుంప ని
స్తుల జనయిత్రియెల్లరకు సూనశరధ్వజశాటి కంపకు
జ్జైలి కవతమ్మినిం బరిహాసింపఁగ మేటి వురాణి మూఁడుక
న్నులదౌరదైనరాజ్యరమ నత్య మమున్నతమోముతన్గ్రుపన్

తాపింఛంబుల విచ్చుపూలదగునందంబంది మధ్యంబున
న్దోఁపన్లేమి స్తనద్వయీభరత నెంతో క్లాంతిగన్పట్టఁ దా
రాపత్యంకిత మౌళి గంపదగు తీరంబందు మే మెప్డుభూ
ధాత్రిపత్యంబ! చరింతుమో సురనమస్యాప్తిన్ హారాధీనతన్ 47

నాదుమనంపుబెల్గుల ఘనత్వము నీయెడనొప్పఁగాత సు
స్వాదుమృదూక్తివాహినియఁజస్రముఁగ్రాలుత మోముఁదమ్మి న
న్గాపనివైరిని న్జడిమక్రిమ్మ్రతఁ దగ్గనిపగ్గయెప్డు న
న్నాదుతఁ గామలోచని దయాస్మృతిపాఱుత నాయెడన్లలిన్ 48

శ్రీమీనాక్షి! ద్విరేఫపాళిసుషమ న్నిక్షింపఁగాదక్షమౌ
నీమేలైన కటాక్షసంప్రసృతి మ్రిందింపంగ నౌత న్నివ
ద్గ్రామంబు న్వాసమామకంబును వియద్గంగా తరంగప్రభ
న్వేమించందగు భవ్యవాగ్లహరియెంతేనౌత నామోమునన్ 49

వరకంపాతటభూవిహారిణి! కృపావత్తావకాలోకయు
గ్మరమీయఁపుఁబ్రివాళ మెప్డగుత నస్మద్రోగపూగఘ్నమౌ
చు రహిన్నా యెదుటన్దమంబడఁపుమిచ్చోఁచనొప్పమీయాచ్ఞన
కంరఁగామేశ్వరి! చేర్పుమమ్మ బుధలోకంబు న్ననున్బద్దయున్

కాంచీపూర్వరవాసినీ ! కవుల నీకారుణ్యముజ్జేసి భా
సించు న్మాధురిఁ దేనెమీరుచును; నిస్సీమోరువాగ్ధాటి ని
ర్జించు న్దర్పకజిత్కపర్దమకుటీ శ్రీమత్కుటిన్గ్రాలు వే
గాంచత్తుంగతరంగగంగ నోగిఁదానందు న్జయశ్రీపటిన్ 51

సిరినిడు;విద్యనిచ్చును;బ్రసిద్ధతరమ్మైయశమ్ముఁగూర్చు;భా
స్వరగుణులౌసుపుత్త్రులనొసంగును;నీకృప మ్రొక్కువారికో
పురమథనప్రియా ! వెసఁ బ్రభుత్వముముజ్జగమందనుగ్రహిం
చు రసభవత్పదప్రణతి సూదితకల్మష సల్పుసర్వమున్ 52

కంపకుఁజెంప భాస్వదనుకంప వినీలచలంబుఁ దేంట్లదా
ఝాంపముగెల్చుముంగురుల శోభిలి మ్రొక్కెడువారి చిత్తపుం
గంపమడంచి స్మేరమెసఁగ న్నిలయాదలఁగ్రాల శర్వదృ
క్సంపద దవ్వుపల్కులకు సానుమదీశునిభాగ్యమొప్పెడిన్ 53

అమృతస్రావముమాడ్కి మాధురిని శైత్యంబూని లేకుద్ది మే
ఘమ్మైశ్యామలమైన తావకకటాక్ష వ్రాతపాతంబు శీ
ఘ్రముగా నోహిమవత్సుతాక పురజిద్రాజ్ఞీ భవోత్పాతగీ
తమునన్శోకతమూకతన్జడత బాధన్గనన్నాకిమ్మొగిన్ 54

భవసంజ్ఞా నిగళోరుబంధనముల న్బర్యాకులప్రజ్ఞులౌ
చు వెసన్మ్రొక్కిన యంత మందులకు నిస్తుల్యాంధ్యముఁద్రుంచి కా
మ్యవితానమ్మును గూర్చుసల్లతికఁ గంపాతీరసంచార మూఁ
డులోకంబులతల్లి నెంతు మెద మారారాతిజీవాతువున్ 55

కామకళావిలాసిత నికామపుటాదృతిఁగ్రాలు భవ్యవి
ద్యామయి ఘృష్టసన్మరకతాచ్ఛసమచ్ఛవి లీల షూలిచే
త్త్రోమణిఁగొన్నజాణ పదతోయరుహానతనాకకామినీ
స్తోమ తమస్సు మామకము దూర మొనర్చుతఁ గామకోటికా!

అక్కట! యాయమహంతయననా హరిణాంగనజ్ఞానసస్యపు
న్మొక్కను మెక్కుఁ దావకమును న్మృదురాణి! తటాలునన్ భవ
ద్భృక్కులచాలుల న్పృథతరేంద్రశిలావళి లేవఁగొట్టి పె
న్మక్కువఁ బ్రోచుకోఁగదవె మాతరొ! శీతనగాత్మజాతరో! 57

కామాక్షీ! పృథుజాడ్యనిర్హరణదక్ష త్వత్కటాక్షంబు ని
స్సీమంబై పశువేనిపై క్షణమువాసి న్మూకుపైఁ బ్రాజ్ఞుపై!
వేమూర్ధన్యత వానికబ్బు జగతి న్వృత్రఘ్నముఖ్యు ల్నమ
స్తోమంబు న్గరకుట్మలీమకుటశీర్షు ల్సల్పువా ర్వానికిన్ 58.

ఆధారీభవదబ్జషట్కమును నొయ్యం దా విదారించి త
ద్వీథి న్నివ్వరిధాన్యశూకమున శుద్ధిం జెంది పెన్దీప్తి ని
ర్గాధంబైన సుషుమ్నదా సరణి నశ్రాంతంబునుం దిర్గు నా
త్మాధారోరుసుధార్ద్రఁ గాంతు మెదఁ గామాక్షి న్బరంధామమున్

పదపీఠంబులఁ గాసురేట్ప్రముఖశుంభత్సత్కిరీటంబుల
న్మదముం గూర్చ్ఛవనంబుఁ గాఁ గవిజనానూనోక్తిగుంభంబుల
న్మ్రదిమాంచ న్మణిరాజిపాటలిమ శంపాలక్ష్మిని న్సల్పుచు
న్బొదలు న్సత్కవిబృందభాగ్యనిధి యొప్పుం గంపదాచెంగటన్

సేవింతు న్శశిచూడరమ్యముఖ నీశిత్రి స్జలాపాంగఁ గుం
దావద్యస్మిత సుస్తనోరుభరనమ్రాంగి న్లసత్కుంతల
శ్రీవిత్రాసితభృంగఁ బంచశరశోచిష్కేశుఁగామారి కెం
తేవెల్గించెడుజాణ సత్కవివచోహృష్టాత్మఁ గామేశ్వరిన్ 61

శ్రీరాజత్తనుకాంతుల న్జలదరాజిశ్రీలఁ దర్జించుచు
న్భూరిశ్రీయము లూరఁజేయుతెరువై స్ఫూర్జత్కవీట్కల్పమై
మారారాతికిఁగూర్చుతోడగుచుఁద్రుంపంజాలిపాపంబుల
న్గారుణ్యామృతసీమ యొందు సుతిలస్క న్సల్పుఁగాంచీపురిన్

చనుఁగవగొప్పచే గిరులచాతురినొప్పుచుఁ గన్నుదోయివా
ర్జనులకుఁ బారిపంథ్యమును సల్పుచుఁగంపకుటంగట న్జరిం
చును నవమేఘశైలిఁ దనుశోభఁ దిరంబుగ మోహపెట్టుచు
న్గొని తలఁగోకవైరి కృతిఁగొండొకచక్కనివిద్యహృద్యమై

కరుణకుజన్మభూమి పుడిఁగాంచిని లీలనెఱుంగు పెద్దమా
ల రుచిరలక్ష్మి జాడ్యవనులద్దవహ్ని లసత్కవిత్వచా
తురులనుకోకిలంబులకుఁ దోరపుమావిపసందు నాదుక
న్దెఱఁగున మాన్మథంబయిన నిస్తులవిద్య యొకం డెసంగుత్ర

అమ్మా! నీదునపాంగలీల వెసఁబాయంజేయుత న్నాదుదుః
ఖమ్ము న్మారకతంపుసేతువు భవాఖండాబ్ధి భక్తాళిక
చ్ఛమ్మామన్మథువై జయంతి కుముదాంచల్లీల కాంచీపురీ
యమ్మాపెన్నగశర్వుచూడ్కులకుఁగాలాఖ్యాంజనోత్కర్షమున్

వరకాంచీనగరీవిహారరసికా ! వైళంబె నీవా కటా
క్ష రమ ల్సలుప్పత నాదుకాంక్షితమువీక నైర్వ్యరముద్రిస్వవి
స్ఫురదిందీవరమందుఁజూపుచు మనోభూ రాజసామ్రాజ్యపు
న్సిరివాళ్గొంచుయమీంద్రబంధతతి విచ్ఛేదింపదీక్షించుచుఁ 66

రేనెఱికుద్దియా మొగలి రేకును నీలపయోదమందు సం
ధానముఁజేయుచు న్మెఱపున న్మధులిట్పజము న్వెలార్చుచు
న్జానగు హంసికారుతి లసత్కమలంబునఁగ్రాలఁజేయుచెం
తేనియుఁ గంప చెంగట రహించుఁగృపారమయొందునూత్న మై

తనమృదురీతిఁబల్లవవితానముఁజిత్రముగా నెదుర్చుచు
ర్విని నియతంబుగా సుకృతబృంద మనోరథపాళినించుచు
న్వనని ధిఁగాకఁ గొండవలన న్జనినంది స్వతంత్రత న్జరిం
చు నెఱిఁగలట్టి కాంచినగ చొక్కపుస్వర్మణిభద్రమిచ్చుతన్

కెందమ్మి న్జలదంబు చెంతనటఁజక్కన్బ్రాపుబంధూకమం
దుందివ్యన్నవకుందసూనరుచి నందున్బ్రీవ్యవీణా స్వనం
బుం దైవారఁగఁ గాంచికానగరిఁబెన్పొన్నింపు టేటొండు హే
లం దాశాంకర మైందజాల పుటనల్వళీనిఁ జూపించెడున్ 69

ఓలగమైన వేలుపులనొప్పెడు నుప్పరమందుఁ జాతశా
ఖ్యాలయమున్నతంబెసఁగ నన్నముఁగన్ననఁగూర్చి సత్కవీ
ట్పాళికిఁ గామధేనువయి పంచశరశ్రుతి సంప్రదాయమై
యోలిఁజరించుఁ గంపదగునొద్దున మాతృదరస్మితంబహో 70

అవిరళమాకృప న్పొదలి యార్ద్రములై పృథులాస్థనిండి కం
జ విరచన నైలంగి కడుఁజంచలత నని లీలదా విలా
స విభవమూని లక్ష్మికి నెసంగెడునిండ్లయి వన్నె చేవలా
చు వఱలుచూడ్కులన్నము విశుద్ధులసల్పుతఁగామకోటితా 71

తనతర శాత్కుల న్స్మరపతాకఁగదల్చెడుఁ గాంచికాపురిం
దనరుచు భక్తితోఁదనపదంబు భజించెడువారిఁదన్పుఁ బ్రా
మినుకులవౌ ప్రబంధముల మేలగు మాహృదయాంబుజాళి చే
ననిశముఁబూజ్యయౌఁద్రిజగదాదిమమాతకె వేతుమెంతయున్

పలుకులకెంతొదవ్వగు సుపర్వులదుఃఖపయోధిదాటఁగా
సలుపును మోహమన్విష కుజనజ ఖండనకృత్యకారమాఁ
జెలఁగెడుఁబేర్మిఁగంపదగుచెంతఁ గవిస్తుతసచ్చరిత్రకీ
డుల నడఁగించుతల్లి నెపుడున్గొలుతున్మృడురాణిభక్తితో 73

చెడుగౌనట్టిస్వభావపున్గుటిలతన్జెండాడి నిస్తంద్రమై
నిడుపౌ సత్ప్రతిభ న్పదాశ్రితులకు న్నిండించి మేల్సొన్నపు
న్జడి నిండౌదయతో నొసంగుచు నజస్రంబౌ పస్పుఁదుండీరమ
న్పడమి న్జందజటాలుపైని రతి నెప్డున్బూని కామాక్షితా 74

దేవ న్మేరుధనుష్కుఁడౌ పురుషుఁ డుద్దీపించె గేస్త్రాచు రా
మూనాస్త్రాగమువై భవంబు లలిఁగాంచు న్దేనిదృక్కోణమం
దూను న్మజ్జగ మేల జృంభణము నెంతో కింపచానుండు నె
ద్దానిద్దన్పుఁగఁ గంపచెంప నొకయుద్దండంపుఁదేజొప్పెడున్ 75

కామాక్షీ ! శ్రితకామపూరణి ! కలంకవ్రాతపుంజేవ. నెం
తే మిన్నాజడిమ న్వెసన్నెడపి నన్నేలంగదే ! ధన్యత
న్నామాటల్గనుఁగాతఁ దే నెరుచికన్నన్మించి సన్నీతి జా
నో మంజూక్తులచాలు స్వర్ధునికి దీటై యొప్పనాకేఁగదే 76

సూనోద్యానము యోగిహృజ్జలరుహస్తోమంబు పీఠంబౌ యు
న్మ్యానాంచన్మకరంద శీకరనికాయోపాత్తశైత్యంబు వే
దానీకోపవరాంగభూతయగు దివ్యత్కాంచియాఁబెట్టె యా
భేనోత్తంసునిరాణి యన్నమణి మాకిష్టార్థము ల్గూర్చుతన్ 77

ఏకామేశ్వరు నంఘ్రియుగ్మమున నెంతేధ్యానసన్ముద్రఁదా
నేకాంతంబునఁగొన్న యీయఖిలలోకైకపరిసూరత్న మ
స్తోకశ్రీమణిమచ్ఛ్రీవోభరణ సంశోణీభనచ్ఛ్రోత్రి య
వ్యాకోచద్యువతాసుగుచ్ఛ తపమొయ్యంగొన్న బాలాంబయే

తనమందంబులు యానముల్దొడరి దంతాదంతిగా దంతిరా
జిని నిర్జింపఁగ మందహాసములదా చెన్నొంప మందారపు
ష్ప నికాయంపుమదంబు మన్మథమహీజన్మాంకురీభూత సు
స్తనయుగ్మాంచితవక్షయై యెసఁగునంతఃకాంచిఁ గామాక్షి తాఁ

అందముఁజిందు నీదగువిహారము నేవిబుధాగ్ర్యులెల్ల వా
కొందురు తల్లి! త్ర్యంబకునకు న్సతిఁగా మహిషఘ్నఁగా రమా
సుందరిఁగాఁ బుళిందపతిసుందరిఁభవ్యమతంగకన్యఁగా
సుందరమాతృక న్త్రిపురసుందరిఁగాఁ ద్రిపురాతిభైరవిన్ 80

సతతంబు న్నృప మావిభూతికఁ గుత న్సన్మాని రాణ్మానసా
తత ధాత్రీనటి కాంపతీర సదనోత్తంసస్థ దుర్మోహ సం
హృతి సద్దీక్షిత సర్వదేహులకు నెప్డీశాని కామేశ్వరాం
కతలాసీన కృపాతిరేకభర శ్రీ కామాక్షి రక్షోఘ్నమై 81

పుట్టుకతోన బీదతనమున్గాని లోకుల చూడ్కి కేవముం
బట్టఁగఁ జేయునట్టిఁడులు మాతరో! నీదగు వీక్షణంబుఁదా
మట్టి క్షణంబు పొంది నుడులందునఁ దేనెల తీపిదోఁప స్వా
రాట్టుని నెట్టు భూతియలర న్జితమన్మథులై రహింపరే? 82

ఉబ్బినగుబ్బదోయిపయి నొప్పెడుసోకగు రైకఁ జూచి త
బ్బిబ్బగు గిబ్బరాతు నెదఁ బెద్దగఁ బొంది భజించె నేఁతయు
న్నిబ్బర మొప్ప మానులుగణింపఁగఁ గాంచిక యోగిచిత్తమం
దబ్బిన భూరి చిత్కళ మదక్షిపథంబును బొందుటెన్నఁడో 83

కవివరచిత్తభూమి ననుకంపఁజరించుచుఁ గాంచికాపురీ
నివసనమూని లోకతతిని న్నతమోముచు మూనసంపుఁదె
న్నున కెడమై మహాగుణగణోన్నతయా స్మరశాసనప్రియాం
గన యనిశంబు నాదయిన కన్గవకుం గనుపట్టుఁగావుతన్ 84

ధనములతో రమింప మబుధవ్రజము న్భజియింప మానమా
త్మను జపలత్వము న్భవకృతంబగునోగునకు న్దలంక మే
మనిశ మెడంద నెంతయుఁ బ్రియంబును గాఁచినిఁ గాంచుమారశా
సనరమణీ పదద్వయకిసాలముల న్భజియింతు మర్థిమై 85

ఈక్షణమమ్మనీది క్షణ మెవ్వనిపైఁ బ్రసరించునో కృపా
లక్షణమై దరిద్రతఁగలంగెడు నాతనికెల్ల వేల్పులు
న్బక్షచరుల్ స్మరాతిగము భవ్యతనుద్యుతి యోటకొండకా
మాక్షి సురీకుచవ్రజము యౌవనమీఁడునుదుల్లగంధముల్ 86

ముజ్జగముం బవిత్రితముముం బొనరించిసుధీకబోధకుం
గుజ్జొనగూర్చి శంకరునకున్బలకాంచితకంచుకంపుసం
సజ్జతఁగొల్పి సంసరణసంహృతిచే వెతఁబాపనోపి సం
పజ్జగదోక ! తావక కృపామయదృక్కులన న్గనంగదే 87

కనుఁగవ తెన్నునందెపుడు గాటపునీకృపఁగాంచినాత్తఖే
లనములును న్గళాయముకుళచ్ఛవులు న్గవిసంచయంబునం
దనిశము నీపసూనకలికాంకురము ల్గుచభారనమ్రము
ల్చినుఁగకయొప్పఁ దావకపచేళిమ భవ్యకృపారసోద్ధతుల్ 88

వటులు నళోధ్యమొందు మెయివాటిలువారిమనంబుల న్గృపా
దరములఁదన్పునట్టిది నితాంత మనర్ఘ్యము రత్నమద్రిజం
బర రె ! కరంబు శంకరునియంకమలంకృతమయ్యెదీన నం
తరము మదీయమెప్డెపుడు దానికిఁజక్కనిపెట్టెయౌనొకో 89

శ్రీదపరామృతోద్ధుర ఝరీప్లుతయై జగమందులోన స
మ్మోదదమైచరించు నరపుంజపువెల్వలనుంజరించు నొం
డేదిసతంబునొక్కఁడయి యుమ్మహి నప్పరసంవిదాత్మసం
వేదులు కాంచినంచి రదివెల్గుత నామదిఁగామనేత్రమై 90

మామకమా మనంబనెడుమ త్తమహాగజ మెప్పుడున్దను
స్తోమఘనాటవిన్దిరుగుఁ దూర్ణమె దానినిఁగాంచి కాపురో
ద్దామ విహారసద్రసిక దర్పకజిత్ప్రియధర్మపత్ని నీ
క్షామయపాశపాళిఁ బగసంవి దనోకహముందుఁగట్టుతన్ 91

నీవేచండికవంబికా ! సతి ! భవానీ ! నీవెచాముండి వీ
వే విద్యాత్మిక నీవెయోగినివి నీవేశాంభవీప్రఖ్య నీ
వే వాసింబరమాత్మికాఖ్యఁగన దీవేకామకోటీశివా
దీవేసూ విజయా!జయాఖ్యఁగను నిన్నేమందుమమ్మా ! యిఁకన్

జననీ ! పార్వతి ! యోపరా ! ప్రణతరక్షాదీక్షితా ! ప్రాతిభ
స్వనిధానప్రద ! శాశ్వతా ! త్రిజగదశ్రాంతాశ్రితా! త్రీక్షణీ!
త్రినిరీక్షప్రియకామినీ ! త్రిపదవీధీసంగినీ ! చిత్కళా !
యనిశంబుంచుమి నీత్రిశక్తిముఖదివ్యద్వీక్షఁ గామేక్షణీ ! 93

అనిశంబు న్విలసించుఁ గంపదరి దివ్యద్బుద్ధులౌ వారికె
ప్డును జేతోమధులిణ్మహోత్సవప్రుఁ బెంపుంగొల్పుచు న్సర్వసృ
ష్టి నిదానంబౌకచిత్సుమంజరి స్వయంసిద్ధోద్ధ సద్వైఖరీ
వనవీథింగొని సత్కృపామయ రసవ్యాప్తి న్గదు న్వల్లనై 94

చందురువంకచేఁ గడు నెసంగుకిరీటము గల్గువేల్పుపై
డెందముఁగొల్పి యాతనివడి న్వాలపించినఖిన్న యోజగ
త్సుందరి ! యోరమా ! ప్రకటశుభ్రమరీచిసమాస్య ! సత్కృపా
మందరఝరి న్నిజాశ్రిత సమాజముదన్పు నినున్భజించెదన్ 95

క నదీ వేజగ దేకమాత ! భువనౌఘంబంతటి న్సృష్టి ప్రా
ఖనివై నీ వెతదీయరక్షణమును న్గావింతు వీవే విలో
చన వహ్ని కఠ ఖరకోపవై సకలవిశ్వంబు న్వెస న్మేల్తు; నీ
వె నెటన్గాంచివసింతు విజ్జగతి దేవీ ! నిత్యవై యెప్పుడున్ 96

చిన్మయిని న్బరావరవిచిన్మయిని న్సకలాచ్ఛవాఙ్మయిన్
సన్మయిని న్గుణత్రితయ శక్తిమయి న్త్రిజగన్మయి న్మనం
విన్మయిని న్త్రిధామమయి వేదెసలందు నహర్ని శామయిన్
వాఙ్మహతి న్బరావరమయి న్దగనిల్పి భజింతు నెప్పుడున్ 97

కన్నులవన్నె శారద వికస్వరసారసము న్జయించి కే
శోన్నత కాంతిచేత ఘనయూధముఁబాధముఁజేర్చి భవ్యమై
చెన్నగురూపమూనిన యశేషజగజ్జననీ ! భవాని ! నా
కున్న జడత్వముం దొలఁచి యోముమి జ్ఞానమొసంగియూఁతమై

నగగా నాతోగ తేనిఁదాల్చిన జగన్మాతా ! నతుల్నీకుఁ బా
పగణంబు న్వెసఁదుంపఁ గంపకడఁగొంప న్బొల్చునీకుంబ్రణా
మ గణంబున్మరో!నిత్యరూప!సకలామ్నాయాభివేద్యా!నమ
స్సగుతన్నీకిదె పాశహృత్కర ! మృడార్ధాంగి! నమస్కారముల్

సమరవిజయకోటీ ! సాధకానందధాటీ !
విమలసుగుణపేటీ ! వేశితోన్నిపవాటీ !
యమినుతపరిపాటీ ! హర్షితాజాండకోటీ !
యుమ ! గిరిశవధూటీ ! ఘోరఘూకామకోటీ ! 100

శ్రీగురుదత్త సరస్వతి !
వాగమృతాసార విభవ వాసితసుమతీ !
నైగమశీర్షోక్తివిద
గ్ధా ! గీర్వాణాంధ్ర కవిగణాభినుత కృతీ ! 101

ఉత్తమజీవయాత్రకృతియోజక ! దత్తపురాణకోశసం
విత్తపనీయకాంతిపరివేష్టిత సజ్జనలోక ! సద్గురూ
పాత్త సుధీమహత్వ పరిపాక ! కృపాభరితాంతరా ! వదా
న్యోత్తమ ! దత్తయోగిపదయోజితచిత్త ! సుతత్త్వవిద్వరా !

కవిగణ గణనీయా ! కమ్రవా గ్భావనీయా !
శివపద జలజాతశ్లిష్ట చేతోంబుజాతా !
అవిరత కవితాభామాభిరామా ! స్మితాభా
ప్రవిశద ముఖపద్మా ! భద్ర విభ్రాజిసద్మా ! 103

♦ గద్యము ♦

ఇది శ్రీమచ్ఛంకర సద్గురు కరుణాసమాసాదిత ... శ్రీమద్భమిడి
పాట్యన్వయపయః పారావారరాకా సుధాకర ... విబుధ
జన విధేయ వేంకటసుబ్రహ్మణ్య శర్మాభిధేయాంధ్రీ
కృతంబైన కామాక్షీ స్తుతి యందలి స్తుతి
శతకము పూర్ణము.

శ్రీ మేధా దక్షిణామూర్తి సద్గురు వరార్పితమస్తు

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శ్రీ కామాక్షీ స్తుతి

## కటాక్ష శతకము

శ్రీ పురుషోత్తమకృత మం
త్రోపాస్తి ఫలావతార ! యుక్త్యాంతర ! ము
ద్దీపిత ! వినుమివ్వా డప
ర్ణాపాంగ స్తవము దక్షిణామూర్తి గురూ !

శ్రీకాంచీనగరీప్రదేశముల శైశిర్యంబునందింపనై
మూకత్వంబుగలారికేని రససంపూర్ణంపుఁబెన్నైత నీ
నై కళ్యాణకరంబునై నెగడు నేకామేశకాంతా కృపా
లోకానీకముల న్విమోహమనునల్పుం దుంపఁగీర్తించెదన్ 1

గణుతికి నెక్కునమ్మరో ! జగంబులలో మమతాపిశాచ మో
క్షణములు నింద్రనీలమణికాంతుల దిద్దఁగదక్షము ల్విచ
క్షణములు సత్కృపన్నృతజగత్త్రయరక్షణము ల్భవన్నిరీ
క్షణములు కామకోటి ! పృథుకారుణికా ! సతమున్జయంబునన్

అనిశ మనంగతంత్రవిధులందున నేరుపుఁజూపు నెవ్వి ? యే
వి నిరతమోదమంద పరివేపితమంధరము ? ల్స్రివోయుగా
వని నెవిచేరి కొల్చెడి భవానిరో యట్టి భవత్కటాక్ష పా
వన సునిరీక్షణంబు లవి వాసిమెయి న్దరళత్వమూడెడిన్ 3

అందపు మందహాసమున నంకితమాటవిచిత్రమై కృపా
మంద రసాతివేల్లిత నమందతరంగితమై రవంతగాఁ
జెందినకుంచితంబున లసించెడు నీదగువీక్షితంబుచేఁ
జందురుదాల్పురాణి ! ననుఁజల్లఁగఁజూడుము కామలోచనీ !

అర్జునున కెప్పుడంది సాహాయ్యకంబు
భీమునెద లేనగవుచేతఁ బ్రీతినింపి
చేరుఁ గామాక్షి ! పాండవసేనయట్లు
కర్ణసవిధంబు నీకటాక్షరమ యార !

కామాక్షీ ! మృదులంబు తావకకటాక్షం బన్న రేరాక ది
క్సోమంబందున నల్లచీఁకటులతేజం గొల్పుచు న్మామకీ
నామేయోత్పరిపాకమన్ రవికి వే యస్తత్వమున్గూర్చి ని
త్యామోదంబను నిండుచందురుని నొయ్యన్ రాజిలజ్జేయుతన్

అమ్మా!కమ్మలఁబొల్చుము త్తెముల కాంత్యంకూరము ల్దంతయు
గ్మమ్మందారుచులై తగన్గరుణయు న్మావంతుల న్మేటిహ
ర్షమ్మొప్ప న్బయి నెక్కఁగా నెగడు యుష్మత్సత్కటాక్ష ద్విపేం
ద్రమ్మస్మత్ప్రికటాశుభద్రుమమునిర్దాక్షిణ్యత న్గూల్చుతన్ 7

తనపెన్నీడను ముజ్జగంబుల పరీతాపంబుమాపంగనై
పెనుజూకాలఁజెలంగు భవ్యమణిరుగ్బృందంబులన్ లేఁజిగు
ళ్లను రాజిల్లుచు సత్కృపాఖ్యము సనల్పంబు న్మరందంబునె
ప్లను గామాక్షి!కటాక్షకల్పతరు వొప్పంజిమ్ము చన్నీదహో !

మణిమత్కుండలరాగశోకనదరుజ్జ్మన్యంబు సూర్యాశ్రియ
ప్రణయంబైన భవత్కటాక్ష యమునా ప్రఖ్యాపగారత్న మ
మ్మణి ! కామాక్షి! శివాస్యకాంతిసరితాంపత్యాంకము న్దానవా
రణమై వేగముతోడఁ జేరుచుఁ గడున్ రాజిల్లు నశ్రాంతమున్ 9

ఏపుణ్యాత్మునిఁ బక్షపాతమున నెంతేఁ బేర్మి నీవీక్షణా
స్వాపస్తుత్యా విలాసభాసురకలా వామాక్షి తాఁ బొందు ? ము
క్త్యాపీన స్తని వానినే యపుడె కామాక్షి ! వరించు న్బ్రియం
బేపారంగ; నటౌట నిర్వారకు నెంతే నైకమత్యంబహో ! 10

మరువనుకూలభావగతి మానుగ నెల్లపుడంది భ్రూలతా
మరవిభు కార్ముకాంచితయు మంజరసార్ద్రియు నౌచు నీలకం
ధర హృదయోత్సవంబును బొనర్చెడు నీదు కటాక్షమాల శాం
కరి ! నవమేఘమాలయటు క్రాలుఁ గరంబును గాంచి కేశ్వరీ .

ఓ కామాక్షి ! భవత్కటాక్షరుచి తానొప్పుంగడుం జుమ్ము స్మే
రాకారంబగు గాంగవారి యమునాఖ్యా వాహినిన్బోలి యా
శ్రీకంఠాతివిశాల వక్షమున వాసిన్జెందు నీలోత్పలా
స్తోకస్రక్కటు వక్త్రికు క్సరసియందు న్నైవలాళిన్బలెన్ 12

తొలిపున్నెంబునఁ జేసి నాల్కపొలముందు న్బెద్దలానంగఁ గం
దళితంబుల్ శుభసూక్తి భూరిలహరీద్ధప్రక్రియోపేత స
త్కలమాంకూరము లోజగజ్జనని యో కామాక్షి ! మాకింకనీ
విలసచ్ఛ్రీమ దపాంగపాతమున నుర్విన్ బండినిండారుతన్ 13

శ్రుతివీథీక్రమజాగరూకతను గాంచున్దా స్వభావంబుచే
నతిచాంచల్యమునూనియుండి మలినత్వాస్థానమైకూడఁ బా
ర్వతి ! నీసత్కరుణాకటాక్షము విచిత్రింబోఁగదా భక్తితో
నతులౌవారలకున్ రయంబుననె సలధానించుఁగైవల్యమున్ 14

విరులతూపులవాని జీవింపఁజేయు
బుడుత నెలఁదాల్పు వేల్పును మోహపెట్ట
జృంభిత మమత్వదుర్గ్రహ స్తంభనమున
నమ్మ ! నీవీక్షయౌఁ బరమౌషధంబు 15

కామాక్షీ ! భవదీయ చంచలకటాక్షంబన్న పాశంబు తాఁ
గామద్వేషిమనంబుఁ గట్టుపని దక్షంబయ్యె నిన్గొల్చుస
ద్ధీమత్సంతతి సర్వబంధములఁ బృథ్వి న్దాఁకుమాత్రాన నే
వే మాయించెడునంట చిత్రమిది దేవీ ! కామకోటీశ్వరీ ! 16

కడురాగంబుఁ బురారికి న్వొసఁబొసంగ న్జేయుచు నీలమై
పొడవౌభక్తి నరాళికి న్దృఢము నెప్డుంగూర్పనై లోలమై
వడిసామ్యంబును మ్రొక్కువారలకుఁ బర్వన్జేయుచు న్వక్రమై
పడినాపై నటియించుతన్ద్వదమలాపాంగంబు కామాక్షి ! తా

క్షితిరక్షోపకృతింబొనర్చుచుఁ గృపాశ్రీనొప్పి శ్రీరాముమై
శ్రితమై దేహ్యనిశానురక్తిఁగని వాసి న్గుంచిత భ్రూధను
ర్యుతమై సంతతము న్జెలంగు భవదీయోద్యత్కృపాపాంగ మో
ముతఁ గామాక్షి ! విపత్తులన్దొలఁచి మమ్ము న్గామకోటీశ్వరీ

శివనేత్రింబున శోషితంబయిన యాశ్వంగాశబీజము స్త్రై
భవ ముఖ్యినొన్మలకెత్తఁ జేత్రిమజలసంప్లావార్ద్రిమై రమ్యమై
_స్తవనీయుంబయి వాసనింగనిన కేదారంబుఁగా నెంతు నో
శివవామాంకనివాసినీ ! జనని ! నీశ్రీదృక్ప్రిసారంబునన్ 19

భూరిమహత్త్వ శేవధిగఁ బొల్చి యలంఘ్యసమున్నత స్వసం
స్కార సమాఖ్యవింధ్యగిరిఁ జూపఁగ నేలకుఁబట్టఁజేయఁగా
నేరుపుఁజూపు కాంచిపుర నేత్రి నిరీక్షణ కుంభసంభవుం
డౌర ! పురారిధైర్యమను నంబుధి నంతయు నాచమించెడిన్

భగవతి ! యొప్పనీదగు నపాంగ గణంబులమాల చల్లనై
నెగడి సుధాప్రవృష్టిని వినీలనవస్ఫుర దుత్పలాత్తత
న్దగి మధురస్వభావ కలితంబగుచు న్గలితారకాప్తియై
యొగిశివు మేనియాశ్రయమునూనుచుఁజంద్రికయైయజస్రమున్

కమలవనంబుఁబోలెఁ గడుఁగంటకరాజినెసంగుచు న్మనో
జ్ఞ మయిన మారసూదముని కాయము నీదునపాంగమాల యా
మ్మ ! మిగులఁగోమలచ్ఛవి సమన్వితమై యనిశంబుఁ బక్షపా
త మెనసి భృంగినా సలుపుఁ దాఁదమిఁజూంబనమున్న మాహేశ్వరీ!22

కామాక్షి ! నీదగు నీ
తామాల నపక్షపాతగాఁ గంటకయు
క్తామరస వనము వలెనెల
నామకలాశ్రకణు మేనుఁ గాంచించుఁదమిఁగా 23

నెఱులవన్నియయు నిడు చాందినికిఁగ్రిందఁ
గుండల మణిప్రభా దీప మండితమగు
తావక కటాక్ష రుచిరంగ తలమునందుఁ
నాడుఁ గామాక్షి ! కృపయను నాట వెలఁది 23

ఎంతయుశీతలంబయి యహీనము విభ్రమమూని కందమై
కంతు విలాససంపద కఖండ కృపారసపుంబ్రవాహమై
సంతత మందహాసమున జానగు నక్షుల సంప్రరోహము
న్నంతుగ నాడుచంచలత మానిపి యుంచుతఁ గామకోటితాఁ

శ్రీమీఅ న్ద్రిప రక్తితీవియల వాసింబూని యూఃపంగశ్రీ
కామాక్షి ! కడుమందరంబుఁ ద్వదపాంగ శ్రేణియ న్నోల నా
సోమో త్తంసునిచూడ్కి యల్లనమహాత్సుక్యంబుతో నెక్కితా
భూమానందము మాటిమాటికిని నెప్డుం బొందుచుండుంగ దే25

సుందరసౌధమాఁ ద్రిపురసుందరి యిందుకిరీటు మేను సు
స్పంది మహాకృపాలహరి భవ్యవిహార సరోవరంబు సం
క్రందనముఖ్యులెల్ల రరిగాపులు విశ్వముసర్వమెప్డు నో
మం దగునట్టి దెన్నదరమా ! భవదీక్షణసార్వభౌమతఁ 26

పలుకులలేమయమ్మరో ! శుభప్రద వెంటఁజరించు నెప్డు నా
కలుములరాణి భూ్రలతకుఁగైవసమై పనిసల్పెడి న్జగం
బులుకలవెల్ల నిల్లగును బొల్పగు రూపము ముజ్జగంపుఁగ
న్నుల కమృతంబె నీదగు మనోజ్ఞకటాక్ష సమీక్షయున్న చోఁ

కామాక్షీ ! ధృతి వార్ధియందుఁ గడుమగ్నంబైన యాశంభుచే
తో మత్స్యంబును గంతుదాశకుఁడుఁ దోడ్తో నీ కటాక్షాభిధం
బౌ మేలౌ పెనుజాలసాధనముచే నత్యంతచాతుర్య సు
శ్రీ మీఱంగను బట్టి కైకొనెడి గౌరీ ! కామకోటీశ్వరీ ! 28

జ్ఞానాబ్జాకరము న్గడున్గలఁచి శంకన్ద్రక్కి నాడెందము
న్నాక్కన న్బెన్మదమొప్పఁగాఁ దిరుగు నీగాఢోరు జాడ్యాభిధా
నానూన ద్విరదంబు వేగఁగుటిలంబౌ నగ్రసీమంబునన్
జానొనీదు కటాక్షమన్న సృణిఁ గుంచజ్జూడు కామేశ్వరీ ! 29

లలితముల్తై గుముల్క్రాను విలాసముల న్జననీ భవత్కటా
క్ష లసదమంద కుంజమునఁ జయ్యనఁబెన్నపయున్న సింగ ము
త్తలముగ లేచి నాదుపృథుతాపద మోహమృగవ్రజంబు ద
వ్వులకొగిఁ బాఱఁదోలుత శిప్రన్వశుఁజేసిన కామలోచనీ ! 30

విరియు తొగన్జెలంగెడు ఛవి న్వొసదొంగిలి పొల్పుఁగాంచి స్నే
హ రస సమార్ద్రమైన భవదచ్ఛకటాక్ష కృపాణవల్లి మా
తరో ! మకరధ్వజుం డితఁడతంద్రితఁగైకొని మున్నుతన్నుగె
ల్చి రహినిఁగన్న యున్నతుని చెచ్చెర గెల్వఁగఁగోరి త్రిప్పెడిన్

సతము న్నొమ్మనుల శ్రౌతమాసరణి సంచారంబునుంజేయుచు
న్స్మృతిమార్గంబునుబట్టి పొల్చెడు భవచ్ఛ్రీదృష్టిపాతం బదె
ట్లతికౌటిల్యమునన్ స్థిరత్వమును నబ్జానీకరుగ్వ్రాత చో
రతనుం బూని రహించెనో ? తలఁప నిర్వాణేశి! కామేశ్వరీ !32

శ్రుతి పరిచయంబునందు సంతతమును న్వర్
తించుచును దన చెంత వసించుశక్తి
వెలయు నీలాంబుజనికి నీవీక్షణగురుఁ
డంబ ! కాళిమ సాంప్రదాయంబు నేర్పు 33

చిఱునగవన్ననుర్వ్యాలు విశేషముగాఁ దగగుత్తులై నిరం
తరము రహించునానన ఘనద్యుతి సంచయ. వార్ధిలోనఁబ
ల్మరుఁ దిరుగాడి యాత్రిపురమర్దను లోచనలక్ష్మి నీదువి
స్ఫురిత కటాక్షసేతువును బొంది ప్రహృష్టయగు న్మహేశ్వరీ !

కామాక్షీ ! త్రిపురాతిసుందరి ! త్వదీక్షాలక్ష్మి తా శ్యామయై
భూమస్ఫూర్జిత తారకాంతియగుచు న్బాల్పా స్మితజ్యోత్స్నచే
నేమాడ్కి న్నలుపు న్జకోరములతో నిందీవరౌఘంబుతో
నోమాతా!యనిశంబు స్పర్ధఁగడునో హా!యిద్దియాశ్చర్యమా

అమ్మ ! కామాక్షి ! యెనయు సామ్యమ్మునెపుడు
నరయ నీవీక్షణంబుఁ గాలాంజనంబుఁ
దొలుతటిది పొందనోఁ ద్రిణేత్రున కొకనికె
సులభమౌ నన్యమెల్ల కన్నులకు జగతి 36

స్మరవహ్ని కెనన్ ధూమాం
కురమౌ నీకనులదౌ నకుంఠితరుచి చా
తురి కామకోటి పీఠే
శ్వరి ! విధుధరు ముక్కనులకొసంగు ముదమహో 37

ఇమ్మహి నీకృపేక్షణ మదించక తాఁకఁగఁబోవునప్డె యో
యమ్మ క్షణంబునమ్రుఁడగు నాతని మూఁగనునే న్వరించు లో
క మ్మఖిలంబుఁజూడఁ దమకమ్మునఁబల్కు వెలంది సర్వవి
త్త్వమ్మనునింతికీర్తిసతి వాసిస్వయంవృతి మాల్యయుక్తిగన్ 38

పరితాపమ్మునడంచు నీదుకరుణాపాంగంబు కామాక్షిపు
ష్కరముం గ్రిందుగఁజేయుఁజు మ్మసితమేఘమ్మట్లుగాఁగానియు
మ్మరొ మేఘమ్ము క్షణప్రభాసఖమెయౌ మాన్య త్వదీయేక్షణ
మ్మను మోదావహమౌ నజస్రరుచిఁజేయు న్సర్వలోకంబులన్

గురువర్యామిత సత్ప్రసాదమది బాగుంగూర్ప సాహాయ్యమై
వరలన్మోక్షమ్ము దుర్గమంబునగు నిర్వాణాధ్వమందే చరిం
చు రహింగన్నయతండు పెన్గరుణ సంచుంగాంచు నీవీక్షణో
ద్ధుర యష్టిం గొని పంకమట్టి భవమందుం గ్రుంగఁడో శాంకరీ 40

కామాక్షీ కడుఁజిత్రమౌ నిది భవత్కటాక్ష భవ్యచ్ఛవి
స్తోమాభిఖ్య మహేంద్రనీలమణి విస్ఫూర్జద్ఘనస్తంభమం
దే మత్తంబగు నాదుచిత్తగజ మెంతే భక్తిపాశాళిచే
నీపై బద్ధమునయ్యు స్తంభమును నట్లేబంధమున్వీడెడిన్ 41

తానలుపయ్యుఁ గాటుకసతంబువహించియుఁబై నిసర్గత
జ్ఞానయి చంచలత్వమునసత్పుడునంట భవత్కటాక్ష మం
బా నిరతంబు భక్తహృదయంబుల నిర్మలరీత్యనంజన
త్వానిశ సుస్థిరత్వముల నద్దిరచిత్రము కాంచికేశ్వరీ 42

దరహాసంబులు పూలగుత్తులుగ రత్నప్రోల్లసత్కుండల
స్ఫురణంబు ల్నవపల్లవంబులుగ సొంపుంగాంచి కాంచీపురీ
శ్వరి! శైశిర్యము దిక్కులంబఱపి దివ్య త్త్వత్కటాక్షప్రభో
త్కర మొప్పుం గరుణామృగీనయన కుద్యానంబుగా నెప్పుడున్

నీదుకటాక్షమన్న హరినీలమణివ్రజసింహపీఠి న
త్యాదృతి నాశ్రయించిన ఝుషాంకునిఁ బట్టముఁగట్టుమంగళా
పాదకమా విధి న్బొనరుప న్మణికుండలకాంతి శర్వస
మ్మోదిని! యానివాళి మహపుస్తతి నెత్తిన దీపమాలయై 44

రూక్షత లేకయొప్పు నపరోక్షితమై సుజనాళిచేత మం
దాక్షితమై యజస్రశివదంబయి కర్మితమశ్చయార్కమై
వీక్షితమమ్మ తావకము వే మధుపోద్ధతిచోరమాచుఁ గా
మాక్షి క్షణంబు దాన నను నాదృతితోఁ దదుపంగ దేయిఁక 45

ప్రేమధునీయ నీరమున బ్రీతిని మజ్జనమాచరించి యు
క్తామల మందహాస సుషమాభిధభూతి విలేపనప్రభం
బై మణికుండలద్యుతిచయంబులచే జటిలత్వమంది కాం
చీమణి! దృష్టిపాతము భజించెదుశంభునె తావకంబహో 46

కైవల్యంబిడనై కృపారసపుఁగైంకర్యంబునుంగాంచి శో
భా విస్ఫూర్జితమై స్వభక్తతతికి న్భద్రప్రదంబై మహా
దేవు న్వే పరతంత్రుఁగాసలిపి సందీపించు నీసత్కటా
క్షావేలద్యుతి కోజగజ్జనని! కామాక్షీ! నతు ల్సల్పెదన్ 47

మాతా! యామకరధ్వజప్రభుని సామ్రాజ్యోత్సవంబందు సు
శ్రీతోడ న్దగి యూఁగుముంగురులరాజి న్తోరణంబొప్పఁగాఁ
స్ఫీతశ్రీక సితేతరోత్పలముల న్జైనొందు సన్మాలికా
చాతుర్యంబును గాంచు నీదు చలదంచద్వీక్ష కామేశ్వరీ! 48

వఱలు కురులనైనవన్నెయ స్పోఁకటిఁ
గ్రమ్మఁబడిన త్రోవ నమ్మ! నీదు
చూడ్కి నడచు వినతశూలికై యల్లనఁ
జాటుచోటున కభిసారిక యటు 49

అమ్మా! నీదునపాంగలక్ష్మి యవగాహక్రీడకై వ్రీడయ
న్కొమ్మ న్దోఁడుగఁబూని శంభుగళరుగ్వ్యాధాఖ్యమౌ నాఁచుచేఁ
గ్రమ్మంగాఁబడు కాంతియన్సరసి నోకామాక్షి! యక్షీణమౌ
సమ్మోదమ్మున నాశ్రయించెడిని నశ్రాంతంబు కామేశ్వరీ 50

మమతన్జెందెడు నీకటాక్షమను కర్మందీశ్వరుండమ్మ! ని
త్యము శ్రుత్యంతతలానుషంగమును సంధానించుచు న్బద్మరా
గ మణిస్ఫూర్జిత కుండలాంశుచయమ న్గాషాయవస్త్రంబు ని
ద్దముగాఁ దాలిచి యెంతయే నెసఁగు నీతం డిష్టఁగామేశ్వరీ! 51

ఇంద్రనీలోపలంబు రాయియె తలంప
వాడు నీలోత్పలంబు దివంబులందు
మేఘగత మేచకతయె నైమిత్తికంబె
లేదు నీచూడ్కిసిరికిఁ బోలిక మహేశి! 52

శృంగారంపువిలాస మెంతయును భాసింపంగ లజ్జాఢ్యయౌ
చుం గాటంబుగ నాసదాకొనను సంచుంగన్ను ముత్తెంపు వ
న్నెం గెంచిద్ధసితంబొనర్పునది మై నీశ్యామవీక్షాళ ది
గ్రింగచ్చేలుని మోముఁ జుంబనముఁ జక్కన్సల్పుఁ గామేశ్వరీ!

చలువతనంబుచే సతముఁ జందురిపదంబులఁ దూలనాడి పె
న్కలహముఁదమ్మితోడుత నొనర్చెడు నీదుకటాక్షపాత మే
లలి నసితోత్పలంబున కిల న్మదుపంబునకుద్దిగాఁగ వి
జ్ఞ లెదఁ దలంచువారు చలిగుబ్బలికూరిమిపట్టి ! శాంకరీ ! 54

అందపు మోవివన్నెల చయంబనువిద్రుమపాళిఁ గ్రాలి కాం
తిం దగు భూరిలతోర్మివితతి న్వెలసిల్లెడు నాననప్రభా
బ్ధిం దరుణేందుశేఖరుని దేవి ! త్వదీయకటాక్షమొప్పు వా
రిం దగనింపుకోఁ బయిఁజరించెడు నీలపయోదమోయనన్ 55

శ్రవణ కుండలమణుల కెజ్జివడి మంద
హాస రుచులకుఁ దెల్లనై యమ్మ ! నీ య
సితకటాక్షపంక్తి చెలంగుఁ జివురులు విరి
మల్లియ లెలర్చు నీలాబ్జమాల వోలె 56

చల్లని పెన్నుపారస లసత్తర నిర్ఝరవారిఁగూడి రం
జిల్లిన పక్ష్మలంపురుచిచేఁ దగునీదు నపాంగమాల యో
తల్లి ! పురారిగోవరవితానము దూర్వలదై నపట్టుగా
నెల్లపుడుం గనుంగొన రహించెడుఁ గాంచిపురీకుటుంబినీ! 57

చెలఁగెడు నల్లకల్వలరుచిం గలమేలిమిలాగి పెన్‌దమః
కలనమడంచి దోషల జగంబులకొ జడతన్దొలంచి భా
సిలెడు త్వదీయవీక్షణపుఁజెల్వము వేఱువయై మదీయహృ
జ్జలజమును స్వీకస్వారము సల్పుత మెప్పుడుఁగామలోచనీ! 58

సిరితమ్ముఁదాల్పు చూడ్కికి
నెఱిమోహముఁగూర్చు నీ వినీల కటాక్షాం
కుర. మెటు ప్రత్యఙ్ముఖతన్
స్థిరమా మునివీక్ష నెసఁగఁజేసెడి నంబా 59

అని నీవీక్షణకాంతికోడి జగదంబా! యల్ల నీలోత్పలం
బనిశంబు న్విగతాభిమానమయి నీవా వీనుల న్భూషణం
బను వ్యాజంబునఁజెంతఁజేరి యభయం బర్థించుచు న్బాదవా
ర్జని యుగ్మాభిముఖంబునై నిలుచు నిచ్చ ల్కాంచికాధీశ్వరీ

అద్దిరనీదు చంచలదృగంచల విభ్రమ మంబ! కంతునిం
బెద్దఁగఁజేయనండయయి బేసికను ల్గలవాని ధైర్యమున్
రుద్దుచు రాగబంధ మెదరూఢముగానొనరించు సల్పుఁజు
మ్మద్దియె మానిపాళికి దయ న్విపరీతతఁ గామలోచనా 61

శ్రీకామేశియొనర్చుఁ దేజుసభ వాసి న్దీక్షమాబుద్ధి న
స్తోకంబై తగఁ దేనెవాకయటు విస్ఫూర్జ ద్వచోవైఖరి
న్నిక న్భక్తి నొకప్పుడే నెఱుఁగునేని న్జంతు వద్దానికి
న్బ్రికట్యంపుసిరి న్సతంబు క్షణమాత్రి న్వ శ్రమిా ప్తియే

నీరదమాల లోకజననీ! కనకున్న జలానుషంగము
న్ధారుణిఁ దేంట్లచాలు నెడఁద న్గను వక్రత నందకుండు నే
యోరిమితోఁ గళిందసుతయు న్వహియింపదె భంగయుక్తి నీ
చారుకటాక్షలక్ష్మి ధ్రువసంస్థితిని న్గన దో మహేశ్వరీ! 63

పెను మోహాంబను దుంప నంకురితమై పెంపైన కార్పణ్యపు
న్ఘనపూరంపు రసంబునం బెరిగి తుంగంబైన నాయీ భవం
బననొ పెన్విషభూరుహంబును హిమాహార్యాత్మజా! నీకటా
క్ష నిశాతోరు కుఠారధార వెసఁదా ఖండించుత న్శాంకరీ!

ఘోరభవాఖ్యరోగమునకుం దగునట్టి చికిత్సకై వెస
న్జేరి భజించి వేఁడి కృపఁ జెన్నగు దేశిక సత్కటాక్షునై
దోరుతర ప్రసాదమున నో పరమేశ్వరి! యంకుఁ బుణ్యవి
స్తారముగల్గువాఁ డెనయుఁ దాఁ ద్వదపాంగ మహౌషధంబులన్

ఎంతయుఁ జల్లనయ్యు జనయిత్రి! రో నీదుకటాక్ష మద్ది దు
ర్దాంతముఁ గాలకూటవిష దావము నేని తృణీకరించు చో
క్కింతయు శాంతిని న్గనని యిందుకళాధరు నెమ్మనంబు న
త్యంతము మోహపెట్టునది యక్కజమౌనిది కామలోచనీ 66

గురుకరుణాంకురంబు సమకూడ నయమ్మున నాశ్రయించి ని
బ్బరమునఁ బెద్దపో నియమపాళులచేఁ బృథు పాశబంధనో
త్కరముల నేర్చి పెద్దలు దురితంబుగ నీదు కటాక్షమన్న యం
బర గృహమందు సౌఖ్యము సమంబగుబుద్ధి గమింతురంబికా.

సాకూతాచ్ఛవచ స్సమేత దరహాసశ్రీకన త్ప్రేమతో
నేకంబై తగు నీకటాక్షమునఁ గాంచీశాని! కామాక్షి! ని
ర్భీకుండై యొగి మారవీరుఁడు పురశ్రీగణ్య సామ్రాజ్యపు
న్థాక న్స్వీయ విరోధిపైఁ బరపి యోడన్జేసి దీపించెడిన్ 68

ఘనమౌ విభ్రమపుం బలంబునకు నోకంబైన యుష్మత్కటా
క్ష నితాంతోన్నత వీరుఁ డోజననిభ్రూచాపంబున న్వంచులీ
లనె తా సల్పి శశాంకశేఖరు ననల్పంబైన యర్ధాంగరా
జ్య నుతశ్రీ సుఖలబ్ధి నీవశముగా సల్పెం గదా శాంకరీ! 69

కామాంకూరచయైక వాసమగు చెక్కాలంబునుం గ్రాలు నీ
శ్రీమ ద్వీక్షణపాతమీవృత ధరిత్రి న్భక్తహృత్కామిత
స్తోమంబు న్దగ రాగయుక్తమయి మంతుంగాంచి కామాక్షి తా
నేమాడ్కి న్బ్రకటీకరించునొ మహర్షి శాళి వైరాగ్యమున్ 70

కాళిమమదాన నీకటాక్ష మెపుడుఁ గల
హించుఁ గాలాభ్రములతో మహేశ్వరి! కడుఁ
గాని దానినె కాంచి యుత్కంఠనీల
కంఠుఁడు రమించు సతము నిక్కముగ నౌర! 71

మేచకకాంతితోడ నెఱమింగను యుష్మదపాంగ కేకి కం
పాచరి! తాఁద్రిలోచనుని మాన్మథతాప విమోహసంతమో
భ్రాంచితిచేఁ బ్రహృష్టునిగ నమ్మరొ! సల్పుచు ఘుత్కకర్మచ
ర్మాచిత సర్పసంచయము మ్రింగఁగఁ జేయుతఁ గామలోచనీ!

అమ్మా ! నీదగునక్షిపాతము మహేశాలోకసంబంధు నం
దమ్మా పద్మమటుల్ సతమ్మును ననూనప్రేమయుక్తిన్ వికా
సమ్మంగూర్చును ఘనప్రమం దలఘులజ్జాభారమున్న ద్విప్రియా
మమ్మట్టు ల్ముకుళింపఁజేసెడినిజమ్మా ! కాంచికాధీశ్వరీ! 73

మూకుండొప్పను వాక్ప్రభుండయి కురూపుండైనవాఁడున్ రతీ
ట్ప్రాకట్యంబుఁగను న్వాగీశతయెల్లర్వ నింపచాకుండు నో
యేకామేశ్వరురాణి ! వాల్చెదుఁ ద్వదీయేజ త్సులీలోర్మళా
లోకశ్రీప్రసరించు నాతుఁటినె త్రైలోక్యేశి ! కాంచీశ్వరీ ! 74

నల్లనివైనముంగురులనంగను భృంగములౌ మనోజ్ఞమై
చెల్లెడు నాసఁగూడి విలసిల్లెడుముక్తప్రవన్నె దుంపఁ జొ
త్తిల్లుబిసాంకురంబగుచుఁ దేజరిలున్మకరందమాఁగ్రుపా
భ్యల్లసనంబుఁదల్లిరో ! పయోజమె నీనయనంబు శాంభవీ ! 75

అవనిన్వేగమె కాంక్ష్యమాణఫలమీయ న్సర్వదాదక్షమౌ
భవదీయేక్షణ కామధేనువర సంపర్కాన నేయార ! శాం
భవి ! పాశంబులకట్లఁబాసి పశుతన్వైళంబుగాపీడు దే
హి వితానంబు నిజంబుగా జనని యోయేకామ్రనాథేశ్వరీ! 76

ఘనసంసారకృతి వ్రజీయు పరిపాకంబూను మర్త్యవ్రజం
బునకు న్మిక్కిలి శీతలంబులయి యింపుంగూర్చు నీచూడ్కులో
జననీ ! మాటికిమాటి కింధన సమాజంబట్లు కామారినె
మ్మనమందు న్మదనాగ్ని నెక్కొలుపుఁ గామప్రేక్షణీ ! శాంకరీ!

సతము న్భ్రమరసాభ్రఁ గుర్కులిడి యిచ్చల్ వొల్చు నీవీక్షణ
ప్రతతు ల్యాంకరి! కామకోటి! పరిశుభ్రజ్యోత్స్నలౌ జందనా
తతపంకంబులగు న్సుమౌక్తిక లసద్ధామంబులౌ శీతలాం
చిత సౌగంధ్య జలప్రసేచకత వాసించెందుఁ జిత్రంబుగన్ 78

వరకాంచీనగరీ విహారరసికా! వైళంబె కాలాంజనం
పు రహి న్స్వాంచిత కాంతిచే నదిరి యాపుష్పేషుమత్తంగ్ర భా
సుర సంస్తవ్య కలానుభావమున సంచుంగాంచి దోషార్తిత
స్ఫారమౌ నీకరుణాకటాక్షమును నింకన్నాపయి న్గొల్పవే 79

కాంచుమియుంచుకంతననుఁ గామమదేభవిముహ్యమానచే
తోంచిసుఁడై యనారతము నామ్రమహీరుహమూలమందు భా
సించెదు వేల్పుకింపయి లసించెదు నీదుదృగంచలంబుచేఁ
గాంచిపురీవిభూషణి! జగజ్జననీ! శ్రితకామపూరణీ! 80

నీదునపాంగ సంగతి జనించినపుణ్యులు కొందఱో కృపా
మేదుర! పొల్తురమ్మ! యెలమి న్గళసంగత కాళిమాఢ్యులై
యాదృతితోఁ జకోరనిచయంబును దన్పెడువాని భూషగా
నౌదలఁదాల్చి రేఁబవళు లారఁగఁజేయు కనుల్గలారలై 81

తావకమౌ కటాక్షము నిదర్శనమౌ నసితోత్పలాభ కో
దేవి! కృపాఖ్యవిద్రుమ సుదీప్తముఁగర్మపయోధి కెన్నమై
త్రావరుణిప్రథంబుగద! దాన మము న్విడిపింపుమమ్మ కాం
చీవరభూష! శంభుమహిషీ! వెస మూఁడగుబంధనమ్ములన్ 82

ఎంతయుఁజంచలంబును నకృత్రిమమైతగునంజనంబొ సూ
నాంతరమంద ఝుంకృతివిహారమొనర్చెడు తేంట్లచాలొ పె
న్వింతగ వహ్నిఁగూడక భువిన్ రహియించెడు ధూమరేఖయో
మంతగు నీకటాక్షగత మంజులనీలిమ కామలోచనీ 83

అమ్మరో నీదృగంచలగతాసితకాందళి యెన్నఁగా మనో
జ్ఞమ్ము నకృత్రిమమ్ముఁ గడుఁజంచలమైతగు నంజనంబొ శ
బ్దమ్ము నొనర్పకే తిరుగుబంభరమాలయొ వహ్నితోడసం
గమ్మునువీడి రాజిలు జగాపొగ మొల్కయొ కామలోచనీ 83

అనిశంబో జగదంబ యంజలి మదీయంబౌతఁ గళ్యాణదం
బును నిశ్శ్రేయసమూలభూతమును నెప్డు న్విభ్రమంపున్మదం
బున సంఘూర్ణితము న్మనోభవుని యేపుం గన్న పెన్దర్పపుం
జనిసిద్ధి న్సమకూర్చు తావకకటాక్షస్ఫీతికి న్శాంకరీ 84

మముఁబాలించుత సంతతమ్ముఁ గృపఁ గామప్రేక్షణీకాసువి
భ్రమ దర్పాంకురమై వినీలకుముదవ్రాతీయ విస్ఫూర్తికు
చ్ఛము నిందాంకురమై భవాంధతమసోచ్చండత్వము న్మాప ద
క్షము దీపాంకురమైన తావకకటాక్ష మ్మేకచూతేట్సతీ 85

పరఁగుత ముక్తిదివ్యమణి భాసురరోహణ పర్వతంబులై
గురుకరుణాప్రవాహమునఁ గూరిమి మజ్జనమాచరించి శం
కరుని మనంబుఁ గింకరముగా నొనరించెడునట్టి నీమనో
హర సునిరీక్షణ ద్యుతుల కమ్మరో! మత్ప్రణతు ల్మహేశ్వరీ

విరిసెడు నల్లకల్వ పృథివి న్గడునల్పము మాత్స్యమైనభా
సురతయు హీనమేయగు వసుంధరలో నరవిందమెంత యా
హరిణికెసంగు కన్నిరియు నొంగడుదవ్వుగఁ గాంచికాపురీ
శ్వరి ! భవదీక్షణాభకు శివా ! యసమంజస మంజనంబగున్ 87

కలిసిన యవ్విషంబునను గర్దమితంబగు నమ్మహేం దుర
స్థలమున రింఖణంబెదిరెుు సల్పుచు నీనులనొ సితేతరో
త్పలముల హేలఁదోలియుచు విభాసిలు నీదుకటాక్షమిద్ధ ని
స్తులమయి బిడ్డయై త్రిపురసుందరి ! యాడెడుఁగామలోచనీ 88

కంతువైరి యుగస్సీమ గంతులిడుచు
గళగరళ కర్దమమున మైఁగలయఁ బడుచు
శ్రీవణభూషోత్పలము హేల నవలఁదోలియు
చాడు నీ కటాక్షము బాలుఁడట్లు తల్లి ! 88

లలిత భవత్సమీక్షణ విలాస వసంతపులక్ష్మి విజ్ఞకో
కిల కుల లాల్యమానమయి క్షిప్రముగా నవసూక్తిధాటినాఁ
జెలఁగు రసాలవాటికి సుశేముషియొప్పఁగఁ బ్రోధిని న్నిర
ర్గళమగు సౌరభంబు మకరందరసంబును గూర్చుఁగాపుతన్

కరుణానీర సువృష్టి నీదగుకటాక్షంబన్న మేఘంబు వే
గిరమే కాంచిపురీశ్వరీ ! కురిసి లక్షింపంగ సారస్వతో
ద్ధుర కూలంకష సత్ప్రవాహమును నిండుం బున్యులా వారికి
న్దారక న్దేలికగా నొనర్చు యమున న్దచ్ఛీకరించు న్గడున్ 90

కామాక్షీ భవదీయ నిర్భర కటాక్షవ్రాత భూరిచ్ఛవి
స్తోమ స్వర్విభు రత్నపంజరమునందు న్భవ్య తాటంక ర
త్నామేయద్యుతి దాడిమీయ శకలీయానుణ్య మొప్పార నెం
తే మేల్గాంచు కృపా శుకీ తరుణి తా నెడ్డాప్పెడు న్జాగృతిఁ 91

ఈ నీవీక్షణపుంబ్రసారము వినీలేందీవరంపు న్సగో
త్రీనూన స్థితిఁ జేసి తా శ్రుతిని యొయ్యంబట్టెఁ గౌటిల్యముం
గానంగాఁ బ్రకటించెడి న్దిటముగాఁ గామాక్షి ! భ్రూవల్లికా
న్యూన స్నేహమునందఁగా నగుఫలం బోయిద్ది కాత్యాయనీ!

హిమవదగేట్సుపుత్త్రి! రహియించెడు నీనయనప్రశస్తి యి
ద్ది మదనవీరు బాణవితతి ప్రథ హర్షలహార్యభిఖ్య యుం
చు మదిఁదలంతు నోజనని ! సోమకలాధరు ధైర్యముద్ర డెం
దమునను జొచ్చి యూరశతథా యొనరించుటఁ గామలోచనీ 93

శోణముఁ గందర్పునకు
న్బాణము భక్తాంతరంగ పాళిత్రాణం
బేణధరు రాణి ! మృదుదృ
క్కోణము దయకిక్క నాదుకుందు సడఁచుతన్ 94

కందర్పారి నిజోత్తమాంగ మకుటాగ్రంబందు లాలించు నా
మందాకిన్యుదకంబున న్గటిలత న్మట్టాడుచుంబోల్చు నీ
యందంబైన యపాంగపాత మది కామాక్షీ ! కృధావేగతా
ప్తిం దీపించి భ్రమించు మీనమనుసందేహంబుఁ గల్పించెడిన్

అమ్మా సంపళితశ్రవోభరణ ముక్తాంశ్వాంచిత స్మేరయు
క్తమ్మా సచ్ఛ్రితి చామరాల చతురత్వంబొప్పఁ గామాక్షి యే
నమ్ముల్లగ్గిన జోదునాఁబడు మదోద్యద్ధస్తి యుష్మత్కటా
క్షమ్మ స్తంభమున న్నిబద్ధమయి యీశానీ! సతంబొప్పెడిన్

నీదుకటాక్షమన్న రజనీ సమయం బరుదెంచునంతలో
మేదుర భక్తి నీకుఁబ్రణమిల్లెడువారలకు న్మనోభిధా
నోదయ పర్వతాగ్రమున నోజగదంబ! సుధాంశుబింబ మా
మోదదమై వెసం బొలుచుఁబూర్ణతతోఁ గడువిస్మయంబుగన్

కామాక్షీ ! ప్రణమిల్లుభక్తులకు నెక్కాలంబుఁ గల్పద్రుమ
గ్రామంబట్లు సమస్తవైభవము నీఁగానొప్పు నీవీక్షణం
బోమాతా ! యసితోత్పల భ్రమరనిష్ఠోత్కృష్టగుక్సంపద
న్భామి న్దొంగిలునంట యెంతయును గొల్పున్విస్మయంబున్మదిన్

ధర భక్తిద్రవమానకున్నఁ గడుహృద్యంబౌవివేకంపు వి
స్ఫురణంబు న్గనకున్న గొప్పగరువంబుంగన్న శాస్త్రాళినా
దరముంబూని పఠింపకున్న ఋతవాగ్దక్షుండుఁగాకున్న ము
క్తిరమ న్దాయకయున్న వానిపయినీదృష్టుల్ ప్రసారించునే 99

ఎంతయు శీతలంబును నహీనపుఁగర్మవిపాకరూప దు
ర్దాంత విషంబు మాపు నమృతంబెసుమీ సుమనోభిగమ్యమై
మంతగు నీకటాక్షము సమస్తజగజ్జనయిత్రి ! యోకృపా
స్వాంత ! వినీలమై కడు నెసంగెడు భేదమిదే మదంబికా ! 100

శ్రీతరుణీమ్ముఖామర వరేణ్యసమర్చిత పాదకంజ ! స
త్ప్రీతము భూరిసంసరణ తోయధిభీతుల కెప్పుడు న్గడుం
బూతము స్వర్ణకుండల విభూషణకాంతి సమేతమో భవ
చ్ఛీత కటాక్షపాతమున శీఘ్రమె న న్దయఁజల్లఁజేయవే 101

ఉత్తర రామాయణకృతి
కృత్తాతపదాబ్జ భజన కృతి ఘనపుణ్యో
పాత్తోదాత్త కవిత్వా
ద్యుత్తమ విద్యాసురత్న యూథోద్దామా ! 102

సాధ్వాచార ! విచారదూర ! దరహాసస్ఫూర్జదాస్యాబ్జ ! వా
జ్మాధ్వీ సద్రస తర్పితాఖిలబుధా ! మావాగుమానాధసే
వాధ్యానారతసక్త ! సూక్తివిభవోద్య త్సారవ ద్గ్రంధభే
రీ ధ్వానావృత సర్వదిక్తట ! పృథుశ్రీయుక్త ! సత్పుత్రికా

అకలుష సుమనోవ్యూహానుషంగాంతరంగా !
శుక గదిత సుశ్లోకౌత్సుక్య ! గీతానుపాఠీ !
ప్రకట విమల మోద భ్రాజమానా ! యనూనా
త్మిక పరమసుతత్త్వోద్దీప్త ! గుప్తాచ్ఛదానా ! 104

ఇది శ్రీమచ్ఛంకర సద్గురు కరుణాసమాసాదిత ... శ్రీమద్భమిడి
పాట్యన్వయపయః పారావార రాకా సుధాకర ... విబుధ
జన విధేయ వేంకటసుబ్రహ్మణ్య శర్మాభిధేయాంధ్రీ
కృతంబైన శ్రీ కామాక్షీ స్తుతి యందలి
కటాక్ష శతకము పూర్ణము.

శ్రీ మేధాదక్షిణామూర్తి సద్గురు వరార్పణమస్తు

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# కామాక్షీ స్తుతి

## మందస్మిత శతకము

శ్రీ కాంచీ కామాక్షీ
ప్రకట శుభకృద్విశుద్ధ రాజద్దరహా
సాక్షీర్ణ స్తుతి విను క
న్నాకది మేధాఢ్య! దక్షిణామూర్తి గురూ!

తనువుగలారి బంధములెల్ల సమయించి
శివమునొసంగి రక్షించునెద్ది?
మదనాగమరహస్య మంత్రితంత్రింబుల
కొజ్జయై సతతంబు నొప్పునెద్ది?
సతముఁ గళ్యాణ సంచయమునకు న్భవ్య
కేళీస్థలంబయి క్రాలునెద్ది?
కమ్మవిల్తునిదాయ కనులకు ఘనసార
పుంజ పరాగమై పొదలునెద్ది

విమల మందారకుసుమ గుచ్ఛముల మదము
నంతయు హరించి మించు కామాక్షిదైన
యచ్ఛ మందస్మిత జ్యోతి కనుదినంబుఁ
దోరపుంబత్తిఁ గయిదోయి దోయిలింతు 1

నవకుందప్రసవాభమై గురువునై నాసా లసన్మౌక్తిక
చ్ఛవికి న్దామరకాడతేజునకు సాజంబైన తేజై యని
న్దివిషద్వాహిని మించి చల్వదొరగద్దెన్ సాముగై కొన్న నీ
లవ హాసప్రభ కమ్మ! శాంకరి! యనల్పప్రీతిం గైమోడ్చెదన్ 2

మేలగు కప్పురంపుటెలమి న్నగుంబాటొనరించి యెంతయుం
జాలమి నిండు వెన్నెలం బొసంగంగం జేసి మనోజ్ఞ కుంద సూ
నాళికి క్షుద్రతన్దొలిపి హర్షవహించెడు కామనేత్రదా
శ్రీలలితస్మితప్రభ లశేష శుభమ్ములు మాకొసంగుతన్. 3

ఉబ్బిన గుబ్బదోయిపయి నొప్పెడు కప్పురపు న్విలేపమై
ప్రబ్బెడు నల్లకన్నుంగవ రాతిరికి న్ననువెన్నెలౌచు మే
నబ్బిన యందమన్న ధునివౌ నలలందుం జరించునంచులౌ
గుబ్బలికూంతులేనగవు గొప్పతనా లెదం జల్లంజేయుతన్ 4

కామద్వంతపుందెల్పు నల్పముగ వీం కన్నల్పి దీవ్యచ్ఛర
త్సోమము న్నంతత మెక్కంగోర్కెం దులయందు న్గల్గంగాంజేసి యు
ద్దామాంతేనివసిత్వ వాంఛ నెదనంద న్గంకుకుం గూర్చు శ్రీ
కామాక్షీ స్మితరుక్ప్రరోహము లహంకారంబుం బోకార్చుతన్

ఆనై శాకరిదైనవ్యాక్రియను నాశాంతాలంబట్టింపు చెం
తేని న్గాశ సుమాభిమానహృతి నేర్పెప్డూని యాసక్తి నీ
శానుం డెంతయుం జూడంగా వెలయు నీసన్మందహాసత్విడ
న్యానంపుం ఘురికాంచికేశ్వరి! మదేనోబృందముం గూల్చుతన్

పీనోత్తుంగ కుచాగ్రభద్రహరి సత్పీఠస్థలాసీనత
జ్ఞానా నాత్రిజగద్విజిత్వర సుమాస్త్రస్వామికి జ్ఞామర
శ్రీనిం జెందిన చంచలం బయిన రశ్మివ్రాతముం గూడు నీ
శానీ! నీదరహాసమంజరి మదిచ్ఛాపూరకం బయ్యెడున్ 7

పరిశుభ్రచ్ఛవియైన శర్వు పరిరంభ స్ఫూర్తిమత్సంభ్రమం
బు రహింప న్సురగంగయట్టుల గళంబున్జక్కఁజుంబించు నీ
ల రుచి న్వే మృదువైన స్పందమది క్రాళిలన్బొల్పుఁగాళిందియు
ట్లురుకల్మాషమొనర్చు నీస్మితము శమ్మొప్ప న్మమున్నాకులన్ 8

స్తనతటమందె నెద్ది నిరతంబును హారలత న్జయింపనా
న్మునిఁగెఁ గృపాస్రవంతి నెది పూర్ణవినిర్మలత న్వహింపనా
న్వినుసిగవేల్పు సల్పు నెది విస్మయనీయతఁ దెల్పునాఁగ రా
గ నిబిడ నట్టిశాంభవి ముఖస్మితమార్పుత మా భవవ్యథన్ 9

తా నెంతేఁ దెలుపయ్యు నైల్యమును జాంద్రస్ఫూర్తులన్జేర్చి శై
త్యాన న్దాఁదగియు న్స్మరాగ్ని సతముం దాఁకొల్పుచు న్వ్యాలికి
జ్ఞానై తా నధరాన నమ్రలకునుచ్చంబౌగతి న్గూర్చు నీ
దౌ నుత్యస్మితకాంతి మామెదలఁ గామాక్షీ! విరాజిల్లుతన్ 10

కదలెడు భ్రూలతోర్మితతిఁ గ్రాలుముఖద్యుతియన్సరస్సుదా
నుదకమునం దపాంగముల నొప్పెడునీలిమఁ దేంట్లవృత్తిఁదా
ల్చి దళితపుండరీకపు విచిత్రపుఁబాండితిఁ గన్గ కామనే
త్రిదయిన మందహాసచతురత్వములోదుముకుం దొలంచుతన్ 11

బాధితబంధుజీవమయి పల్లవమైత్రినిఁబొంది యొంతయు
న్శోధితసద్విజవ్రజ నిచోళకమా నధరంబునూఁడియు
ద్గా ధృతశుద్ధభావమయి ధాత్రినతశ్రితచేతము న్బ్రమో
దాధికమై తగ న్సుఖప్ర నమ్మదరస్మిత మోముతన్మయుఁ 12

కుముదిన్యుచ్చసహాయపుంగ్కృతిఁ జెలంగు న్మాటికి స్జీల్బుపె
న్గమము న్జంద్రకళావతంసతను సాధ్వపాంగణప్రేంఖణం
బమరంగా సుమనోవ్రజీయమగు జ్ఞానాంభోనిధి స్వీచికా
ఘముఁ గూలంకషముంబొనర్చి తగుశ్రీకామాక్షిదామందహా
సమనంగాఁబడుజ్యోత్స్న మాపుత మహాసంసారతాపోద్ధతిఁ 13

ఘన కాశ్మీరరసంపుఁ దేజనెను పంకస్ఫూర్తిఁ గల్మాషతం
దనరంగా వహియించి హారగత ముక్తాప్రఖ్య హంసవ్రజం
బునకుం దన్నెఱిఁగించుకోనన మనోభూ శీతశైలాగ్రముం
డు నెఱింబారుచునీమృదుస్మితరుచిద్యోసింధువార్యాతగున్ 14

వరకాంచీనగరీశ్వరీ! కరముద్దై వాను న్త్వదీయంబులౌ
దరహాసద్యుతు లంబ! వాగమృత సంతానంబులట్టు ల్ద్వ్యస
ఝురి పర్యాయవిభేదముల్బలెఁ గృపా సంతానవల్లీ సుమో
ద్ధురగుచ్ఛంబులమాడ్కిఁ గంబుకులపుంద్యుత్యోఘముల్గాలలిఁ 15

స్తనసీమ న్ఘనసార పత్రిరచనాంచద్భంగి గద్దించి పా
వన కంఠంబున దంతపత్రముల రూపంబోయన న్గాలి ప
ర్విన యోష్ఠద్యుతులన్న పల్లవముల న్ప్రేంఖత్సుమంబై తన
ర్చిన నీదౌ దరహాసభాస మొదఁ గాంచీస్వామినీ! యొప్పుతఁ 16

నాసాగ్రస్థము మౌక్తికంబువయినందన్బిందు వట్లొప్ప గీ
ర్వా సంశ్లేషపుటూఁత దీనగతి దీప్యద్ధారముంబొందఁ దా
నై సద్బంధువుమాడ్కి నోష్ఠములదా నారుణ్య మోరంజన
న్వాసి న్సల్పఁగ నొప్పు నీస్మితరుచుల్ భద్రాద్రి మాకీవుతన్ 17

తన్నుం గొల్చెడువారి జాడ్యమనుసంద్రం బింకఁగాఁజేసి యె
ప్డు న్నెక్కొల్పుచుఁగైరవంబులఁబగన్బ్యాపిన్ని ద్రినేతో త్సవం
బు న్నిత్యం బొనరింపనొచ్చు విధునొప్పందోసి గర్వంబుచేఁ
జెన్నౌ నీస్మితకాంతి వెన్నెలగ భాషింతెట్లు కాంచీశ్వరీ 18

పురురభసంబున న్గవయఁబోవుతఱి న్బురమెక్కి దోసరి
ద్వరయను శంక నప్పెడఁద న్గలిగించుచు నప్పురారి వి
స్ఫుర దధరమ్మువణ్కఁగను బొమ్మలుఁగొటిలి నూనమోమువం
గ రహినొనర్చు నీదుచిఱునవ్వు పసందున కంబ ! మ్రొక్కెదన్ 19

నీముఖమిందుఁడౌ స్మితపు నిగ్గన వెన్నెలయే యదోయప
ర్ణా ! మృదువై చెలంగఁగ ఘనంబగు వేడ్కఁ జకోరపాళికి
న్లో మొనయంగనౌ నిది యలు ప్తవిచిత్రము రేఁబవళ్ల స
ద్గ్రామమునద్ది నొప్పరవిరిశ్ముల ఖేలనమాచరించుటన్ 20

అమ్మా ! నీచిఱునవ్వుపాల్కడలి కత్యంతంబు. సాహాయ్యక
త్వమ్మూనున్ బగడాలనేలలకు శోభంగూర్చు నోష్ఠప్రభం
జిమ్మిద్దేభిద దాన మున్నుదితముంజుట్టె న్బురాణుండిటో
సమ్మోళోద్భవ మాధురీసుధ నె యాస్వాదించుఁగామేశ్వరీ 21

శ్రీకాంచీశ్వరి నీమకోమల చలత్స్మేరచ్ఛవుల్విస్తృతం
బౌ కస్తూరి రచించు పత్రములజానౌ సుస్తనాగ్రాన సం
ధ్యాకాలద్యుతులట్లు మాటి కధరోద్యత్సాంద్రతేజంబుతో
వీఁక స్జేరి విలోలశారద ఘనోద్బృందంబులట్లొప్పెడిన్ 22

వైమల్యంబున నొప్పినంతనె సమత్వంబబ్బునే పాలకుం
గామాక్షీ ! యిల నీమృదుస్మితముతోఁ గానౌనుధూరానఁగా
నీ మాతాపిదుకంగ బాలోద వెడి న్స్మేల్భక్తితో మ్రుక్కస
ద్ధీమత్పాళికి వేడనే స్మితము సందీపించు భేదం బిదే 23

సమముగ సంస్తుతించెద రజస్రము నీదరహాసలక్ష్మికి
న్సుమతులు కప్పురంబు సుధ సొంపగు వెన్నెలఁ బద్మనాళసం
ఘము వరమౌక్తికప్రవర కాంతినిఁ గాంచిపురేశి! నాదుతా
పముల నడంపఁ దాదృశము పట్టెన దేటికి దేవి! మాంద్యమున్

మందారస్తబకంబగు జ్జనని! నీ మందస్మితాంశువ్రజం
బందు న్గ్రాలెడు మంజువాగ్లహరినా నంచస్మరందంబు; బా
లేందూత్తంసుని రాణి! చల్లనయి యొంతేని న్వికాసంబుఁగూ
ర్పం దథ్యంబు వసంతకాలమగు శర్వశ్రీమదత్యాభయున్ 25

పండినదొండపండువలె భాసిలుమోవి వెలుఁగులొక్కమై
మెండగు రక్తిఁదీర్ప నెలమిం గను నీదరహాసరోచులో
కొండలజేనిపట్టి! సొబగుం గడుమల్లెల నెట్టికల్వపూ
దండగ శర్వువక్షమునఁ దాఁగని మాకిడుఁగాతభద్రముల్ 26

శారదనీరదంపుఛవి జానయి విద్యుతిమించి పెన్గ్రపా
ధారలదారిసమ్మె వితతమ్ముగఁ జిమ్మెడు నీదరస్మితో
దార సుగుచ్ఛపూర కడుఁ దాజగము న్శిశిరీకరించునో
గౌరి!మహేశునెమ్మనముఁ గౌతుకడోలిక నూఁపుఁజూడనే 27

అమృతంబేయగు నీదరస్మితమునా నావాదు వ్యర్థంబె; ని
క్కమిదెల్లాజగదంబ! పాల్కడలినాఁగా నీసునుంజెందుఁ జం
ద్రమునిందించుఁ గలంచుగంగ నొగి మందారీయవృత్తంబులే
శము దావిన్నసహింపఁజాలదు ప్రపంచంబందుఁగామేశ్వరీ! 28

వితతప్రౌఢ కటాక్షకుంజ కుహరా విఖ్యాత సూనప్రజా
యితమై వక్త్రహిమాంశురుగ్జలధివౌ నెచ్చోతరంగాలఫే
న తతిత్వంబు వహించి యుబ్బుచనుజంట న్గప్పుపెన్గొ సెనౌ
స్మితమో కాంచిపురేశి! తావకము మాచెట్టన్వెసన్మ్రింగుతన్ 29

ఇల నేతొ త్రినవ మెల్లవారలకు నెంతేసల్పనీ శ్రీదునె
చ్చెలి విఖ్యాతికిరీటమధ్యమున వాసి న్దనున్నమన్నింపనీ
ఫలమేమంత నె శుభ్రతన్దగియు నీభవ్యస్మితాలోకనా
కులుఁడై కాంచెఁ గళంకిత న్విధుఁడు జంకుంబూనికామేశ్వరీ

ప్రకటానందము నమ్మహేశున కెలర్ప న్నంతతంబోపి ;చం
ద్రికలై నముద్రల కన్దరంగుల ధరిత్రీసీమలం దెస్గఁబా
తక సంసారపయోరుహాకరము డిందలజేయఁ బెన్మించుమై
మకరాంక ప్రతిభాకరంబులగు నీమందస్మితాంకూరము
ల్పికవాణీ! వెస మాయెడందలను దల్లీ! చల్లఁగాఁజేయుతన్

శివము న్మూఁడుజగాల కెప్డు నిడుచు న్జ్ఞానొందు కర్మాఘరూ
ప విశేషాంధ్యముఁ ద్రుంచి వే శిశిరసంపత్కామినీవక్త్రముం
బ్రవికాసంబునఁ జంద్రికాజలజ వైరఖ్యాపన న్నేర్పు చే
నవమానింప నలంకరించు భవదీయస్మేర మెంతున్మదిన్ 32

ముల్లోకంబుల వ్యాప్తినిం గనుచుఁ గర్పూరప్రతానంబుల
నెల్ల న్మూచెడు వేల్పుకన్నులకు నెంతేఁ దుష్టినందించి స
న్మల్లీసూన విరోధులై నగడు నీమందస్మిత ప్రక్రియా
లెల్లప్డు న్వెలయించుచున్న శుభము మాకీశాని ! కాంచీశ్వరీ ! 33

రమణీయంబయి కర్మపుం గుహాకచోరంబై ప్రసూనాంబకా
గమ తత్త్వంబును నేర్ప దీక్షఁగొని ప్రాజ్ఞశ్రీప్రపోషంబునై
యమితాఘఘ్నమునై కృపామృత తరంగానీక సంచారశీ
లమునౌ నీదరహాస కందళిని బాలా ! మాత ! నన్దన్పుమీ 34

సతము న్నీదరహాస కందళికి నోశర్వాణి ! శంకింతు మి
ష్టైతగ న్గాత్రిఁ జంద్రబింబ మొకఁ డబ్ధి న్నీకరంబౌచు; నా
తత దుగ్ధాంబుధి కెన్నఁగాఁ బ్రతినిధిత్వంబూని గాంగోర్మిసం
తతి బిబ్బోకమున వ్రీడంబమె వినూత్నస్ఫార మల్యాభకున్ 35

కాంచీభూషణి ! నాదు నెమ్మనము దుష్కర్మార్క నైసర్గికో
దంచత్కర్కశదీప్తిఁ దప్తమయి పంకాక్షిప్తమై తావకీ
నాంచ న్మంజు దరస్మితామృత రసంబం దర్థిమైఁ గ్రుంకి కాం
క్షించు న్దావ్యథఁబాసి హర్షమయ లక్ష్మీసౌధ మెక్కన్గడున్ 36

నీమృదుహాసమొండె ధరణీధరరాట్తనయా! వినమ్రులా
క్షేమముఁగోరు వేలుపులచెంగటఁజల్లి కృపాచ్ఛధారల
న్భ్రామ మనుగ్రహంబు వెలిపుచ్చుచు సమ్మదబీజరాజిసే
నాముఖపుంబెడందనె యణంగనొనర్చు సుధాతిశీతమై 37

అమితస్ఫూర్జితవిభ్రమాస్పద మనంగాభిఖ్యకందంబు న
త్తమిలజ్జేయునదైన నీమృదులమందస్మేర మోయంబ! నా
తమముంబాపుత దేనినిన్గనఁగ హస్తస్వీకృతి న్దాండవో
త్కమనస్కుండగు తండుచేమృదుఁడు వేడ్కన్బల్చినవ్వేఁచెనో 38

ధీరస్వాంతుల నొక్కఁడేఁడో కనుఁ బృథ్విన్గాని కర్మవ్రజా
కారగ్రంథనిబద్ధులౌజనులకు న్గాదందఁగా నెందునే
నాయూథంబుగ ముక్తితెన్ను నెద నొయ్యన్మూర్ఖుఁడౌనాకునా
దారి న్నీదరహాసలక్ష్మి వెలుఁగై తల్లీ! ప్రదర్శించుతన్ 39

విమలతఁ జంద్రబింబమది వెన్నెలనిగ్గులనేకను స్మర
త్సమయమువన్నె నంచలనెతాఁగనుఁ దమ్మియువిచ్చుటన్ప్రకా
శమెనయు నచ్ఛకాంతివిలసద్భగణంబులనే నభంబుఁ బు
ణ్యముల దివంబుఁగ్రాలుఁజిఱునవ్వులనీముఖమోమహేశ్వరీ 40

మానగ్రంథిసమాఖ్యరాహువు నవామందామలప్రేమ రా
కానీహారకరున్గ్రహింప నపుడే కామాక్షి! సంఛాదితం
బౌ నీయాచిఱునవ్వువెన్నెలను నార్యా! మాటికిన్గాంచి తా
రానాథార్భవతంసుచేతము చకోరాఖ్యానము న్దాచెడున్ 41

నీయొడినుండి చన్గుదువనొక్కొను వేడ్కఁ గలట్టిఁడౌటచే
నాయెడఁ బైకిఁజూచి బిసమానననూహ గజాననుండు దా
నాయతమైనతుండమునఁ నమ్మరో! నీసుతుఁ డందిలాగఁగా
నై యలరారునీదు దరహాసవిలాసముఁ గొల్తు శాంకరీ! 42

ఆపీనస్తనయుగ్మమధ్యగత ముక్తాంచన్మహామాల య
స్వాపాశ్లేష విమర్దసంభ్రమత మించన్వ్రీలి యాశాంకరం
బౌ పెన్వక్షమునంబడంగ నపుడే యాభంగి నవ్యంబుగా
మాపన్నాలిన నీస్మితాంశుతతు లమ్మా యాడుతన్నామదిన్ 43

మందారంబున నీస్మితప్రభలకు న్మాత్సర్యమాఁజూడ నా
కందర్పద్విషునందుఁ జూడఁబడు రాగస్ఫూర్తి కామాక్షీ! రా
కేందుత్విట్చ్ఛయగుచ్ఛమోపడయుఁగాదే భూరిదోషాంకురా
ళిం దెల్పంగదె శుద్ధపాళి నెటుపాళి న్యుద్ధత న్గాంచనో? 44

తా్రివిరివేలుపు ల్మనుసుధ న్మథియించిరి పాలసంద్రముల్
దేవధుని న్గపర్ది తనదీర్ఘజటా నిగళాలఁ గట్టె రా
కావిధు సైంహికేయుఁడు నికారమొనర్చును గామకోటిపీ
ఠావని! వాగ్విదగ్ధతకు నందక నీస్మితగుచ్ఛ మొప్పెడిన్ 45

నీమందస్మితకాంతిదాలహారి సందీపించు నన్యాదృశం
బౌ మేల్వెన్నెలయై యుమా! ప్రతిపదం బద్దానిదాసంగతి
న్నీ మేలౌచనుఁబమ్మెదోయి కనెపన్నం గుట్మలీయంబు నొం
డేమో విచ్చకవిచ్చు చల్లనజనిత్రీ! నీముఖాబ్జం బిలన్ 46

అధరాభాస్తృతపల్లవాలఁ జితనంబందు న్నితాంతంబు న
న్మథవిద్వేషియెడ న్స్మరాశుగ వితానజ్వాలలన్గొల్చుఁ బె
న్గ్రీష్మనిందించు మృణాళచందన సితేందుత్విట్సుహారాళిఁ గాం
చెధరన్నిస్మితశోభ తా విరహిణీ స్త్రీరీతిఁ గాంచీశ్వరీ! 47

అసమంబైనవికాసముంబడయు సూర్యాలోకపుంజేత న
మ్రిసమూహంపుఁ దమంబడంచును దలంప న్దోషవిద్వేష మూ
ను సతంబు న్జడతన్దొలంచెడు ముఖాబ్జోరు ద్రుమాన్నిర్గమిం
చుసుధీవంద్యభవత్స్మితద్యుతిమయజ్యోత్స్నాళిచిత్రంబుమా 48

తారుణ్యాద్విరదాగ్ర్యకుంభముల నేస్తంబైన చన్దోయిపై
సౌరు న్మౌక్తికహారమై కనెడు యుష్మన్మందహాసాంకురీ
యోరుస్ఫీతి భవాని! భద్రదముమాయుత్కృష్టదుర్బోధదా
ఘోరంబుఁ హృదయప్రమంథకముఁనంబా మాపుతన్వ్యాళమే 49

అమ్మా! నీదరహాసభాసలివి పేర్మాచ్ఛానిల పేర్కిత
త్వమ్ముంబొంది శరత్ప్రమోదములొనాఁ దారాడుఁదామల్లనం
జుమ్మా! శర్వగళప్రభాంబునిధిఁ గొంచు న్మజ్జనంబు న్వినీ
లమహార్ణవ న్నను నల్లమబ్బులటు చెల్వొందుఁ గామేశ్వరీ! 50

చతురాస్యైకవిహారపుంగృతికి నిచ్చ ల్వ్యాకరించున్నమం
చితరుద్రాక్షము లానెడిన్గయిని వాక్ప్రిగుంభకల్లోలభా
సితయౌఁ గ్రిందుఁగఁ జేసిభాసిలుఁ గనచ్ఛ్వేతాబ్జము నీదర
స్మిత . ంభాస సరస్వతింబలె మహేశీ! కామకోటీశ్వరీ! 51

నీ లేనవ్వుపసందు కప్పురపువన్నెం గ్గొన్న పెం దేజు చే
నోలి న్నోముసుబాము మోవిఁ గొనుఁ బీనోరోజను ర్వాటిఁ దా
నాలింగించెడు రాగపుంభరము నొయ్యంజూపు హృద్ధైర్యముం
దూలించుఁ బతియట్టులౌర జగమందు న్గాంచి కాధీశ్వరీ ! 52

వైశద్యంబున విశ్వతాపవితతి న్వారించు పెంజేతదా
పాత్రత్వంబున సర్వజంతుతతి నేత్రప్రీతికృత్పాండితీ
వైశిత్యంబున నీస్మితద్యుతుల యంందంబంద రేయెండ కా
మేశీ ! కోరి సముద్రపోషణత నెంతే దూష్యరీతి న్గనెఁ 53

లావణ్యామనుతమ్మితీ వెకుబిసవల
యంబులైయెంతయునలరు నవియు
సౌందర్యమనియెడు సామజగామణి
శోత్రచామరలె సంచుఁగని నవియుఁ
దారుణ్యమనునట్టి స్వారాజ్యపుంబీజ
ములకంకురములయి చెలఁగు నవియు
నానందమను సుధాంభోనిధి వీచికా
వలి శీకరములయి వఱలు నవియు

నాననాబ్జములకు హంసలై విలసిల్లు
నట్టి నీదు మందహాసములను
నెల్ల జగముఁ గన్నతల్లిరో ! కామాక్షి !
మన్మనోఽఘములను మలఁపు మమ్మ 54

ఉబ్బినగుబ్బదోయిపయి నూఁగెడుకెంపులమాల సంగతిం
బ్రబ్బినరాగపుంగరిమ మధ్యపథంబు నలంకరించుచుం
గొబ్బున గిబ్బరాతు జడనూఁకటికానను జారుగంగకుఁ
సిబ్బితిఁగూర్చునచ్ఛత లసించెడు నీదరహాస మంబికా! 55

మంచిగలానికెష్టా సుగమంబు ఫలంబుననుగ్రహాభిధ
న్గాంచినపెద్దమ్రాకునకుఁ గట్టెడుదానినిఁ దోఁపఁజేయుచు
న్నంచును మున్నువిచ్చికను సత్సుమమట్లు ప్రగల్భతాసమ
భ్యంచితమైన నీదుదరహాసము మా కుమ! భద్రమిమావుతన్ 56

ధానుష్కాగ్రిణి వల్లువిభ్రమధరాదారుండు సద్యావనా
ఖ్యానోదాత్రిజ్యరమావిభాసి కుటిలంబౌ భ్రూలసజ్జ్య న్నలీ
లానద్ధేక్షణబాణుఁడై మృదుని గెల్వంబోవుచో నంబ! తా
సేనాధీశతఁ గ్రాలు నీదగుదరస్మేరంబు కామేశ్వరీ! 57

విసమునుముద్దఁజేసి మెసవె న్మనుగుదుఱఁడు నాఁడువాని మా
నసముచలింప దక్షిదహనద్యుతి కగ్గముఁగాదుసగ్గి యి
ష్టసమశరజ్వరాగ్నిశిఖ నర్గితమాటకు హేతువెన్నఁ ద్వ
త్ప్రిస్వ్రమరమందహాసలవభాభవ వైభవమే హిమాగజా! 58

యమునాభంగచయంబుతోఁ గలియుదివ్యద్వీపినింబోలె నీ
లములౌ మబ్బులఁగూడుఁ జంద్రరుచిజాలంబట్లు కామాక్షి నీ
కౌమరాలేనగ వంజనంపుఁ బలునిగ్గున్మ్రించుఁ గేశవ్రజీ
యమహాకాళిమఁగూడి తానెనయు నొండౌపెన్దశ న్నాంభవీ 59

శివునందుం బ్రణయంబునన్జెలఁగు కాంచీనాయకీ! తావకం
బవు మందస్మితము న్గుముద్యుతిని నన్యన్గాఁగ నూహింతు మి
ద్దివ్యస్ఫేద్వ్యాహముఖేందుఁగాంచు నెడ నెంతేఫుల్ల మౌనస్థ్రమాం
ద్యవిశిష్టంబయి తద్విపర్యయపుఁ జేఁతన్సల్పు లేకున్నచోన్ 60

ధాతువాత్రపుఁ గర్దమంబులను రక్తస్ఫూర్తినింబొంది స్వ
స్ఫ్రీతోద్భృత్తును బాలభాస్కరకరస్తోమంబున న్శారద
శ్వేతాభ్రాళియు నొప్పు కెంబెదవిడా చెల్వంబుచే రక్తిమ
స్ఫీతింజెందిన నీస్మితప్రభకుఁ బ్రభ్వీ! సామ్యముంగోరెదున్ 61

శరదభ్రింబుఁలుచాలు బాలమిహిరోసవ్రాత్రముంగూడి యా
సురకల్లోలిని ధాతుపంకరుచి సంచుంగాంచి కాంచీపురీ
శ్వరి! బింబాధర కాంతిపుంజములదా సాంగత్యముంజెందు నీ
దరహాసద్యుతితోడ సామ్యమును జెందంగోరుఁ గామేశ్వరీ! 61

నీదుముఖేందుభూషణము నీదరహాసముఁ గన్నదోయికా
మోదముఁగూర్చుఁ దిగ్మతను బొందెడు శీతకనుండొకప్పు పి
ల్లీదరఁగొల్పి మంచు వహియించు జనిత్రిరో! తాపముద్రి నీ
మేదిని నాణిముత్తెము గమించు మలీమసత న్సితంబునై 62

సతము న్నీదరహాసమంజరిని విశ్వవ్యాపక న్సజ్జనుల్
క్షితి రేమెండగనెంత్రు నిర్మలత లక్షింపంగనానంద్రు ద
క్షత మాతాపముఁబాప దాంతరపుటుచ్ఛధ్వాంతమున్మాప ద
ద్దితగన్ దుఃఖులమైన మేమెవరమో దేవీ! యెఱుంగన్వలెన్ 63

ఒగిఁ బ్రిణయోద్ధమా కలహాయుక్తినడంపఁగ నంఘ్రివారిరు
ద్యుగమున నమ్రిఁడైతగు నుదుప్రిభుమాళికి బంధుజీవపుం
జిగని జయించు నోష్ఠపురుచి న్నిరసించినయట్టి నీదులే
నగవను భవ్యచంద్రికయన స్మిపురాణి ! వయస్యమైతగున్ 64

ముక్తాళికది పరిమోచనం బొనరించు
ముక్తాళికిద్ది సమ్మోదముఁ గొలుపు
మాటికినద్ది నెమ్మది దూరముగఁదోఁయుఁ;
బూతంబుఁగా జేయుఁ; జేతము నిది
పొడమెడు నద్దియెప్పుడు జలోదరమునఁ;
దగు దూరముగ జలోదరమున కిది
మోవిచే నూఁదునప్పుడు నొక్కఁబడునద్ది;
మోవిపైఁ గేళిసల్పును సతమిది

యట్టి శంఖమునకు నమ్మ నీదరహాస
మంజరికిని లోకపుంజమునను
సాటిఁ జెప్పనెల్లు సమకూడు నేకామ్రి
నాథ హృత్ప్రిహర్షణ స్వభావ! 65

కనుచు న్దరహాస భాలహారిదా గణ్యాచ్ఛపాండిత్యలీ
లను మందారసుధాకరాదు లెపుడు న్లజ్జ న్వెసన్బాసి త
మ్మునె విశ్వంబున గొప్పఁగాఁదలఁచు చేమో వస్తునేత్రృత్వము
న్ఘనవైశద్యముఁజూపు లోకులు నగంగా నేటికో శాంకరీ! 66

శ్రీకామాక్షి! హిమాగరాజతనయా! క్షీరాబ్ధికి న్నీస్మిత
శ్రీకి న్భేదమొకింతవల్కెడము లక్ష్మి న్మనోన్నకష్టే యొకం
డాకంజాక్షునకిచ్చెఁ బాల్కడలి నీదౌమందహాసంబొ తా
నేకాలంబును నిచ్చు నెల్లరకు దేవీ! లక్ష్మి వాగీశ్వరిన్॥ 67

కాంచీపూర్వరరత్నదీపకలికా! కామాక్షి! యీవిశ్వమం
దెంచ న్గంపకుఁ జెంపఁ గోపురముగా నెప్టొప్పి త్వన్మందహా
సాంచచ్చంద్రిమహాస్సుఁ జంచువులతో నాస్వాదముజ్జేయుచు
న్మించంగల్గు చకోరపుంజములె భూమి న్ధన్యముల్శంకరీ! 68

శైత్యప్రక్రియమూని నమ్రులకు నాజాడ్యప్రభన్బాపుఁ దా
నత్యంతంబును రక్తిమన్బాలిచి యాహా! కొల్పువైమల్యమున్
నిత్యంబు న్గలభాషణాఢ్యయయి మానివ్రాతమున్దన్ను నీ
భూత్యావాసము మందహాస మగరాట్పుత్రీ విచిత్రంబిదా 69

మొలనౌ మేఖలమ్రోఁగఁ జేయుచును సొంపుంగన్న మందంపుసం
చలనంబొప్పఁగ నూఁగఁ గన్బొమలు లజ్జాసంయుతాపాంగసం
కలనంబొప్పఁగ నేది మారరిపునింగారించెనో యట్టి నీ
యలసంబౌహాసితంబుఁ గూర్చి జగదంబా మ్రొక్కెదన్భక్తితోఁ

అందమునందు నీదుదరహాసపుఁ దేజులమొల్క ముజ్జగం
బందునఁ జక్రవర్తిత మహాధవళప్రభకంద నోజగ
త్సుందరి యావరాజత విధుండితఁడందెడు జ్యోత్స్న చేటియౌఁ
జెందుసఖిత్వము న్దివిజసింధువును న్సుధదాప్రవాహమున్॥ 71

సలుపు స్నేహాలకున్ఫలంబు నెది యుష్ణత్వాపనోదంబు ద
క్క లసచ్చంద్రిక చంద్రచూడసతి లోకాలందు సంతాపముం
దొలఁచు న్మంజులవాక్పటుత్వమునిడు న్ఘోరంపుసౌందర్యము
న్గలిగించు న్వెలయించుఁ గీర్తిసముదగ్రి న్నీస్మితోద్దీప్తియే 72

కలువల వైనవన్నెల కళల్మెప తాప్తియు చంద్రకాంతినే
కలిగెడుఁ జంద్రికారుచియుఁ గ్రాలుఁ బ్రదోషపు వేళనందియే
యిల నవమౌక్తికంబునకు నెచ్చగుస్వచ్ఛత సంస్కరింపనే
యలము మహేశి నీనగవుదా విశదత్వమన న్విసర్గమా 73

మొయిళులడాఁగె దేనభయమున్నని శీతకరుండు మౌక్తికా
ళియుఁగనె శుక్తికాంతరవిలీనతఁ జొచ్చె సరస్సున న్మృణా
ళియు నుమ! యట్టినీదయిన లేనవుపెన్నిరియొప్పు నాదున
వ్యయమమతాభిమానము రయంబునఁద్రుంచుత శంభుసంగినీ74

పురువాత్సల్యము హర్షసంభరితము న్మొల్పించు హేరంబుపై
శరసంభూతుపయి న్మురారిపయి సొజంగబైనపేమాంకురం
పురహిన్గొల్పు వినమ్రలాజనులపై పూర్ణంబుఁ గారుణ్యముం
బఱపు న్నీదరహాస మట్టిదెటు సెప్పన్శక్యమా శాంకరీ! 75

ద్విజరాట్కోటిధనిదానమై ద్విజులతో వేసంగము న్సల్పు భూ
ధ్రిజ! వాక్పద్ధతిదూరకంబయి కను న్దత్సాహచర్యంబు స
ద్విజనితీ! పశునేతపై రతిఁదగు న్బశ్వాళికపాప్యమ
య్యుజిగిన్బొల్చెడు నీస్మితామృతము డాయున్గాతన న్నెవ్వడున్

తనసాజంబగు మాధురిన్గొలిపి నిత్యంబర్థి నర్ధేందుచూ
డునిపైఁ బ్రేమసదంకురశ్రీమవు నీటుంజాటు నీమందహా
స నితాంతద్యుతి యెట్లుదూఱెడు నజస్రంబావలన్గారవిం
చినయాగంగను జంద్రిసత్కలికఁ గాంచీకామకోటీశ్వరీ! 77

వరమాధుర్యవిహారమంటపములై ప్రాలేయతాముద్రఁ దా
ల్చి రహిన్వైశదమా మహాదశఁ గడు న్జెన్నొందు నీసత్స్మితాం
కురము ల్మాతరో మూఁటినీగుణముల న్మూర్తి న్గ్రమంబొప్ప వే
గిరమే కూర్చుత నావచోరుచి నెద న్గీర్తిప్రరోహంబునన్ 78

మందాక్షంబును దక్షవైరినిఁ గనం బట్టు న్శశాంకాంకురు
జ్జృందాదీక్షనుబూనుఁ గామనయనీ! నీవైన మందస్మితా
మందస్ఫూర్తులు ద్రాక్షఁ బేనెఁగలయమ్మాధుర్యమున్నాదువా
గ్బృందాన న్వెలయించి ముక్తిఁగనఁగా హృద్వీథిశోభించుతన్

పూతములౌచు మాధురినిఁబోల్చి కడున్శిశిరంబులౌచు గం
గాతటినీజలాల మెయిఁ గ్రాలెడు త్వద్దరహాస భవ్యరు
గ్వ్రాతము లేకచూతవిభురాణి! ఘనాఘపరంపరా విపా
కాతికళంక మన్మతి రయంబున క్షాళనముంబొనర్చుతన్ 80

అనిశంబు న్శశినేత నీదుదరహాసాంకూరవారంబుచే
జనయిత్రీ! పరతంత్రితుండగుచుఁ దత్సావర్ణ్యపున్బుద్ధి నిం
దుని మందాకిని నాదల న్మణిఁగ మంతుంగన్న పెన్దండఁగాఁ
గొనెఁ జెన్నొందవకుంఠనంబు నవవైకుంఠంబుబూది న్మెయిన్ 81

పరమంబై తగుప్రేమయన్నతకు నంబా యందమైతోఁచు క్రొ
వ్విరియా నీచిఱునవ్వు మంజువచనావిర్భావసౌరభ్యమం
దిరమై యల్లనఁగందళించుఁ బ్రియుడా నెమ్మోమువీక్షించున
త్తఱి మాటాడినఁ గుట్మలించు విరియున్నాగౌఁగిట న్బల్కులన్

ఝురములమూఁటనొప్పు దివిషద్ధునిదైన చతుర్థనూత్నని
ర్ఝరమొ సమస్తతాపవినిరాసకమా నమృతంపు టొండు మే
నో రుచిరగీర్మృదుత్వముఁ దనుండగ నేర్పఁగఁ జెంతజేరు క్రొ
త్తరకపుఁబాలో మందహసితంబు త్వదీయము కామలోచనీ 83

మోముఁదమ్మికి సాజమైనవిభూషణంబును సత్సఖీ
కామినీమణి భాష కెప్పుడు గణ్యవిభ్రమ నీవి యా
సోమశేఖర దృక్సుపారణ క్షోణిదర్పకు కీవికి
న్నాముది న్నగు శాంకరీస్మితకాంతి పల్కులకందునే ? 84

కారుణ్యాబ్ధి కొకందు పుష్పవనిశృంగారపరిసిద్ధేంది రా
గారంబు న్మృదుసూక్తిపూరముల యోఘంబున్ రసశ్రీకి వి
స్తార శ్వేతిమ కందళంబు మధురత్వస్వర్గపున్నత్మ్రి యో
గౌరీ! నీదరహాసచాతురి శుభగ్రామంబు మాకీవుతన్ 85

ఉదయంబు న్సతతంబునందునది జన్యవ్రాత జన్మాదికా
పదనీకంబును దుర్ంచునట్టివియునుం బ్రౌఢానుకంపాసమ
గ్రదశాయుక్శిశిరాంశులై వెలయుత్వద్ద్విజస్మితాంకూరముల్
విదళింపంగలవౌత మాతమము జేపే! కాంచికాధీశ్వరీ! 86

కరుణాపూర సుధాంశుభాసలు జగత్కల్యాణదంబు ల్నిరం
తరలబ్ధోదయము ల్సరీరుల సముత్పన్నాత్యంత సంతాపసం
హరణంబు ల్జననీ ! త్వదీయదరహాసాంకూరము ల్వే విస్ఫు
త్వరము ల్తేజున మాతమిస్రతతి శర్వప్రేయసీ ! తుంచుతన్ 86

వరలావణ్యవిలాసినీనటికి దీవ్యద్రంగమై తుంగమౌ
మెఱుఁగుంగుబ్బలదోయి యాదలపయిన్మొల్చెల్వముంగాంచిత్వ
ద్దరహాసద్యుతిరాజి కెంబెదవిదాధామాంకురాళి న్విచి
త్రరమన్గాంచియొనర్చువిద్రుమసుముక్తాస్రగ్వితానప్రభన్ 87

భవురాణీ లలితంబునీముఖము స్వాభావ్యానవే శ్రీసదా
శివుని న్దృష్టినిఁదన్పు లేనగవువాసి న్గాలుచో నేమిసె
ప్పవలెన్ గంజ మదెల్లలోకముల దృక్ప్రహ్లాదకం బింకనీ
యవని న్శారదవేళఁ దావిరియనానందంబ దెబ్బంగిదో 88

తావకసేవకు ల్భువి సతమ్మును గర్మలయంబొనర్ప మై
త్రీవిలసద్రసమ్ము నొనరిం త్రిమలాశయు లైనవారితోఁ
బావనకీర్తిఁగాంతురు శుభప్రదనిర్మలసూక్తిసద్గుణ
న్వే వెలయింతు రీదగు వినిర్మలహాసకల న్మహేశ్వరీ ! 89

కామాక్షీ సురవారనేత్రిగుల నాకర్షించు శైత్యంబుచే
సోమున్ స్తంభితుఁజేయు నప్పుశుచయేశు న్మోహపెట్టు న్విప
ద్గ్రామోచ్చాటనసల్పు లోకములఁ జక్కాడున్మహాసంసృతి
న్నీమందస్మితమాంత్రికుం డిఁకనొగి న్ద్వేషించుత న్మావెతన్ 90

అవని న్దర్మరకర్మఘర్మసమయవ్యాపారతాపాగ్ని నా
ర్పవిరాజన్నవహర్ష వర్షజసుధాభవ్యాపగా శీకర
వ్యవసాయమ్ములు కామకోటిరో త్వదీయామందమందస్మిత
చ్ఛవితారళ్యము లస్మదీయకలుషోచ్ఛత్రాసము వ్యాపృతన్ 91

శ్రీకామాక్షి త్వదీయ మందహసిత శ్రీచంద్రమోదీప్తి య
స్తోకంబై తగ భక్తహృత్ప్రతిభయందు న్వార్ధిదా చాతురీ
ప్రాకట్యంబునకుద్ది చీఁకటికి దౌర్గత్యప్రసారంబులు
నైకోఁ గ్రైరవహాసచర్యపదవి న్గాలందదే ! శాంకరీ ! 92

శివురాణీ ! విశదత్వముద్రఁదగునా చెల్వంబు స్వీయప్రకా
శ్యవిధంబు న్బలుమారులష్టపుడు లోశంకించి మందారము
ఖ్యవిశేషంబుల వానిఁజెల్మిఁ గుతుకంబల్పంబు కా నీస్మిత
చ్ఛవియందే సతతంబొనర్చుకొనెఁదా స్వైరాసనావాసమున్ 93

ప్రారబ్ధంబను చండమారుతము రేఁప న్మ్రించు సంసారరూ
పోరుప్రజ్వాలదగ్నియందుఁబడి యెంతో చింత సంతాపము
న్గూర న్వ్యాకులుఁడై నన న్నమృతయుగ్భారిప్రవర్షోరుధా
రారమ్యామలశీతహాసముల నార్యా ! సిక్తునిన్సల్పుమీ 94

రసనాగ్రంబుననాడు గీర్లలన దా రమ్యత్వపుంబొంగు చెం
త సఖిత్వంబుననొప్పి పెన్నియతి దానంబాడఁగాఁ జల్లనై
యసమానంగతరంగయుక్తయుసుధాత్మ్యపూర్ణయాగంగయై
లసియించుంజుమి త్వద్దరస్మితసము ల్లాసంబు కామేశ్వరీ! 95

మరుఁడనుగాలిచేఁగదలు మంజులతావకమందహాసని
ర్ఝరతటినీతరంగనికరంబునఁ జేరి సువిధుండుతోఁచి శం
కరునకు వేడ్క నెవ్వఁడుఁ దగన్నలుపుంగనయందుమున్ని శాం
కరి ! వెస నాదుచేతన యిఁకన్గలతాపము నెల్లనార్పుతన్ 96

మనమనుపాలసంద్రమున మంథనగంపుఁగృతి జ్జలించుచుం
డిన ఘనరాగమంథనగ నిస్తులఘర్షణఁ గల్గు నీదుపా
వన దరహాసభాసుధ నవారిగఁ గ్రోలఁగ వేడ్కయన్ రసం
బున మృడలోచనత్రయి ప్రమోదతరంగిత యయ్యె శాంకరీ!97

నీవున్నంభుఁడు నొండొకళ్లఁగన నున్మేషత్సుకౌతూహలా
ఖ్యావాత్యాపృథుఘట్టన జ్జలితమా నానందదుగ్ధోరుపా
రావారంబున సంవిదాత్మకము తారంగాంకురంబొందు తా
దైవార న్నుకవుల్స్మితంబనెద రద్దాని న్శివోల్లాసినీ ! 98

మాధుర్యాగమసంప్రదాయమును నమ్మా ! మందహాసంబుల
న్సాధింపంగలవయ్యెనో నుడులు నీషద్ధాసమే సూక్తుల
న్మాధుర్యంపుఁగల న్గమించెనో తలంప న్సంశయాధ్యానవే
నాధీయూఁగెడుఁ బారమార్థ్యసరణి న్దానందకేయంబికా ! 99

కరుణాసారసనేత్రికు న్గలి సెలంగ న్సౌధముల్ సత్కవీ
శ్వరవాగ్గుంభ సుధాఝరీప్రసవవాసంబు ల్యమీన్ద్వాంద్యసు
స్థిర నిశ్శ్రేయససార్వభౌమపదవీసింహాసనంబు ల్మహే
శ్వరి ? నీయందపు లేఁతనవ్వులవిలాసాలందుతన్మానతిన్ 100

గీర్వాణాంధ్రాంగ్లకలా
ధూర్వహా ! బహువిజ్ఞనిచయ, తుష్టిదకవితా
నిర్వహణ ! హాసవన్ముఖ
పార్వణవిధుబింబ ! సాంబపదభజనరతా ! 101

సద్వంశోద్భవ ! సావధానహృదయాబ్జాతాంతరావాసితాం
చద్విశ్వేశ్వర ! సాధుమార్గచర ! మోచాస్వాదువాక్సార ! ధీ
మద్వారానిశశస్యభవ్యచరితా ! మావాఙ్మేశానరూ
పా ! ద్వంద్వప్రజిగీషుతాకలిత ! సంపన్నాత్మవిద్యానిధీ 102

సుగుణమణిసుపేటీ ! శుద్ధగీర్వాణధాటీ !
నిగమనిచయకోటీనిష్ఠసర్వోత్పదాటీ !
దిగమలవసనాంచద్దేవదత్తావధూతా
నుగయతిగణరాజానుగ్రహోత్తామలోక్తీ ! 103

♦ గద్యము ♦

ఇది శ్రీమచ్ఛంకర సద్గురుకరుణా సమాసాదిత సరసకవితా విభాస్వర ప్రవర్ధమాన శ్రీమద్భమిడి పాట్యన్వయపయః పారావార రాకాసుధాకర శ్రీమచ్ఛాండిల్యస గోత్ర పవిత్ర సంతతాగ్నిహోత్రపరిచర్యోపాత్త ఘనతర సద్వైదుషీ విరాజమాన వేరసోమయాజిపౌత్ర బుధజనసంభావ్య సచ్ఛేముషీకలిత వేంకటాచలపతిసుధీతనూభవనైరంతర్య భక్తిసంభావితభవానీధవ విబుధజనవిధేయ వేంకటసుబ్రహ్మణ్య శర్మాభిధేయాంధ్రీకృతంబైన శ్రీకామాక్షీస్తుతి యందలి శ్రీకామాక్షీ మందస్మిత శతకము

పూర్ణము.

శ్రీ మేధా దక్షిణామూర్తి సద్గురు వరార్పితము.

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# కామాక్షీ స్తుతి

## ఆర్యా శతకము

శ్రీశారదానిశాహ్వాని
వేశా! పేశలమధూక్తి విలసత్కవితా
ప్రాశస్త్యా! వినుమీ యా
ర్యా శతకముప్రీతి దక్షిణామూర్తి! గురూ!

కారణపరచిద్రూప క్రృ
పారసకాశ్మీరసుస్తబకమృదులతనూ
డారలతకామపీఠి వి
హారముసేయు నొకతల్లి యాకాంచిపురిన్.

విలు నమ్ము సృణినిఁ బాశము
నలు కేలఁగొని కుచభారనమ్రతఁ గాంచీ
నిలయమ్మునఁ దిరుగాడెడు
తలి మోక్షానందకందఁ దలఁతు నెడందన్ 2

చింతితఫల పరిపోషణ
చింతామణి కాంచినిలయ చిత్సుఖమయి మ
త్స్వాంతము శాంతిలఁజేయుత
నెంతయుఁ జిరసుకృత లభ్య యీశానిదయన్ 3

వంకర యలకలతోడన్
బొంకపుఁగుచయుగముతోడఁ బొలుచుచుఁ గాంచి
న్గుంకుమజిగి నగు మేనున
సంకాశిలు కొండ జేని సర్వస్వమహో! 4

వలజేని చదువు నేర్పఁగఁ
గులగురువై వఱలుచూపు కోపునఁ గాంచీ
విలసత్పురి నొక కన్నియ
యలరుల విలుకాని గెలుచు నలఘుఁ గలంచున్ 5

మలకవకు మారురూపగు
బలిసినచనుదోయి కమల భాసురనయనం
బులుఁదగఁ గాంచిన్గల ని
స్తులమతా నిక్కలకు వంగి జోతలనిడుదున్ 6

వేద్దైదంపర్యము విధుఁ
డౌదలఁగలదొడ్డవేల్పు నైశ్వర్యముఁ గాం
చీదివ్యసీమ నలరెడుఁ
దాదాత్మ్యప్రకృతి శిశుసుధాకరధరమై 7

కంపాతటంబునం దను
కంప న్దగి భువనభూమకంచుకమై ధై
ర్యంపుమహిమంబు శార్వము
నొంపఁగఁ దగు పాటలిమము నొందుఁ దలంతున్ 8

కాంచీపురనిలయముఁ జే
మించినదై యించువిల్తు మిసిమిఁజివడయున్నన్
సంచుఁగనునంబ; శ్రుతిశీ
ర్షాంచత్కలిక న్భజింతు నానందమయిన్ 9

గంగాధరున కధీనము
శృంగారాద్వైతతంత్రసిద్ధాంతము ను
త్తుంగమనోజ్ఞస్తన యుగ
పుం గలిమిఁజెలంగు కాంచి పున్నెము నెంతున్ 10

కాంచీపుర మణిభూషను
బంచాస్త్రోత్పాదకోర్వపాంగయుత నుపా
సించెద నొకపరము న్గలఁ
బంచాస్యునియెడమతొడపు పయినాసీనన్ 11

అనిశమునాయెద కేళీ
వనమాత న్గంపదరిని వాసింగను భూ
ర్యనుకంపాకోరక దృ
ష్టి నిపాతములైన కొన్నిచిద్భాసలకున్ 12

వరచూతభూజ మూలము
న రహించెడునాదిమునకు నయనామృతమై
నెఱిజవ్వనమున జానౌ
పరమశ్రుతిగుహ్యామూలపదము భజింతున్ 13

శ్రీద్రైవారెడు కాంచిని
నాదిమ వరపీఠసీమ నంచితయోగుల్
సాదృతిఁగను రక్తిమదా
మేదురతా సంప్రదాయమే నను మనుచున్ 14

శంకర దేహాంకితయై
యంకురితోరోజ కంకణాశ్లేషయునై
పొంకంపు నిత్యతరుణిమ
నంకిత నొకబాలఁ గాంచి నద్భుతఁగంటిన్ 15

కమ్మని విల్లును దావులఁ
జిమ్ము శరముఁబూని బంధుజీవద్యుతి చో
రమ్మా చిత్తనువున జ
న్మమ్ము మలగ్గన్న తేజున నోమ్మదింతున్ 16

బలిసిన గుబ్బల బరువున
నలఁతినడకనంది మధుర మగు లేనగవుం
జెలఁగ గ్గాంచి నెసఁగు పూ
విలుతుని సామ్రాజ్యగర్వ బీజము నెంతుఁ 17

ధరణిమయి వారిమయి నం
బరమఁయుని జ్వాలనమయి నభస్వన్మయి భా
స్కరిమయి హోతృమయి సుధా
కరమయి నాదిమను నంబఁ గాంచెదఁగాంచిన్ 18

లీనతఁగను మునిమనమున
ధ్యానస్థిమితమయి కంపదరి తప మొనఁగన్
బీన కుచభరమున న్దగు
మీనధ్వజ తంత్రిపుటెల మిని వినుతింతున్ 19

తెల్పుపై యలంతి నగవునఁ
గలుగమిఁగాను నెడఁగాంచి క్రాలఁగటాక్షం
బులఁ జలువ బలుపుఁ జనుఁగవఁ
బలుకు నెదన్నించు తల్లిఁ బరమ భజింతున్. 20

శివుకయి తాఁకునఁ బులకిత
మవు తనులతఁ గాంచి మేర నలరించెడు తుం
టవిలుతుని నెఱి పటీరపు
జివ నాదగు మ్రోలనెపుడు సెలఁగెడినొకదా! 21

విరితూపులాని కలిమినిఁ
బరఁగించెడు మేనితోడ భాసిలి కంపా
వర పులినచరి పురంధ్రి
వర యొందు పురారిఁ గప్పివై చుఁ బులకలన్. 22

తరుణిమదా సర్వస్వముఁ
దరుణారుణ సంప్రదాయ తనులేఖంబై
వరకంపాతటిఁ దనుతై
క్య రసాస్పదమధ్య మాద్య మగు తే జెసఁగున్. 23

విరితూపులాని పౌష్టిక
వర కర్మవిపాక మొందు వఱలెదుఁ గాంచీ
పురి నా త్తయావనముఁ జఁ
దురుదాలుపు నభ్యుదయమునుం గని కొలుతున్. 24

కాంచీ పురవరమందు ర
హించుచుఁ దలఁ దమ్మిదాయ నెసఁగెడు నగఁగాఁ
బూంచిన సంవిన్మయమా
నంచిత వాక్పురుషకార మందె లయింతున్. 25

కైరవ హితావతంసము
సారస్వత పురుషకార సామ్రాజ్యము నా
గారిత కాంచియునై దై
వారెడు సంవిత్తులో జవమున లయింతున్. 25

తుమ్మెదలఁ దనుప్ర నమ్మన
నిమ్మగు మాధుర్యరసపుటిక్క ధనువుఁ గై
దమ్ములఁ దగఁ గాంచి విహా
రమ్మన నాదృతి నెసంగు గ క్తిమ నెంతున్. 26

పారిజదువుల యాదలలను
రాజీవములందెసఁగు మరంద స్యందం
బై జాంబవ కుంభ కుచం
బై జానగు శివుమహాంబె యర్ఘ్యము నాకున్. 27

అంగీకృత కాంచీపుర
రంగ స్ఫ్రితిమాళి జలజ రస మధుధారన్
దుంగ కలశాభ కుచభర
గంగాధరు కుతుకలహరిఁ గని యర్చింతున్. 27

సతతంబుఁ గొలుచువారి దు
రితముల మ్రిందింపనై గరీయమునై యే
ణ తనక దీర్ఘ విలోచన
యుతమా నేకామ్రనాథు నూర్పనె కొలుతున్ 28

నగుమో మలరఁగఁ గాంచీ
నగరమునం దనిశముఁ గరుణ నెలర్చెడు నొం
డగుదేవతదా భేదం
బుఁగని ప్రమోదామృతాబ్ధి మునిఁగెద మెప్పుడున్ 29

అలఘు కుతుకంబు కాంచి
స్థలిఁదై తొగనోముపంట కా్రల నగగ నొ
దల నొప్ప కులగిరి ప్రభు
కుల మణిదీపమున నె యెదఁ గూర్మి వహింతుక్ 30

కాంచీపురమునఁ గాంచెదఁ
గాంచన కుచకలశ గరిమఁ గడుఁ బరవశమై
మంచి పగడాల కుద్దిం
గాంచిన మెయి విభ్రమాఘు ఘనవిభవంబుక్ 31

కురువింద గోత్ర గాత్రము
నురుకూలంకష కుచ కలశోదంచితమై
వరకంపదరిఁ జరించెడు
స్మరు నొండగు ఖీర సార స త్తను జోతల్ 32

కుంకుమ రస శోణాగులు
న్వంకరు పెన్పూర్వపుణ్య సంభారములు
న్వంకరములుఁ గాంచికనై
సంకాశిలు చను మొగడల జానగు శివముల్ 33

సరసీజంబుల కంధం
కరణౌషధమా నౌకానౌక కచాంకితమా
చు రహించు శంభు వంతః
పురపు టలంకార మొందు పొదలెడుఁ గాంచిన్ 34

పెగ నెసఁగు నొసలుగల పె
న్మగసిరిగల వేల్పు సతము మానింపఁగ సొం
పగుఖేలన మువకంపము
కఁగను నగేట్కులపు సిరి ఘనత్వము నెంతేఁ 35

బాగగు చనుమొగ్గలఁ దగీ
బాగా నేకామ్రనాథు సరస న్నగమై
నై గను సల్లాపంబుల
వా గరిమవు నిగ్గుఁ గాంతు మతికోమలముల్ 36

సింజన్మణి కాంచీకముఁ
బుంజిత కరుణంబు శంభు మూలధనంబున్
మాజితమ మందహసితముఁ
బింజర తనురుచి యొకండు వెలయున్గాంచిన్ 37

శివుని కనుంగవచే నెది
యవిరతమును లేహ్యమానయా లావణ్యా
ఖ్య వినూత్న సుధాధునియా
శివ లాలిత పరమశివ వసించుత నెడఁదన్ 38

మదనశు్రతిసమయ సుదీ
ర్ఘఁదగు కటాక్షముల నెసఁగి కంపాతటిఁ దు
మ్మెదలవలెఁ జికురము ల్దగఁ
బొదలెడు శుభకందముల నెపుడు పోలెదనో 39

మోముందమ్మిని నురమున
సామేన న్వెలసి పూరుషత్రియమందుం
గామాక్షి యెసఁగెదు పురం
ధ్రీమణివై త్రిధగ నీవె దేవీ సతమున్ 40

బాధ భవాబ్ధికోనర్చుచు
నాధారాంభోజకృత విహారయునై స్వే
యాధారిత కాంచీపుర
బోధామృత వీచినే యెపుడు భావింతున్ 41

అలయను నాగమపీఠీ
నిలయను జిద్వ్యలయ మాళిని స్నలవెలయన్
వలయాంకుని మేనొాలయం
గల యాచెలియ నెదఁ దలఁపఁగానే నలయన్ 42

శర్వాముఖ పరమసాధక
గుర్వానీతంబుఁ గామకోటి గతంబౌ
సర్వాకృతియగు శోణిమ
గర్వంబున కర్పితంబుగ నెద నొనర్తున్ 43

అమ్మా తావక పదభజ
నమ్మున మోదమ్మునెనయునరునకు భవ బం
ధమ్మొదవునెడలఁ గడలి జ
లమ్మునఁ బెనుశిలయుఁ దేలి లలిఁ దిరుగదొకో 44

సమయగు మతి శీలితయును
సమయ స్సంధ్యామయూఖ చయములతో ని
త్యముఁ గాంచీపుర రతయా
నుమతోఁ దాదాత్మ్యము నెనయుదుఁగాత వెసన్ 45

కుండిని ! కుటిల ! కుమారీ!
చండీ! స్థావర చరాద్య జనయిత్రి! చా
ముండా! గుణిని! గుహారణి!
దండము గురుమూర్తి! గుహ్యతమ! కామాక్షీ! 46

భ్రమియింపఁ జేసెదవు వి
శ్వముఁ జిదచిద్రూపవు మఱి సభిదా భేదా
ధ్యము లాకృతులూనెదు నీ
వమృతవు ననహంతవును నహంతవు జననీ! 47

శివ! శివ! కాంతురు సమముగ
భవనమ్ము వనమ్ము మిత్రుఁ బరు లోష్ఠంబుగ
యువతీ బింబోష్ఠముఁ గా
మవిలోచని నూచినట్టి మహితులు ధాత్రిన్ 48

కామవిరోధి ప్రణయిని!
కామేశీ! కామపీఠకామధ్యగతా!
కామదుఘవగుమి కమలా!
కామకలా! కామకోటి! కామాక్షీ! యోగి 49

హృదయాబ్జ మధ్యమందున
నుదుటిదియా నర్ధమందును న్మూర్ధపు న
డ్మిఁ దగి రవి శక్రచాప కు
ముదబంధు సమాభఁ గొల్తుము భవాని నెదన్ 50

కాంచి న్నగరీ లోలతఁ
గాంచి సమస్తాగమవననఘనయంత్రిపతం
త్రించద్రూపముచే మృదు
సంచగు కామాక్షి నాదు స్వాంతముఁ దనుపున్ 51

మందిరమును గాంచీపురి
నంది వియద్బిందునాదతాంచిత యొండౌ
నిందురవి మండలస్తని
సుందరి నాయెడదఁ నెపుడు శోభిలుఁదుష్టిన్ 52

ఇంచుం దీ పెకు నీడై
సంచు న్గంపాతటాన సతమందెడు సి
ద్ధాంచ ద్భైషజ్యము నొం
డుంచెద నెద దుర్భవజ్వరోద్ధతి నార్పన్ 53

మదనార్యార స్సపీఠిక
కుఁ దెలియనౌ చనులగట్టి కుదిరిక గల యా
మదన బ్రహ్మ సుతత్త్వా
స్పద నానంగద భజింతు భక్తి సతంబున్ 54

విలుఁ బాశము నంకుశము
న్లలిఁ గరములఁ దాల్చి స్వీయ మెలర్చెడురీతు
ల్లల యాగమ సిద్ధాంతము
సులలితమా గాంచి శంభు శుద్ధాంతమహో ! 55

ఆ బ్రహ్మ స్తంబంబౌ
నబ్రపు శిల్పంపు రచన నలరిన యాద్యం
బౌ బ్రహ్మవిద్య నతుల న
దభ్ర న్భావింతుఁ గాంచి కాంతర సంస్థన్ 56

శ్రీకామాక్షీ ! నిను క్షణ
మేకాగ్రతఁ దలఁచు నాతఁ డిల మూఁగయు న
స్తోకపు దుర్గతి శోకియు
లోకోత్తర కీర్తియై విలోకింపఁ బడున్ 57

పంచదశ వర్ణ రూపము
నంచితము న్గాంచికా విహార చతురమున్
బంచ శరీయము శంకర
వంచనఁ బాండిత్య యుతము వాసి భజింతున్ 58

సుమతులదౌ సౌషుమ్నా
ఖ్యముఁ దెరువుంబూని నాలుగా రీతుల మా
ర్పు మొనసి యేఁబదియా వ
ర్ణములఁ గృత పద శిల్పఁ గామ నయన భజింతున్ 59

ఆది క్షాంతాక్షర రూ
పోదార న్విద్యఁగా గురూత్తములని రా
స్వాదిష్ఠ చాప దండను
నేదిష్ఠ న్గామకోటి నిష్ఠ నె నాకున్ 60

స్వాసనయు హార్షితస్మర
శాసనయు న్సర్వలోక చయ భాసనయున్
శ్రీసత్కాంచ్యాసన యు
వ్యాసమిదు న్గలితశంబ రాసన ముదమున్ 61

ప్రేమము కంపపయి న్న
స్థేమము యతి చేతములను శిరమున సోముఁ
సామము నిత్యోక్తులఁ దగ
భూమంబున హైమవతియుఁ బొలిచెదు నెపుడున్ 62

కౌతుకముఁ గంప యెడఁ దగి
చేతస్సంజాతకలిత చేతము తోడన్
ఖ్యాత మహాకుల దేవత
చేత న్నా ప్రతిభ విచ్చిచెలఁగుత సతమున్ 63

చూత తరుమూల ధారుణి
వాతహిత తిలకుఁడగు నొక వయసు మగనితో
బాతిగఁ గలసిన మెయితోఁ
బ్రీతి న్సంవిత్స్వరూప వెలసి రమించున్ 64

కాంచీ దేశగతంబయి
పంచాశుగ గర్వలక్ష్మి వాసం బెసఁగున్
గాంచి యెటో హృత్పేటిక
నుంచి పదిలపఱచితిని మహోత్తమము మణిన్ 65

కోరి భజించెద నుమ! నీ
కారుణ్యము దరవికసిత కౌసుంభ సమా
నారుణ్యము దగ్ధమద
ధ్వారణ్యముఁ గంప నెసఁగు తారుణ్యంబున్ 66

అనుపమతఁ గాంచెఁ బెరిఁగెడు
ననవరతానందపాక మదియొకఁ డరుణ
త్వ నితాంతగర్వ పల్లవి
తను దానిం గనుల విందుఁ దగఁ గావింతున్ 67

బాణ సృణిపాశ ధనువులఁ
బాణులఁగొని కామకోటి భాసురమై బా
లారుణధర శోణవహామా
శోణిమ పరిపాక మొందు శోభిలుత నదన్ 68

బింబాధరమును దరహా
సంబది చుంబింపఁ గర మెసంగు ముఖసరో
జంబు గల యంబ యంహ
స్సంబాధక యెదరహించెఁ జాల్కృతి నైతిన్ 69

శివ శ్రీకామాక్షి సదా
శివమయమహా పరశివ మయ శృంగార సుమహా
ఘు విపుల పర్యంకము నం
దు విరాజిలుఁ జక్రిమందుఁ దోరపుసిరితోన్ 70

ఏలఁబడఁ దగుదుఁ గాంచీ
పాలికచే శ్రుతి సతీ శుభకేరాలక స
న్మాలికచే భూరి కృపా
స్థాలికచేఁ దుహినశైల సద్బాలికచేన్ 71

మాయా ! పురత్రియాంతక
జాయా! కాంచ్యాశ్రియా ! యజస్ర పృథు కృపా
మేయా ! యార్తిహాగంబా
నీ యడుగుందమ్మి లీవ నియతి వసింతున్ 72

జొ దల విరిఁగఁ జకోరా
మోదక సామ్రాజ్యమూని ముక్త్యంచిత భ
వ్యోదార మూర్తిఁ గంపా
మోదిని యా నంబ యెడఁద ముదము నినుచతన్ 73

నియతిని మ్రొక్కెద నే శ్రుతి
మయికి న్నళి బిందు నాదమయికిఁ బరపదా
ద్వయికి న్బ్రకృతి మయికి న
నయమును మను యంత్ర తంత్ర నామమయికినిన్ 74

అనిశము విహరించుత నా
మనమునఁ దాఁ గామకోటి మహిత సుకవి సూ
క్తి నిచయ రసధాటి కృపా
ఘన పాకీయ పరిపాటి కరము వఱలుచున్ 75

కుటిలముఁ గచములఁ గన్నులఁ
జటులముఁ బృథులంబు రమ్య జఘనంబులఁ బ
త్తటముల మృదులతఁ గంపా
తటగముఁ బ్ర ఘ తేజముఁ గని తగ భజియింతున్ 76

శ్రీకామ నయనదా న
స్తోకంబు ప్రసాద దీప సద్ద్యుతిఁ బ్రత్యా
శ్యానైకల్య దృష్టిఁ బక్వా
స్తోక పరశివోల్లసనముఁ జూతు నతులమున్ 77

నిను బ్రహ్మ విషయఁ గాత్యా
యని భైరవి వింధ్యఁ గాళి నాదిమను గల
న్వినుతింతుఁ గామకోటి శి
వను భారతి శాకిని స్సుభద్ర శివ సతిన్ 78

కేలు మొగిడ్చెద సురజన
పాలినికి న్మాలినికిఁ గపాలినికి మహే
ట్పాలిని కరికాలినికి సు
మాలినికి న్గాంచి విద్రుమ సుశాలినికిన్ 79

కామాక్షి కామ నిగమము
నామక్కంటికిని నేర్ప నగు నొజ్జ యిదా
నేమో ! తావక తాద్ర
క్కోమల తారుణ్య గరిమ కుధ రేట్తనయా ! 80

ఏనుఁగు గుబ్బల యుబ్బున
కూనత నొనరించు చనుల యురుత కొరగులేఁ
గానసఁగ శివుని కనులకుఁ
దేవియ జడిమైన యరుణ దీప్తి కెంజిగెదన్ 81

కాంచితిఁ గాంచినిఁ బురుమణి
కాంచనమయ కాంచిఁ దగు నొకానొక సంచున్
మంచి దయ నతుల యెడఁ బరఁ
గించుచుఁ గంపదరి మమ్మొగి న్ననుపంగన్ 82

పరమశివు కురువునకు నా
భరణంబు న్నలలఁజేని ప్రథిత శ్రీయో
త్కరసన్నాహముఁ గంపా
పరిసరగముఁ గాంతు వెల్గుఁ బరమ గురు కృపన్ 83

అమ్మా! తారుణ్యా రమా
యమ్మా చాతుర్య గరిమ మమ్మదనుని భ
స్మమ్ముగఁ జేసిన వారు చొ
క్కమ్మగు నా బ్రహ్మచర్య ఘనత న్గలఁచుఁ 84

కట్టి మొల నాకులను గయిఁ
బట్టి ఖనిత్రంబు మదకబంధ దళాలఁ
బెట్టి ఫణులెసఁగ వేషము
వెట్టు గురింజ నగల చెంచు వెలఁదికి జోతల్ 85

కురువునఁ గీర వెసఁగ బరి
సరమందు న్నైభరవీ వ్రజమును నుగాయ
న్నయు మండలి లగ పీనుల
దర కుండలములు సెలంగఁ దనరెద వంబా! 86

భర్గుని మెప్పింపఁగ రణ
సర్గము నొనరించి సింహ సంసర్గవునై
దుర్గతులనొంచి కృప నప
వర్గము దుర్గవయి భక్త వరుల కిడెదుగా 87

భండనమున నుద్దండయు
ముండ లసత్కరయు నాంత్రపుంజ ధరయు వే
దండ చలన కృచ్ఛ్రివ చా
ముండ ధృతాసుర శిఖండ పోలఁగ నీవే 88

అన్నంబునఁ జెన్నగు మే
లొన్నపు గరిటెఁ గొని దాన స్ఫూర్జ ద్దయచే
మిన్నయగు లేమినా వెతఁ
గ్రిన్నన మ్రందింతు వీవె కామాక్షి ! మహిఁ 89

కొట్టఁబడు వైరుల న్వెతఁ
బెట్టి గెడప దశనములగు పృథుహాల ముసలా
ల్పట్టి వరాహాననవై
గట్టిగఁ గ్రిడింతు వీవెకా కామాక్షీ ! 90

సొన్నంపుఁ జెన్నుఁగొను మెఱు
వన్నెం దగి తమ్మిదండ వఱలఁగఁ గయి ము
క్కన్నుల వేలుపు వలచు ర
తి న్నగడెదు బాలవౌ రతిప మణిగేహా ! 91

స్మరమథన వరణ లోలవు
కరాబ్జధృత మాలవు కనక ద్యుతిచయ త
స్ఫుర శీలవు మన్మథ వి
స్ఫుర ద్విలాసమణిశాలవు జగజ్జననీ ! 91

కమలకుటి నమల పటినై
యమరిచి కచ్ఛపిని నొడి శయాంబుజములఁ బొ
త్తము నక్షమాల తగఁ జప
లము లక్షులఁ జెలఁగు నలువ లలనవు తల్లీ ! 92

అమ్మా ! కుంకుమరుచిపిం
గమ్ము నసృక్పంకముగ్ధ కాలాళి విభా
త మ్మెనయు జయము నీరూ
ప మ్మభయ పటీవరద జపకృతి కరమ్మై. 93

పసిఁడిగతనాల మేల్నగ
వెసఁగ న్గాలాయసంపు టెలమిగెలుచు మై
మిసిమిఁదగునిన్నుఁ గరసా
రసగకపాలత్రిశూల రహిఁగొల్తు నుమా ! 94

కొందఱుపుణ్యాత్ములు తమ
డెందముచేఁగాంచెదరు పటీయారుణిమా
మందంపు రాశి నీమో
మందముఁజనుదోయిఁగాంచి నమ్మ ! మహితమున్ 95

నాలుగు నాఱును బది ము
న్నాలుగుఁ బదునాఱు రెండు నాడెంపుదళా
ల్కా్రలు కమలాలచే గిరి
బాలా ! పొందెదు సహస్ర పత్ర కమలముఁ 96

అంబా ! కొందఱు గురు చర
ణంబులఁ బూజించి నీఘనకరుణ నపవ
ర్గంబనెడు మేడనుం ద్రభ
యంబుగ బీజయుగబీజమౌ యోగమునఁ 97

జంతుతతిలోన వెలి నీ
వంతకసంహారుసహాంత వౌనమ్మరో ! రా
ణింతువు భజించు భక్తుల
కెంతయు మహిమమ్ముఁగూర్చు చెప్ప మహేశీ ! 98

కలమంజూక్తులచే రా
చిలుక న్గళపంజరిగముఁ జింతించి గ్రహిం
ప లతాంతాస్త్రిం డెరఁగా
నిలిపిన బింబఫల మంబ ! నీయధర్మమహో 99

జయమగుత శంకర ప్రియ
దయితా ! జగదంబ ! శీతధరరాట్తనయా !
జయము శివా ! కామాక్షీ
జయము చిదాకాశ ! చంద్ర సచ్ఛవిధారా ! 100

సత్సంతాన ప్రిన్స్యా!
క్షత్సదనా ! మృదుమధూక్తి రాజత్కవితా
వత్సంచ్ఛయమ్మూర్ధన్య ! సు
వాత్సల్యేక్షితసుశిష్య వార ! గురువరా !

కంద, గీత గర్భితోత్పలమాల

ధీచతురాగ్రిణీ ! బుధవిధేయ ! తులాతిగపుణ్యభాసి !య
చ్ఛాచరణా ! లసద్గుణచయామల రత్నసుకోశభూత ! వి
ద్యాచతురాస్య ! సత్కవినుతప్రతిభాకర ! కావ్యకారి ! భా
గ్యోచితధీక ! సన్నిగమ యూధసమాదర ! నిర్మలాత్మకా !

పై పద్యమునందలి కందము.

చతురాగ్రిణీ ! బుధవిధే
య ! తులాధికపుణ్యభాసి ! యచ్ఛాచరణా !
చతురాస్య! సత్కవినుత
ప్రతిభాకర ! కావ్యకారి ! భాగ్యోచితధీ !

పయి యుత్పలమాలయందలి గీతము.

బుధవిధేయ ! తులాతిగ పుణ్యభాసి !
గుణచయామల రత్నసుకోశభూత !
కవినుతప్రతిభాకర ! కావ్యకారి !
నిగమయూధసమాదర ! నిర్మలాత్మ !

పూరుషో త్తమసత్కవీశ్వరపుత్త్రి! యతి... జ
న్నిరజానిశపూజనాదర ! నిర్మలాంతరభా...
సూరిస త్తమశస్యభవ్య యశోవిభాసిదిశాంతర
ధారుణీసురవంశ్య ! నాదెశ దక్షిణాస్య ! గురూత్తమా !

గద్యము.

ఇది శ్రీమచ్ఛంకర సద్గురు కరుణా సమాసాదిత సరస కవితా
విభాస్వర, ప్రివర్ధమాన శ్రీమద్భమిడిపాట్యన్వయ పయః
పారావార రాకా సుధాకర, శ్రీమచ్ఛాండిల్యస గోత్రి
పవిత్రి, సంతతాగ్నిహోత్రి పరిచర్యోపాత్త ఘన
తర సద్వైదుషీవిరాజమాన పేర సోమయాజి
పౌత్త్రి, బుధజనసంభావ్య సచ్ఛేముషీకలిత
వేంకటాచలపతిసుధీతనూభవ నైరంతర్య
భక్తిసంభావితభవానీ ధవ విబుధ
జనవిధేయ వేంకటసుబ్రహ్మణ్య
శర్మాభిధేయాంధ్రీకృతంబైన
శ్రీకామాక్షీ స్తుతి యం
దలి యార్యాస్తుతి
శతకము సర్వము
సంపూర్ణము.

శ్రీ మేధా దక్షిణామూర్తి సద్గురు వరార్పితము.

